

'బడికి పోదాం రా రా!'

— ఫొటో ఎ సంపత్‌కృష్ణ.

# ఆమె సౌందర్యవతి...
# ఆమె **పాండ్స్‌**ను ఉపయోగిస్తుంది



మీ ముఖమును మృదువుగా మరియు
మనోహరముగా ఉంచుకొనుటకు

# పాండ్స్

వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడండి




తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీము చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది అది జిగురుగా ఉండదు మరియు రాసుకొన్న మరుక్షణములోనే కనపడకుండాపోతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పౌడరును అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటలతరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.

> చర్మమును శుభ్రపరచే క్రీమ్ ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును శుద్ధి రాసుకోండి అది చర్మమును శుభ్రపరుస్తుంది మరియు మీ లావణ్యమును కాపాడుతుంది.

పీ.యూ.పాండ్స్ ఇన్కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 6

21-10-59
బుధవారం

వికారి ఆశ్వయుజ బహుళ చతుర్థి

★

ప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
శ్రీ వెంకటరమణావారి
"బాలనాగమ్మ"లో
అంజలీదేవి



# ఉత్తరాలు

## తెలుగు వెలుగులు

అయ్యా, మీ పత్రికలో ప్రకటిస్తున్న "తెలుగు వెలుగుల"కే వెలుగు పెడుతున్నది శ్రీ నాయుడు గారివిూద వ్యాసం. నారాయణబాబుగారి వ్యాసం చదివాక నాకు ఒళ్లు గగుర్పొడిచింది.

—చెరుకువాడ నరసింహమూర్తి,(మృదంగవిద్వాన్) మద్రాసు.

* * *

శ్రీ నాయుడుగార్ని గురించి శ్రీరంగం నారాయణబాబుగారు చాలా బాగా వ్రాశారు. నాయుడుగారి ప్రోగ్రాం రేడియోలో వింటుంటే—అయిపోయినా అలానే కూర్చునేదాన్ని. పత్రిక పట్టుకొని అలాగే "తెలుగు వెలుగులు" శీర్షిక చదువుతూ కూర్చున్నాను. ఎంతసేపు అలా కూర్చున్నానో, ఎన్నిసార్లు చదివానో తెలియదు. రచయితగారు చక్కని మాటల కూర్పుతో చాలా బాగా వ్రాశారు. వారికి నా ధన్యవాదములు.

జి. లక్ష్మి, హైద్రాబాదు.

* * *

## జపాను యాత్ర

శ్రీ వెంకట సుబ్బయ్యగారి 'జపాను యాత్ర' వ్యాసం బాగుంది. వ్యాసం చదువుతూంటే జపానులోని వింతలన్నీ మనం కూడా చూస్తున్నట్లే అనిపించింది.

"మన ప్రాచీనసాంప్రదాయాలను, జీవిత పద్ధతులను కాపాడుకో గలిగిన మన జాతీయతను స్మరించి గర్వించాను" అన్న వెంకట సుబ్బయ్యగారి మాటలు నన్నెంతో ఆకర్షించాయి.

జపానులోని హోటలు నాయరుగారు మన భారత ప్రభుత్వాన్ని, ప్రధాని నెహ్రూని ఎందుకు తిడతారో నాకర్థంకావటంలేదు.

ఆచంట కృష్ణవేణి, పెరవరం.

* * *

చింతలపాటి వెంకట సుబ్బయ్యగారు తాము చూసిన ప్రతి ప్రదేశము, వాటి వివరాలు చాలా చక్కగా వివరించారు. ఇవిగాక జపాను, జపానువారి నాగరికత, వారి అలవాట్లు ఆచారాలుగూడా చక్కగా వ్రాశారు. వ్యాసము చదువుతున్నంతసేపు హాయిగా చదవబుద్ధి వేసింది. రచయిత ఆకర్షించిన విషయాలే నాకు వాటిని చూడకుండా వ్యాసము చదవగా నే ఆకర్షించాయని తెల్పుటకు చాలా సంతోషిస్తున్నాను. వారికి నా ధన్యవాదాలు.

ఎర్గొని సోమసుందర్, గుత్తి

* * *

చదువుతున్నంతసేపు నేను నిజముగా జపానులో ఉన్నానా అని అనిపించింది. వారు అక్కడ చూచిన విషయములను

[illegible]

# వారాలు తెచ్చే బెడదలు | సికింద్రాబాద్‌లో గాంధీగోష్ఠి | కూటికోసం కోటివిద్యలు

## రాజధాని కబుర్లు

ప్రవీణ్

విసుగూ విరామం లేకుండా వారాన్ని తరుముకుంటూ వారం వస్తూంటేనే ప్రాణాంతకంగా ఉంది 4 రోజులు గడవని ఈ రోజుల్లో. వారం తిరక్కుండానే వారం వస్తే? ఏం చేయాలో తెలియదు ఏం చేయాలో తెలియటల్లేదు. ఒక్క వారంలోనే అనేక వారాలొస్తే —ఇక చెప్పనే అక్కర్లేదు.

వారాలంటే మొదట్నించీ మనకు ఎందుకో అభిమానం. యాయవారానికి వచ్చే వారిని ఆదరించాలని పెద్దలు చెబుతారు. వారాలు చేసుకు చదువుకున్న వారిని గౌరవిస్తాం మనం. ఇంతవరకు బాగానే ఉంది. వర్షాలెక్కువై పంచవర్ష ప్రణాళికలను వ్యర్థం చేస్తూన్న ఈ రోజుల్లో, అమెరికా వద్దకి, ఆస్ట్రేలియా వద్దకి, కెనడా వద్దకి, రష్యా వద్దకి, గోధుమలకోసం, అవి పండించే యంత్రాలకోసం, అవి నడిపించే ప్రవీణుల కోసం 'వారాలకు' పోవడం తప్పనిసరి అయింది మనకి. గత్యంతరం లేదు.

మనల్ని బాధపెట్టే వారాలవి కావు. సంవత్సరానికి భగవంతుడిచ్చిన ర వారాలు కాక, నెల్లో కనిపించ వారాలు కాక, ప్రభుత్వం రాజ వేత్తలు తమ సౌకర్యంకోసం సృష్టి వారాలు మనల్ని అదలించి కూచో తాయి. గత నవంబరు మొదటి రెం వారాల్లో మొత్తం ఐదువా లు గడిచాయి అనుకున్నా ఈ అక్టోబరు మొదటివా తిరక్కుండా, అరడజ వారాలు గడిచాయి.

వారానికున్న ఏడు రోజుల్లోను, రో ఆరుగంటలు సగటున 'ఇది—అదీ' ప్రసా చేసే ఆకాశవాణి, అది చాలదన్నట్లు సంవ కొకసారి 'రేడియో వారం' చేసు 'హాస్యవల్లరి' కార్యక్రమం తగిలి నేలమీద



ఈ నెల 10వ తేదీన వరంగల్లులో ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాల భవనానికి శంకుస్థాపన చేస్తున్న ప్రధాని నెహ్రూ, వారి ఎడమ ప్రక్కన ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి. ఆంధ్రరాజధాని హైదరాబాద్, నాగార్జునసాగర్ ప్రాజెక్ట్, విజయవాడ, తిరుపతి మొదలైన ముఖ్యస్థలాలనుకూడా శ్రీ నెహ్రూ తమ పర్యటనసందర్భంలో దర్శించారు.

# ★ రాజధాని కబుర్లు ★

రున ఏళ్ళే శ్రోతలను '(అవ) హాస్య రం' ఒకటి జరిపి మరింత ఏడిపిస్తుంది.

కొన్నాళ్లూ సంవత్సరం పొడుగునా ఇచ్చినా, టెలిగ్రాములు ఇవ్వక యినా, టెలిఫోనులు ఒకరివొకరికి కలిపి నాయకలతోలు సాధ్యం చేసినా, ఒక హార్ద వారం' జరిపేసి, చేతులు కడి సుకుంటుంది తంతి తపాలాశాఖ. ఇదేపని సె, దైన్య సుఖంగా, ఆనందంగా కేరిం న కొట్టి నవ్వుతాయి. ఇదేపని చేసి, ఒకరి ప్ర మరొకరు తట్టుకుంటారు పోలీసు రు.

వన మహోత్సవం సంగతి చెప్పనే క్కర్లేదు.

పండిట్జీ చిన్నతనంలో ఒకసారి పుట్టిన జు ఎంత బ్రహ్మాండంగా జరిగిందంటే — ంవత్సరానికి రెండుసార్లు వస్తే బాగుణ్ను ట్టినరోజు' అనుకున్నాట్ట ఆయన. ఇది మన ప్రధానికాకముందే బయటపెట్టాడు. సంగతి ఇప్పుడు జ్ఞాపకంచెయ్యడం ంచిదికాదు: నవంబరు పధ్నాలుగుతో ారంభించి, వారం వారం ఆయన ట్టినరోజు పండగ చేయగలరు నాయక ణ్యులు. అనగా ఆయనపేర ఒకపిల్ల(ల) రం ఏర్పాటు చేయగలరు.

గాంధీజీ పుట్టిన తేదీ అక్టోబరు రెండు. ని పురస్కరించుకొని, వారాలు లేవతీశారు ంలో నాయకులు: ఒకటి జాతీయవారం. రొకటి మద్యపాన నిషేధవారం. వేరొకటి ందీవారం. ఇంకొకటిఖాదీవారం. ఇవికాక ంకొ ఒకటి గని(నూనె) వారం. ఆకాశ ాణి నిర్వహించే 'గాంధీచర్చ'ల్లో పాల్గొనే రు, గాంధీజీనిగురించి అరనిముషం, మ ప్రతిభనిగురించి తొమ్మిదిన్నర నిమి ాలు చెప్పుకొంటుంటారు. ఈవిధంగా మేము ఖులాసా వారం' అని వారక ర్తలు ప్పుకోడానికి ఉపయోగపడు తున్నాయి ారాలు.

* * *

## గాంధీ చర్చ'

ఈవిధంగా కాకుండా, శ్రీ మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీని గ్రహంగా కాకుండా వ్యక్తిగా పేక్షకులకు రూపొందించడానికి క ప్రయత్నం ఈవారం సికింద ాబాదులో జరిగింది. రమారమి క ఏభైసంస్థల అధ్వర్యాన ఒక 'గాంధీచర్చ' ఏర్పాటుచేయబడింది రాష్ట్రపతిరోడ్డుపైనున్న శ్రీబూరుగు మహాదేవు ప్రెష్టి హాలులో.

ఈ చర్చా ఫలితాన్నిబటి కాకపోయినా, ప్రయత్నం దృష్టినుంచైనా, ఈ చర్చ ఏర్పాటు చేసిన సంస్థలను ముఖ్యంగా దేశోద్ధారక సమితి కార్యదర్శి శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిని అభినందించాలి. చర్చకు డా. గిడుగు సీతాపతి అధ్యక్షతవహించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించిన గాంధీ రచనలసేకరణసంఘం కార్యదర్శి శ్రీ శ్రీవిడి లింగరాజు ["రాజకీయ వేత్తగా గాంధీజీ"]



అస్సాం కొత్తగవర్నర్
శ్రీ నగేష్

శ్రీ జి. సురమౌళి [గాంధీజీ కనిన కలలు",] స్వామీ రామానంద తీర్థ ["గాంధీజీ ధర్మకర్తృత్వ సిద్ధాంతం"]—ప్రసంగించారు. "గాంధీజీ-సాహిత్య దృక్పథము" అన్న విషయంపై ప్రసంగించవలసిన శ్రీ గోరా శాస్త్రి సభకు హాజరు కాలేకపోయారు.

సమాజంలో అందరూ శ్రమించినప్పుడే, ఆ శ్రమ ఫలితంగా సంపద ఉత్పత్తి ఔతుంది. కొందరు శ్రమ పడకుండా, సంపద ననుభ వించడానికి సిద్ధపడ్డం అది అక్రమం. అందరి శ్రమ ఫలితం కనుక సంపదలో అందరికి భాగం ఉండాలి, ఆస్తిపై వ్యక్తి సంపూర్ణాధికారం ఆమోదించరానిది. సమాజంలోని 'ఐశ్వర్యవంతులు' పేదల కొరకు వ్యవహరించే ధర్మకర్తలు. ఇదిస్థూలంగా గాంధీజీ ధర్మకర్తృత్వ సిద్ధాంతం.

గాంధీజీ ఊహించుకున్న సమాజం నీతి నియమాలు ప్రాతిపదికపై ఏర్పడుతుంది. ఆ సమాజంలో కొందరివే ప్రయోజనాల కోసం ఎందరివో శక్తి సంపత్తుల దుర్వినియోగం ఉండదు. వ్యక్తుల ఆశలు, కోరికలు తీరడం కోసం కాక, సమాజంయొక్క అవసరాలు తీరడం కోసం ఉత్పత్తి సాగుతుంది. గాంధీజీ ధర్మకర్తృత్వ సిద్ధాంతపు ప్రాతిపదికపై నిర్మాణమయ్యే సమాజం నెలకొల్పడానికి పెట్టుబడిదారులు తమంతగా తాము యత్నించాలి. వారు యత్నించక పోతే-ప్రభుత్వం జోక్యం కలుగ చేసికోవలసి ఉంటుంది.

స్వామీజీ హిందీలో ప్రసంగిస్తూ, గాంధీజీ ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని చక్కగా వివరించారు. రాజకీయ వేత్తగా గాంధీజీ గిటు దాటని సిద్ధాంతాలు కొన్ని ఉండేవని, అక్కడవారు ఏట్టి పరిస్థితుల్లోను రాజీపడే వారు కారని, మిగిలిన కొన్నిటి విషయంలో మాత్రం అవకాశాన్నిబట్టి, అవసరాన్నిబట్టి వెనుకంజ వేసేవారని, శ్రీ శ్రీవిడి లింగరాజు తెలిపారు. గాంధీజీ కలలు కొన్ని ప్రస్తావించి అవి ఈనాడు కలలుగా ఎలా మిగిలిపోయాయో శ్రీ సురమౌళి నిరూపించారు.

శ్రీ ఆళ్వారుస్వామి "వందన సమర్పణ"తో సభ ముగిసింది. సభకు ఆలస్యంగ వచ్చిన సభికులను వక్తలను ఆయన మందలించి, ఉపన్యాసాలు రాసుకురమ్మంటే రాసుకు రానందుకు విచారంవెలిబుచ్చి, అరగంటంటే గంటచేసిన వక్తలను సూచ్యాసూచ్యంగా పరామర్శించారు ఆయన. ఆ మందలింపు, ఈవిచారం, ఆ పరామర్శ ఆయన సమర్పించిన వందనాల్లో పొదుగబడ్డాయి. ఇదొక ప్రత్యేకత ఈ సమావేశంలో. ప్రేక్షకులకు కూడా పనులుంటాయని, వాళ్ళకాలానికి కూడా విలువఉంటుందని వక్తలు ఎంత త్వరితంగా గమనిస్తే అంతమంచిది. పదేపదే ఈ విషయాన్ని వక్తలదృష్టికి తెస్తూన్న శ్రీ ఆళ్వారుస్వామి అభినందనీయులు.

ఈ వారంలోనే 'సినీ—నాకథ' అనే గోష్ఠిజరిగింది కళానికేతన్ వారి అధ్వర్యాన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో. పై అభిప్రాయాలు ఈ గోష్ఠికికూడా వర్తిస్తాయి. మళ్ళీవారం ప్రస్తావిద్దాం 'నాకథ'ను గురించి. ఈవారం వినండి—

## శ్రీ కృ. జ. స్థా. [భయపడుతూ] చెప్పిన కథలు

కటకటాల తలుపు కొద్దిగా తెరిచి, భయపడుతూ బయటకు చూసి 'ఇంకా ఉన్నావా అక్కడ?' అంది శ్రీకృష్ణజన్మస్థానం. 'ఉన్నాను

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# దీపావళి సంచిక

**(4-11-59)**

ప్రత్యేకాకర్షణలు

## పోటీలో గెలుపొందిన రెండు ఉత్తమ కథలు



భయానకమైన సన్నివేశాలతో తహతహ పుట్టించే

## "లంకెల బిందెలు" (బాపుబొమ్మల సీరియల్)



ఇంకా ఎన్నో చక్కని కథలు, ప్రత్యేక వ్యాసాలు, గేయాలు, పండుగ చిత్రాలు, ఫొటోలు, ఇతరశీర్షికలు

  

ముందుగానే మా ఏజెంట్లవద్ద మీ కాపీ రిజర్వు చేసుకోండి


నే నెక్కడికి పోతాను?' అంది నృసింహ జన్మస్థానం. 'ఐతే-విను : కథలు. మళ్ళీ ఎవరితోనూ చెప్పక!' అంది రహస్యంగా, కంఠం తగ్గించి శ్రీ కృ. జ. స్థా.

"కూటికోసం కోటివిద్యలు. ఈకోటిలో ఓ అరకోటి ఖరవా లేదనుకో. మరో ఇరవైఐదు లక్షలుకూడా ఖరవాలేదు. అదుగో ఆ చివరున్న పాతికకోటి అవలంబించే పోలీసువాళ్లు బేడీలుతెచ్చి చేతికి తగిలిస్తారు.

"సాంబశివరావని రాజమండ్రి వాడు. ఓ పదేళ్ల యిందిట రాజమండ్రీ వదిలి, ఉత్తర హిందూదేశంపోయి అవీ ఇవీ చేసి, చివరికి గ్వాలియర్ జెయిల్ గోడలమధ్యకు చేరుకున్నాడు. ఐదుసంవత్సరాలైంది. ఐదు సంవత్సరాల్లో ఎన్నో జరగచ్చు. జరిగాయికూడా. విశాలాంధ్ర ఏర్పడిందిగా?"

"గ్వాలియర్లో మన చుట్టాలింట్లో ఉండి ఉండి, కటకటాల గదితలుపు తెరుచుకొని సెప్టెంబర్లో బయటకు వచ్చాడు సాంబశివరావు. 'మన' హైదరాబాదు చూద్దామని బయలుదేరాడు. సికిందరాబాద్ స్టేషన్లో దిగి, మినర్వాటాకీస్ దగ్గరున్న మాంటిస్ హోటల్ వరకూ వచ్చాడు. అక్కడొక ఖాళీటాక్సీ కనపడింది. అందులో ఒక సంచీ కనపడింది. సంచీలో ఏమున్నదో తెలియదు కాని, ఎందుకైనా మంచిదని అది చేత్తో పట్టుకున్నాడు. ముందుకు నడిచాడు."

"రాజధానిలో ఆంధ్రులు రెండు రకాలుగా ఉంటారు—సాధారణంగా. కోస్తా ఆంధ్రుల్లా ధారాళంగా తెలుగు మాట్లాడే, 'వాడు వుంది, అది ఉన్నాడు' అంటూ ఉర్దూ నిస్సందేహంగా మాటాడేవారు; ఉర్దూ తప్పులేకుండా మాటాడేవారు. ఉర్దు తెలుగు రెండూ మంచినీళ్ళు త్రాగేసినట్లు గడగడా మాటాడేస్తున్న సాంబశివరావు తిన్నగావెళ్ళి మొజంజాహీ మార్కెటు సమీపంలో ఇన్స్పెక్టర్ శ్రీపుల్లారెడ్డి చేతుల్లో పడ్డాడు. 'సంచీలో ఏముంది?' అంటే చెప్పలేకపోయాడు. చూసేగా ఏముందో? 'ఎలావచ్చింది నీకీ సంచి?' అంటేకూడా చెప్పలేకపోయాడు. తర్వాత అంతా బయట పడిందనుకో."

"ఇప్పుడెక్కడ వున్నాడు?" అంది జ. స్థా.

"మనదగ్గర. నాలుగు నెల్లదా ఉంటాడు. అదిగో విను. 'ఇంతేనా ఈలా ఇదా మనరాజధాని!' అని పాడుకున్నాడు" అంది శ్రీ కృ. జ. స్థా.

## "కోటివిద్యలు"

అక్టోబరు పదవతేదీ బుధవా ఉదయం నగర డిప్యూటీపో కమిషనర్ శ్రీ ఎస్. వేణుగో రావు గుర్రపుస్వారీ చేస్తున్నా ప్రతిఉదయం గుర్రపుస్వారీ చే డం ఆయన దైనికకార్యక్రమం భాగం. వెనుక రక్షకభట అ రోహకదళానికి చెందిన ఒకపో జవాన్ ఉన్నాడు. హఠాత్తు 'చోర్, చోర్' అన్న కేక

పామొలివ్ సౌందర్య రక్షణ

# మీ దేహకాంతికి క్రొత్త శోభనిస్తుంది!



మీ దేహకాంతికి క్రొత్త శోభను చేకూర్చుకోగలరు. పామొలివ్ సౌందర్య రక్షణతో దానిని ఎంతో మృదువుగా, తాజాగా ఉంచుకోండి.

పామొలివ్ సబ్బుతో మీరు మొట్టమొదటి సారి శోముకొంటే అది చర్మమును శుభ్రపరుస్తూనే దానిని మనోహరముగా చేసినట్లు చూస్తారు. భారతదేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములు చేరిన పామొలివ్ సబ్బు ఎంతో సౌమ్యమైనది మరియు శుద్ధమైనది. దాని సమృద్ధియగు మీగడవంటి నురుగు దేహమును నిర్మలముగా చేసి మీకు క్రొత్త శోభను చేకూరుస్తుంది: పామొలివ్ సబ్బును వాడితే మీ చర్మము మృదువుగా, యవ్వనవంతముగ మరియు సొగసుగా అగుట చూస్తారు.



భారతదేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములతో తయారైనది!




పూర్తిగా సౌందర్యముగా కనపడుటకు పామొలివ్ సబ్బుతో స్నానము చేయండి!

PMO.G.15QT T.

# రాజధాని కబుర్లు

వినబడ్డాయి.

ఈ సంఘటన సికిందరాబాదు మారేడు పల్లిలో జరిగింది. అక్కడ దేశహితాభిలాషి అయిన ఒక యువకుడు తిరుగాడుతూంటాడు. 'ఫలానా కార్యాలయంలో పనిచేసే ఫలానా పేదవాడు చనిపోయాడు. శవాన్ని తీసుకెళ్ళడానికి డబ్బులేదు' అంటూ చందా వసూలు చేయడం అతనివృత్తి. కూటికొరకే కోటివిద్యలు.

ఆనాడు అతని దురదృష్టంకొద్దీ ఇదివరకే చందా వసూలు చేసిన ఇంటికి చేరాడు. అతను బ్రతికుండంకోసమే ఇతరులు చనిపోతున్నారని ఇంటివాళ్లు గ్రహించారు. అతన్ని నాలుగు ప్రశ్నలు వేసి, నాలుగు చేతులేసి పట్టుకోబోయారు. అతను పరుగెత్తి, సైకిలెక్కి పారిపోయాడు. 'చోర్, చోర్' అన్న కేకలవెనక కథ ఇది.

శ్రీ వేణుగోపాలరావు, ఆ పోలీస్ జవానూ, ఇద్దరూ గుర్రాలపై అతన్ని తరిమారు. ఒక కాలువ అడ్డంవస్తే, సైకిలక్కడ పడేసి, ఈది, దూకి, అవతలకు పారిపోయాడతను. సైకిలు పోలీసువారికి చిక్కింది. చిక్కి, ఏదో సమాచారం చెవులో చెప్పింది.

* * *

కటకటాల వెలుపలికి వచ్చి రహస్యంగా చెప్పింది ఈకథ శ్రీ కృ. జ. స్తా. ఇది విన్న కృ. జ. స్తా. ఆశావాదిలా మొహంపెట్టి, ఏదో దినపత్రికలో చూసుంటావ్ ఇది' అంది. 'హుం! పందెం! ఏపత్రికో చూపెట్టు చూద్దాం' అంది శ్రీ కృ. జ. స్తా.

## అస్సాం కొత్తగవర్నర్

అస్సాం గవర్నర్‌గా, ఫజల్ అలీ స్థానంలో, జనరల్ సత్యవంత్ మల్లన్న శ్రీనగేష్ నియామకం ఆంధ్రప్రదేశ్ పౌరులందరూ గర్వింపదగిన విషయం. భారత పరిపాలనా వ్యవస్థలో ఆంధ్రప్రదేశ్ ఆక్రమించనున్న ప్రముఖస్థానానికి ఇది సూచిక.

జనరల్ శ్రీ నగేష్ వయస్సు 56 సంవత్సరాలు. 1903 వ సం॥ మే నెల 11 వ తేదీన జన్మించారు. తండ్రి డా. శ్రీనగేష్‌మల్లన్న. తల్లి రాజకుమారి కోచార్. వీరికి జనరల్‌తో సహా ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. ఇంగ్లండులో పబ్లిక్‌స్కూల్లోను, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోను, సేండర్స్టులోను విద్యాభ్యాసం. ఇరవయ్యోసంవత్సరంలో సైనికాధికారి అయ్యారు. ఆరవకూమాన్ దళాధిపతిగా వజీరిస్థాన్, అస్సామ్, బర్మా యుద్ధరంగాల్లో పోరాడారు. 1945 లో జర్మనీకి వెళ్లిన భారత సైనికదళానికి ఉపనాయకులు. 1946 లో కూమాన్ కేంద్రానికి ఆర్థికసలహాదారుగా పనిచేశారు. మరుసంవత్సరం జపాన్‌వెళ్ళి 268 వ పదాతిదళానికి నాయకత్వం వహించారు.

తిరువాత మేజర్ జనరల్ ఐ, మదరాసు ప్రాంతానికి అధినేతగా నియమింపబడారు. 1948 లో కేంద్రంలో అడ్జటెంట్ జనరల్‌గా పనిచేశారు. ఆ సంవత్సరం సెప్టెంబరులో జమ్మూ కాశ్మీర్ రంగంలో భారత సేనలపై సంపూర్ణాధికారం చెలాయించారు. 1953-55 సంవత్సరాల్లో దక్షిణ భారత సైనికదళాలకు ఆధిపత్యం వహించారు.

వచ్చే సంచికలో

వనితలకొరకు ప్రత్యేక శీర్షిక

అత్తలు, కోడళ్లు

* * *

సోషల్ సర్వీస్

నందుల సుశీలాదేవి

* * *

శంకర్, జైకిషన్

స్వరలహరి

* * *

నేటి యువచిత్రకారుల స్థితి

ఎస్. వి. రామారావు

1955 మే నెల 15 తేదీనుంచి భారత సర్వసేనాపతిగా నియమించబడ్డారు. మరో ఆంధ్రప్రదేశ పౌరుడు, నావికాదళాధిపతి ఐన శ్రీ రామదాస్ కటారీలాగ, క్రింది ఉద్యోగుల మెప్పునూ, గౌరవాన్నీ సంపాదించుకున్నారు జనరల్ శ్రీనగేష్. సర్వసేనా పదవిలో పింఛన్ తీసుకొని, హైదరాబాదులో నెలకొల్పబడ్డ పరిపాలనా సిబ్బంది కళాశాలకు ప్రధానాచార్యులుగా పనిచేస్తున్నారు ఇంతవరకు.

ఇదివరలో రాఘవేంద్రరావు, కూర్మారెడ్డి నాయుడు, కొంతి రామమూర్తి ప్రభృతులు ఆంధ్రులు గవర్నర్లయ్యారు. ఇది స్వాతంత్ర్యం సంపాదించుకోనేముందు—1917 తరువాత తెలంగాణంనుంచి శ్రీమతి సరోజిని, ఆంధ్రనుంచి డా॥ పట్టాభి గవర్నర్లయ్యారు. ఇప్పుడు శ్రీయుతులు వి. వి. గిరి (ఉత్తర ప్రదేశ్), బూర్గుల రామకృష్ణరావు (కేరళ), కుమారి పద్మజా నాయుడు (పశ్చిమ బెంగాల్) గవర్నర్లుగా ఉన్నారు. ఇది మూడు తడవేసరికి జనరల్ శ్రీనగేష్ అస్సాం గవర్నర్‌గా పదవీ ప్రమాణం స్వీకరిస్తా

చైనీస్ దాడుల దృష్ట్యా, సరిహ రాష్ట్రానికి జనరల్ శ్రీనగేష్ గవర్నర్ నియమింపబడ్డంలో ఔచిత్యం ప్రశ్నరానిది.

## విమర్శ-కులు

ఈ శీర్షిక క్రింద వేసిన (7-10-
ప్రశ్నకు ఆర్. టి. సి. అధికారులవద్దను
సమాధానం లభించింది. ఈసామియాబజా
చౌరస్తావద్ద 'హైటెన్షన్' తీగ లుండడంవ
ప్రమాదాలు జరిగి, బస్సులకు బస్సులే వి
దాఘాతానికి లోనుకాతాయే మోన
భయమే కారణమట.

ఈ ప్రశ్నకు సమాధానం ప్రశ్న
నప్పుడే, నాలుగు నెలల క్రిందటే, ఆర్.
సి. ఉద్యోగులు ఇస్తే, ప్రవీణునికీ,
పత్రిక పాఠకులకు ఇంత బాధపడవలసిన
సరం ఉండేదికాదు. పత్రికల విమర్శ
పట్టించుకుని? సమాధానాలు చెప్పే అలవా
ఆర్. టి. సి. వారు చేసుకోవాలి. ఇప్పు
మరో ప్రశ్న—

### రెండో ప్రశ

ఆర్. టి. సి. బస్సుల్లో ఇంతకు మిం
ప్రయాణీకులు ప్రయాణించరాదన
నియమం ఉంది. ఇంతకుమించి నిలబడరా
అన్న నియమమూ ఉంది. ఉచితం
ప్రయాణంచేసే ఆర్. టి. సి. ఉద్యోగు
టికెట్ కొనుక్కున్న ప్రయాణికుడు ఒక
నిలబడివున్నా, లేచి స్థానం ఇవ్వాలన్న ని
మమూ వుంది. బస్సుల్లో ఒక్కొక్కప్పు
పన్నెండు పదముగ్గురువరకు ఉద్యోగులు ఉ
తంగా ప్రయాణం చేస్తున్నారు. ఆడువా
నిలబడ్డా, ముసలులు నిలబడ్డా, లేచి చో
ఇవ్వాలన్న విషయం వీరికి ఇప్పుడు తో
వట్టుగా కనుపిస్తోంది. ఈమధ్య ఉచితం
కూరగాయలకోసం వెళ్ళే పోలీసుజవా
కూడా ఇట్టే ప్రారంభించారు. నియమపాలన
లేదు సరిగదా—ఉన్నతాధికారుల దృష్టి
తెచ్చినప్పుడు వారు మందహాసాలు విసిర
ఆ తెచ్చినవాడి తెలివితక్కువ తనానికి.

బస్సులో ఇంతకుమించి నిలబడరాదన
నియమంవల్ల, లెక్కకుమించి ఉచితంగా
ప్రయాణం చేసేవారు ఉండటంవల్ల
టిక్కెట్టు కొనుక్కునే ప్రయాణికుల
స్థానాలు లేకుండా పోతున్నాయి. ఉద్యో
లకు బస్సుల్లో స్థానంలేకుండా చేయమ
కాదు. కాని ఉచితంగా ప్రయాణం చే
వారు బస్సుకిద్దరు ముగ్గురుకంటే ఎక్కు
ఉండరాదని శాసిస్తారా ? ఆర్. టి. సి
ఉద్యోగులకోసం వేరేబస్సులు వేసుకు
టారా ? లేకుంటే ఉచితంగా ప్రయాణ
చేసేవారిని లెక్కించి అంతమంది ప్రయా
కులను ఎక్కువగా తీసుకుంటారా ? మా
చూడనట్లు ఊరుకునే కండక్టర్లపై ఉచి
తమైన చర్యతీసుకుంటారా ? ★



'ఆయనకు ప్రథమస్థానం రాదు. ద్వితీయస్థానం పనికిరాదు.'

ఇలా సూత్రప్రాయంగా రెండు వాక్యాలలో శ్రీ ఎన్. జి. రంగాగారి రాజకీయావస్థను చిత్రించవచ్చు. ద్వితీయస్థానం పనికిరాదంటే బాగానే ఉన్నది. దానికి అర్థమున్నది. ఇంకొకరికి కూడా అర్థమవుతుంది.

అయితే ప్రథమస్థానం ఎందుకురాదు!

రంగాగారికి వ్యక్తి వైదుష్యం లేకపోయినా విద్య ఉన్నది. ప్రసంగంలో ధాటి లేకపోయినా ధార ఉన్నది. సంచారమూ ఉన్నది. ప్రచారమూ ఉన్నది. కొన్ని వర్గాలలో, కొన్ని ప్రాంతాలలో అసాధారణమైన పలుకుబడి ఉన్నది. ఆయన అంటే పడిపోయేవాళ్లున్నారు. ఆయన ఆచార్యత్వాన్ని అన్ని విధాలా అంగీకరించినవారున్నారు. ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షులయినారు. పాతిక సంవత్సరాలు వరుసగా కేంద్రశాసనసభలో కాంగ్రెసు పార్టీ సభ్యులుగా ఉన్నారు. ఇవన్నీ చూస్తే ఆయన అటు కేంద్రంలో మంత్రి పదవినో ఇటు రాష్ట్రంలో ముఖ్యమంత్రి పదవినో అలంకరించవలసినవారు. కాని వాటిలో ఏ ఒకటీ జరుగలేదు. కారణం! ఇన్నాళ్ళు కాంగ్రెసులో ఉన్నా వాస్తవానికి ఆయనకు కాంగ్రెసులో పట్టు చిక్కలేదు. జవహా:

ప్రచారబలం తప్ప అంతర్బలం లేదు. జవానులతో కలిసి పనిచేయలేరు. ఆయన ఆచార్యత్వాన్ని అంగీకరించినవారి మధ్య తప్ప ఉండలేరు. ఆయన భక్తబృందము అన్నట్టే తనొక మహాపురుషుడనని స్వయంగా నమ్ముతారు. ఇతరులను అంగీకరించకుంటారు. మొదట మార్క్స్, తరువాత గాంధి, ఆతరువాత రంగా అని నిడుబ్రోలు రాజకీయపాఠశాలవిద్యార్థులు నేర్చిన పాఠము. రాష్ట్రరాజకీయాలు చేజిక్కకపోవుటవల్లనే వాటిని వదలి యావద్భారతరాజకీయాలను వీలుగా చేపట్టారు. ఆ రంగంలోనూ సాధించినదిలేదు. కిసాను సంఘం, చేనేతసంఘం మొదలైనవాటిని కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా సృష్టించి వాటికి ఆధిపత్యం వహించారు. కొన్ని రోజులు రంగాగారు ఎక్కడికివెళ్ళినా పీఠాచార్యులముందు నడిచినట్లు ఒకరు జెండా పుచ్చుకొని దారితీస్తూవుండేవారు.

1951 సం|| లో కాంగ్రెసునుండి వెళ్ళిపోయారు. అది ఏ సిద్ధాంతాన్నీ పురస్కరించుకొని కాదు. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షఎన్నికలో తాము ఓడిపోయిన కారణముతప్ప వేరేకారణం ఏమీ లేదు. తరువాత ప్రజాపార్టీలో చేరారు. అక్కడ ప్రకాశంగారితో సరిసమాన ప్రతిపత్తి రాలేదని దాన్ని వదిలారు. కృషికర్ లోక్ పార్టీ స్థాపించారు. పార్లమెంటుకు నిలిచి ఎన్నికలో ఓడిపోయారు. కాంగ్రెసులో తిరిగి ప్రవేశించారు. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షపదవి కావాలంటే అది లభ్యపడలేదు. ముఖ్యమంత్రిపదవి కావాలంటే అదీ రాలేదు. తమ అనుయాయులలో ఒక్కరికీ మంత్రిపదవి రాలేదు. అనుయాయులు విసిగి వేసారి కాంగ్రెసునువదలి వెళ్ళారు. తరువాత సహకార వ్యవసాయ సిద్ధాంతంమీద రంగాగారు కాంగ్రెసునుండి వెళ్లారు. కాలయాపనవల్ల తమ అనుయాయులకు దూరమైనారు. 'ఏ క్షణంలో ఏదిచేయకూడదో అదిచేస్తారు రంగాగారు' అని గాంధీజీ అన్నారు ఒక సందర్భంలో.

కృషికర్ లోక్ పార్టీ అంతరించింది. రంగాగారు స్వతంత్రపక్షంలో చేరారు.

ఆంధ్రలో రాజకీయాలను గమనించి ఒకప్పుడు తాము Charmingly cantankerous అన్న వ్యక్తిని రాజగోపాలాచారిగారు స్వతంత్రపక్షం ఛైర్మన్ గా చేశారు. ఈ పక్షంలోకూడా ప్రథమస్థానం లాంఛనమాత్రంగాని వాస్తవం కాదు. ప్రథమస్థానం రాజగోపాలాచారిగారిది. ద్వితీయస్థానం మసానీది. ఆతరువాతస్థానం రంగాగారిది. నడిపించేవాడు రాజాజీ, నడిపేవాడు మసానీ, నడిచేవాడు రంగాజీ. ★





## తాళంచెవి తమాషా

(మొదటి బహుమతి 10 రూ)

ఆరోజు మా బాబు పుట్టినరోజు. వారం రోజుల ముందుగానే మావారూ, నేనూ మా స్నేహితు లందరికీ పెద్ద పార్టీ యిద్దామని నిశ్చయించుకున్నాము. క్రింద మా యిల్లు యిరుకుగా వుంటుందని పై డాబా మీద పార్టీకి కావలసిన ఏర్పాట్లు చేయించాము. మొత్తం మీద ఆయన స్నేహితులు నా స్నేహితురాండ్రు కలసి వందమంది దాకా వచ్చారు. అనుకున్న విధంగా పార్టీ అమోఘంగా జరిగింది. తాంబూలాలు తీసుకుని అతిథులంతా వెళ్ళడానికి లేచారు. ఇక్కడ యింకొక విషయము చెప్పాలి. మా డాబాకి ఒకే ఒక ద్వారం; దానికి మంచిబలమైన తలుపు, ఎటూగోడ కూడా చాల ఎత్తు. సరే అందరం తలుపుదగ్గరకువెళ్ళి అతిథులను పంపడానికి తలుపుతీస్తే ఎంతకీ రాలేదు. ఎవరన్నా బయట గడియపెట్టారేమోనని రోడ్డు మీద వాళ్ళని మావారు కేకలుపెట్టి పిలిచి తలుపు గడియ తీయమని చెప్పారు. వీధిలోకి మెట్లుండటంచేత వాళ్ళు మేడఎక్కి చూచి "గడియ కాదండీ తాళంవేసి వుంది," అని చెప్పారు. "పోనీ అది బద్దలు కొట్టండి" అన్నారు మావారు. "ఇది గాడ్రేజ్ తాళం. లాభంలేదు" అని వాళ్ళ దోవన వాళ్ళువెళ్ళిపోయారు. అప్పటికే 11 గం|| అయింది. అతిథులంతా తొందరపడుతున్నారు. చంటిపిల్లలంతా ఏడుపులు సాగించారు. కొంతమంది మొగాళ్ళు డాబామీదనుంచి దూకుదామని చూశారు కాని ఏమీ లాభం లేకపోయింది. ఇంతలో దేవుడు శాపము పెట్టినట్లుగా మేఘాలు కమ్ముకొని కుంభవృష్టిగా వర్షం కురవడం మొదలు పెట్టింది. దీనితో అందరి ఖరీదైన బట్టలు, చీరలు శుభ్రంగా తడిసిపోయి, చలికి వణకడం మొదలు పెట్టాము. పిల్లలసంగతి సరేసరి. అసలే కోతి, దానికి తోడు నిప్పు తొక్కిందన్నట్లుగా ఆసలే తలుపు రాకపోవడం దానికి తోడు వర్షం. 'ఏదో సరదాగా గడుపుదామంటే ఇదేమిటిరా భగవంతుడా' అని చాలాసేపు బాధపడ్డాము. ఇంతలో ఏం తోచిందో ఏమో అంగులో కొంత మంది మొగవాళ్లు ఎదురింటివాళ్లను పిలిచి ఎలాగో వాళ్లని బ్రతిమిలాడి రెండు నిచ్చెనలు తెప్పించి దిగడం మొదలుపెట్టారు. మొగవాళ్లంతరూ సునాయాసంగా దిగేశారు. ఇక మా పని చూడాలి. అసలే నిచ్చెనదిగడం భయం. దానికితోడు గాలివాన జోరు. ఎలాగో ప్రాణాలు బిగపట్టుకుని దిగేసరికి మా తాతలు దిగొచ్చారు. దిగేటప్పుడు చీరలు కొంతమందికి చిరిగిపోయాయి కొంతమందికి కాళ్లు బెణికాయి. కాలకాయలకు మరీ అవస్థయింది ఆరోజు. ఆరోజు అతిథు లంతా పైకి ఏమీ అనకపోయినా లోపల మమ్మల్ని ఎంత తిట్టుకునివుంటారో అని యిప్పటికీ అనుకుంటాను. ఇంతకీ ఆరోజు తాళం ఎవరువేసిందీ చెప్పవద్దూ? హడావుడి తగ్గాక యింట్లోకి వచ్చిచూస్తే మా అబ్బాయి క్రిందపడుకుని నిద్రపోతున్నాడు. అందరూ పైనవుంటే వీడొక్కడు యిక్కడ పడుకున్నాడేమా అని సందేహించి, వాడి జేబులు వెదికితే గలభాకి కారణమయిన తాళంచెవి దొరికింది. మర్నాడు వాడిని బుజ్జగిస్తూ "నాన్నా తాళం ఎందుకు వేశావురా?" అంటే "మొన్న నాన్నగారు నాకు తాళంవేయడం నేర్పలేదూ? సరిగా వచ్చిందో లేదోనని వేసిచూశాను" అని జవాబు చెప్పాడు. ఆ రోజు తలుచుకుంటే యిప్పటికీ అంతమందిని బాధపెట్టామే, అనిపిస్తుంది.

శ్రీమతి ఘట్టి పద్మావతీశర్మ,
విజయవాడ.

* * *

## పూరీ కహాఁ హై

(రెండవ బహుమతి రు 5)

నేను నాల్గవఫారం చదివే రోజులవి. ఒకసారి ఇన్స్పెక్టర్ గారు మా స్కూలుకు ఇన్స్పెక్షన్‌కోసం వచ్చారు. మేము అన్ని సబ్జెక్టులలోనూ ఏ ప్రశ్న వేసినా ధారాగా జవాబిచ్చేటట్లు బాగా చదువుకున్నాము. మూడవ పిరీడు జరుగుతోంది. అది హిందీ క్లాసు. ఇన్స్పెక్టర్ గారు రానేవచ్చారు. మేమందరం మర్యాద సూచనగా లేచి నిలబడ్డాము. ఆయనవచ్చి మా అందరిని చూచి "సిట్ డవున్!" అని అరిచారు. విగ్రహము పొట్టిగా ఉన్నా పొట్ట, సమ్మర్ క్రాం ...అడ్డ పంచకట్టి, అంత పొడుగు, అంత పొట్టి లేకుండా షర్టు వేసుకున్నాడు. నే కాయలాంటి కనుగ్రుడ్లు ముందుకుపెట్టి చూస్తుంటే మనిషి భీకరంగా కోపిష్టిగా కనబడ్డాడు.

మరి మా హిందీమాష్టర్ మెత్తటిమనిషి. ఇన్స్పెక్టరు 'సిట్ డవున్!' అని సంగా అరిచే సరికి మా పంతులు మా కంటే ముందు జడిసి అదిరిపడ్డాడు.

ఆ గాబరాలో హిందీ మాష్టరు పుస్తకములో పేజీలు గబగబా తిప్పేసి ఏ పాఠములోని ప్రశ్నో మరి 'పూరీ జగన్నాథ కహాఁ హై?' అని అన్నాడు. వెంటనే అబ్బాయి లేచి నిలుచున్నాడు జవాబు చెప్పాలా అని చూస్తూ. ఆ ప్రశ్న మాకు గత వారాలలోనిది కాదు. పై వచ్చే పాఠములోనిదో కూడ మాకు తెలియదు. ఇన్స్పెక్టరుగారు అలా నిలబడ్డ అబ్బాయిని "అబ్బాయి నీపేరేమి?" అని అన్నారు గట్టిగా.. 'నా పేరాండి నా పేరాండి, పేరు జగన్నాథమండి' అని భయపడుతూ చెప్పాడు. 'అయితే ప్రశ్నకు జవాబు చెప్పవేం' అన్నాడు ఇన్స్పెక్టర్. వాడు మా హిందీమాష్టరు వైపు చూసి నిశ్చయం "పూరీ మణిఅయ్యర్ హోటల్ మేడపై" అన్నాడు. 'ఈ మాత్రము చెప్పటానికి వెర్రిమొగము వేశావేం' అంటూ ఇన్స్పెక్టర్ గారు క్లాసునుండి బయటికి వెళ్ళిపోయారు. ఇంతకీ ఇన్స్పెక్టరుగారికి హిందీరాదు! కందరికి గండంగడిచి పిండం బయటపడింది.

కె. పరమశివయ్య, ఆరోగ్యవర

* * *

## అతి తెలివి

(రెండవ బహుమతి రు 5)

ఒక్కడే కొడుకు కావడంవల్ల యశోదమ్మ అతగాడు అంత తెలివైనవాడు కాకపోయినా, ముద్దుకొద్దీ ఏదో ఒక సందర్భంలో తరచు ఇరుగుపొరుగు అమ్మలక్కలతో తనకొడుకు తెలివితేటలు ప్రయోజకత్వాన్ని గూర్చి ఘనంగా చెప్పుకొనడం

(61-వ పేజీ చూడండి)

# అడ్డదార్లు

ఏమేవ్...నిన్నే...ఇదుగో... చూశావా!" పేపరు చదువుతూ ఏదో హెడ్డింగుదగ్గర ఆగి పట్టజాలనంత సంతో తో భార్యను పిలుస్తున్నాడు నారాయణరావు.

"ఉండండీ...ఒక మూల ఎసరు కాగియుండీ,...కూర మాడిపోతూంది" జాన విసుగ్గా అనేసి తనపనిలో నిమగ్న ంది మళ్ళీ.

"అబ్బబ్బ...నీకెప్పుడూ ఏదో ఒక పకమే నే. పిలవగానే చటుక్కునరావు" టూ తలను పూర్తిగా పేపర్లో దూర్చే ను.

"వ్యాపకం నాకు కాకపోతే...మరి కాయేమిటి? మీ రిలా వచ్చి ఈ వంటపని గలిగితే నేనొచ్చి ఆ పేపరు చూస్తాను" చోటనుంచి కదలకుండానే సమాధానం ప్పింది జానకమ్మ.

"నువ్వు ఒక ఎద్దు మొద్దు స్వరూపానివి. చదువుకున్న పెళ్లామయితే ఈపాటికి చేతిలోంచి పేపరు లాక్కుని చదివేసేది. వ్వ పిల్చి నారావు."

"ఇప్పుడైతేనేం, చదువుకున్న దాన్ని ళ్ళ పెళ్లిచేసుకుని మీరూ ఆవిడ పేపరు దువుకుంటూ షికార్లుకొడితేసరి...నే కో, 40 సంవత్సరాలు దాటిన ముసలి దాన్నికదా, ఈ సంసారంలోపడి కొట్టుకుంటాను."

"అమ్మయ్యో!...ఎన్నికబుర్లు చెప్పినా ఆవంటింట్లోనుండేకాని బయటకు రావుగదా! ఇదంతా నీకోసమే...ఒక శుభవార్త..." అన్నారు నారాయణరావు.

"శుభవార్తా!...అదేమిటో త్వరగా చెప్పండి. నేతిగిన్నె పొయ్యిమీద పెట్టి వచ్చేను." జానకమ్మ చేతులుతుడుచుకుంటూ వీధిగదిలోనున్న భర్తదగ్గరకొచ్చి నిలబడింది.

---

'శ్రావణి'

---

"ఈసారి మనం అమ్మాయిల పెళ్ళిళ్ళు చాల సుఖంగా చేసెయ్యొచ్చు."

"అదేమిటండీ...మనమ్మాయి పెళ్ళిళ్ళ గురించి పేపర్లలో ఏమైనా వ్రాశారా?" అమాయకంగా అడిగింది జానకమ్మ.

"నీముఖంలావుంది. మనమ్మాయిల పెళ్లిళ్లు పేపర్లలో ఎందుకొస్తాయి? ఇదిగో ఇక్కడ చదువు..." నారాయణరావుగారు భార్యకు తను చదువుతున్న పేపర్లోని ఒక అంశాన్ని చూపించేరు.

"వరకట్న నిషేధం: పెళ్ళిళ్ళలో 2 వేలకు మించి వరకట్నాలు ఇచ్చినవాళ్లనుగాని, పుచ్చుకున్నవాళ్లనుగాని ప్రభుత్వం శిక్షిస్తుందిట. ఇక్కడితో మనకు కట్నాలబాధ వదిలింది. ఈసారి మనమ్మాయిల పెళ్ళిళ్ళు నిమిషాలమీద చెయ్యొచ్చు...ఏమంటావ్..?"

"అవునండీ...ఇన్నాళ్ళకు మనప్రభుత్వం ఆడపిల్లలుగల తల్లిదండ్రులమీద కనికరించింది.

ఎలాగయినా నా తల్లులిద్దరూ అదృష్టవంతులు. పెద్దదానికి పెళ్ళి చేసేసరికి తలప్రాణం తోకకు వచ్చిందిగదా మనకు! ఇంక వీళ్ళ పెళ్ళిళ్ళకోసం మీ తిరుగుడు చూస్తుంటే ఎలాగరా భగవంతుడా అనే విచారంతో సతమత మౌతున్నాను.

"అయితే అమ్మాయిలిద్దర్నీ వెంటనే బయలుదేరి రమ్మని టెలిగ్రాం ఇచ్చేస్తాను."

"ఎందుకండీ ఈ సెలవుల్లోనే, ఏదో సరదాగా పిన్నిగారింటికంటూ వెళ్ళేరు. ఇంకా నాలుగు రోజులయినా కాలేదు. అయినా వాళ్ళెందుకు? మీకూ కాలేజీకి సెలవులు కాబట్టి, మంచి సంబంధాలు చూడండి, ఇంతలో వాళ్లూవస్తారు" అంటూ జానకమ్మ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

శ్రీ నారాయణరావు సిగరెట్టు వెలిగించి కాలుమీద కాలు వేసుకొని ఊపుతూ ఆలోచనలు ప్రారంభించేరు—అయితే ఇప్పుడు ఏ సంబంధం సెటిల్ చెయ్యాలా అన్నట్లు. లోగడకూడా నారాయణరావుగారేమంత చిన్న చిన్న సంబంధాలు చూసి ఊరుకోలేదు. ఒక ఇంజినీరింగు స్టూడెంటుగురించి ప్రయత్నించి చూసేరు. అయితే వాళ్లు అప్పట్లో 10 వేలు కట్నం అడిగేరు. తరువాత ఎమ్. బి., బి. ఎస్. పాసయి హౌస్ సర్జన్ గా వున్న అబ్బాయి తల్లిదండ్రులతో కూడా ఈ యోచన రాకముందు సంప్రదించి చూసేరు. కాని వాళ్ల కోరికలన్ని మొత్తం చేస్తే 20 వేలు లెక్క తేలింది. ఇంత పెద్ద సంబంధాలతో తూగలేము అనీ, ఏదో సింపిల్ గా ఒక గ్రాడ్యుయేటుకిద్దామని కాళ్ళు అరిగేలా తిరిగేరు. కాని అతగాడు 'రొక్కం 5 వేలిచ్చి లాంఛనాలన్నీ యథావిధిగా మావాళ్ళతో మాట్లాడి జరిగించండి' అన్నాడు. ఇంకొక పోస్ట్ గ్రాడ్యుయేటులా డిగ్రీ ఆయనగురించి మాట్లాడితే అతని చదువుకు తగ్గ ఉద్యోగమేదయినా ఇప్పించివట్లయితే ఆ ఉద్యోగంలో చేరిన తరువాత పెళ్లి చేసుకొంటానన్నాడు. అంత పలుకుబడీ, అంత సామర్థ్యముండినట్లయితే కూతురు పెళ్ళిచేయడానికి ఇంత తాపత్రయ పడాలా? చూసిన సంబంధాలన్నీ ఎక్కడికక్కడ పురిటిలోనే సంధికొట్టినట్లయింది ఇంత కాలమూనూ.

ఇప్పుడు పేపరులోవచ్చిన ఈ బిల్లుసారాంశం చూసుకొని నారాయణరావు గారిలో ఒక నూతనశక్తి బయలుదేరింది. తనలో తను తల్చుకుంటూ మురిసిపోతున్నారు.

"ఇంక వీళ్లంతా పాపం ఏం జేస్తారు?



చిత్రం : నేతులూరి లక్ష్మయ్య, వేలూరు.

కాబోయే మామగార్లను ఆధారంగా చేసుకొని కాలేజీలకు నిరవధికంగా డబ్బు కడుతున్నారు. ప్రతీ వాడికీ మామగారి ఇల్లు గుల్ల చేద్దామన్న ఆలోచన తప్పితే వేరే ఆలోచన లేదు. వచ్చే కట్నంతో అప్పులు తీర్చుకోవచ్చునని, అప్పులు చేసి అవన్నీ మామగారి సొత్తిన రుద్దవచ్చునని ఆలోచించిన ప్రబుద్ధులూ,పాపం వీళ్ళందరికీ ఇప్పుడేమయ్యేట్టు...అసలు పిల్లనిస్తామంటూ ఇంక ఎవరు తిరుగుతారు కాళ్ళు పట్టుకుంటూ...ఇంకెవ్వరూ వాళ్ళ వస్తారేమో వెతుక్కుంటూ. "వినండీ అప్పారావు గారూ మీ అమ్మాయిని మా అబ్బాయికి చేసుకోమన్నారుగా" అంటూ.

ఈ విధంగా "ఊహా ప్రపంచంలో లీనమై తనలో తను తన్మయత్వం చెందుతూ కుర్చీలో కూర్చున్న భర్తను చూసి బయటకు వచ్చింది జానకమ్మ.

"ఏమండీ...ఇలా ఇంట్లో కూర్చుంటే ఎలాగండీ...మరి ఏదో ఒకటి నిర్ణయిస్తే గదా మా ఘ మాసంలో నైనా పెళ్ళి చేసెయ్యొచ్చుగా."

"అదే ఆలోచిస్తున్నది. ఇంక వాళ్ళ మనదగ్గర కొస్తారుగదా అని.ఇంక దీనిగురించి నువ్వేమీ కంగారు పెట్టుకోనక్కరలేదు చూడు మన ఇళ్ళచుట్టూ తిరుగుతారు ఈ పెళ్ళికొడుకులంతా" నవ్వుతూ భార్య వీపుపై చరిచాడు నారాయణరావు గారు.

"అబ్బ చాల్లెండి...ఎంత బిల్లులు పాసయినా పెళ్ళికొడుకులు మనింటికెందుకు వస్తారండీ మనమే వెళ్ళి మాట్లాడాలి కాని."

"సరే అయితే...మనం ఇంతవరకు నాలుగు సంబంధాలగురించి సంప్రదింపులు జరిపేము. ఒక ఇంజనీరు, ఒక డాక్టరు, ఒక గ్రాడ్యుయేట్ గుమస్తా ఒక ఎమ్. ఎ.,ఎల్. ఎల్ బి., ఇందులో ఎవరైతే బాగుంటుందంటావు? చెప్పు నీ సలహా ప్రకారం చేస్తాను. అల్లుణ్ణి ఎంచుకోమని భార్యకు చెప్పేడు నారాయణరావు.

"డాక్టరయితే మంచిదికదండీ...ఇంట్లో రోగాలు రొష్టులు రాకుండా చూసుకుంటాడు...అమ్మాయి కూడా సుఖపడుతుంది."



రెండేళ్ళనుంచీ మద్రాసులో ఉంటూ మణిపురి నాట్యం నేర్చుకున్న అమెరికా బాలిక రెబెకా, ఆమె గురువు కామినీకుమార్ సిన్హా. ఈమె త్వరలో అమెరికా వెళ్ళిపోతోంది. తనతో మణిపురి నృత్యపుదుస్తులు కూడా తీసుకుపోతోంది. ఈమె అక్కడ నృత్య ప్రదర్శనలు ఇస్తుంది.

ఇచ్చిన అవకాశాన్ని వదులుకోకుండా తన సలహాను అందించింది జానకమ్మ.

"ఆఁ...అమ్మాయి సుఖపడ్డానికేది కల్లతే. ఈ డాక్టరు ఒక క్షణమైనా ఇంట్లో వుంటేగా అమ్మాయికి సుఖం? వచ్చేవాళ్ళు వెళ్ళేవాళ్ళూనూ"

"అన్నీ అందరు డాక్టర్లూ అలాగే ఉంటారంటే..." జానకమ్మకు డాక్టరు అల్లుడు కావాలంటూనే.

"అలా ఉండకపోతే అమ్మాయి స
రానికంతా మనమే ఏర్పాటు చేసి ఏర
చేస్తూ ఉండాలి."

"అంటే...!"

"అంటే ఏమిటో అర్థం కాలే
డాక్టరుకు ప్రాక్టీసు లేకపోతేనూ, ∙
కొట్టుకు పెట్టలేకపోతేనూ డబ్బు ఎ
లా? అప్పుడు ఇంట్లో గడిచేదెల
అమ్మాయి మనమీదపడి గోలపెడితే చ
స్తూరుకుంటామా? అందులోనూ డాక్ట
నా స్థలం ఉండాలి..."

"పోనీ...ప్లీడరయితే..." అనగా
... చూచింది జానకమ్మ.

"ఆఁ...బోడి ప్లీడరులైనా...ఏ ప్లీ
డరినా ప్లీడరు బోర్డులే...రెండు
కాల బీరువాలు, ఒక కుర్చీ, ఒక టే
తప్పితే ఏమీ ఉండవు...! రోజూ క
కోసమైనా రిక్షామీద కోర్టుకెళ్ళి
ఉండాలి...... ఇంక చూడు; 'మామగ
మనవాళ్ళ కేసులేమైనా ఉంటే


మీరు ఉత్సాహంగా అందంగా
ఉండేందుకు
SAMSONS DRESSES ధరించండి.
మద్రాసుకు సోల్ ఏజెంటు: మూర్తి & శర్మ,
త్యాగరాయనగర్, మద్రాసు - 17.
వ్యాపార వివరములకు వ్రాయ గోరడమైనది.

# ఆయుర్వేదౌషధములు.

శాస్త్రీయముగాను, నమ్మకముగాను తయారుచేయు సంస్థ.

## వేంకటేశ్వర ఆయుర్వేదనిలయం.

చింతలూరు

ఆలమూరు పోస్టు ★ తూర్పుగోదావరిజిల్లా.

ఆంధ్రదేశమందంతటను బ్రాంచీలు. ఏజన్సీలు కలవు.

హైదరాబాదు బ్రాంచి : 71½, సెంట్రల్ బ్యాంక్ బిల్డింగ్సు.
సికింద్రాబాదు బ్రాంచి : 7-2-148 హిమ్మత్‌గంజ్ పాత పోలీసుస్టేషను ఎదుట.



## ...రు తెలుసుకోవటం మంచిది

...ల్లి ఎక్కువ పుట్టించటం వల్ల ఇప్పుడు దారిద్ర్యంతో ...టుంబంతో వ్యాధులతో నరకం అనుభవిస్తున్నాము.



తక్కువ పిల్లల్ని పుట్టించటం వల్ల లోటు లేకుండా ఆరోగ్యంతో హాయిగా ఉన్నాము.



దాంపత్య సుఖాలు అనుభవించుచు కూడ, ఆపరేషను మందులు లేకుండా ...లు పుట్టకుండా చేసుకోవడానికి, ప్రపంచంలో పెద్ద డాక్టర్లు, కనిపెట్టిన ...మైన 21 మార్గాలు 'సంతానము' అనే తెలుగుపుస్తకంలో వున్నాయి. ...రం లేనప్పుడు గర్భం రాకుండాచేసే మార్గాలు, సుఖ ప్రసవానికి గర్భిణీ ...లు ముందుగా తీసుకోవలసిన జాగ్రత్తలు, పసిపిల్లలను పుష్టిగా, ఆరో...గా, ఎక్కువ ఖర్చులేకుండా పెంచే మార్గాలు. అవుసరమైనచోట్ల బొమ్మ... డాక్టర్ ఎ. ఎస్. మూర్తి, యం. ఏ. వారు 'సంతానం' అనే తెలుగు ...కంలో వ్రాశారు. అనేక సంసార సమస్యలను తీర్చగల అపూర్వ గ్రంథం ... దవిని తీరవలసిన పుస్తకం. వెల రు. 3.50. పోస్టుఖర్చులు ఉచితం. ...రీ & విశాలాంధ్రం, 331, పిటర్సురోడ్డు, మద్రాసు-14 కు ఉత్తరం వ్రాస్తే ... కూడ ఒక పుస్తకం వెంటనే వి. పి. పోస్టుద్వారా పంపబడును.

SWASTIK


# అడ్డదార్లు

కేర్పాటు చెయ్యండి ...' అంటూ మనలను చంపుకుతింటాడు ...... అప్పుడు ఎవరూ దొరక్కపోతే మనమే ఎవరితోనైనా మాట్లాడి అల్లుడిని ప్లీడరుగా పెట్టుకోవాలి."

"అయితే ప్లీడరు వద్దండోయ్..." భర్త ధోరణిని ఆపుచేసింది జానకమ్మ.

"ఇంక నిన్ను అడగదల్చుకో లేదు...... నీ పెలకుతు బాగా లేదు మాడు. ఇంజినీరును కుదుర్చుకు వస్తాను......" ఆవేశంతో కుర్చీమీదనుంచి లేచేడు నారాయణరావు.

"అవునండీ ఈ రోజుల్లో ఇంజనీర్లే నయమేమో ...... అయినా అవన్నీ మీకు తెలియాలిగాని నాకేం తెలుసునండి."

"మరి...వడ్డించెయ్...మధ్యాహ్నం వెళ్లి ఆ సంబంధం మాట్లాడివస్తాను.

* * *

"వాళ్ళు రేపు విదియనాడు బయలుదేరి అమ్మాయిని చూసుకోడానికివస్తామన్నారు. అందుచేత అలా వెళ్ళి అమ్మాయిలను కూడా తీసుకొని వచ్చేసేను." బండిదిగుతూనే శుభవార్తచెప్పేడు నారాయణరావు భార్యతో.

"పోనీలెండి మంచిపని చేసేరు...అయితే ఇంతకూ ఆ ఇంజనీరేనా?"

"ఔను. అతను, వాళ్ళ నాన్నగారు, వాళ్ళ అమ్మగారు, ఇంకో పురోహితుడూ–మొత్తం నలుగురు వస్తారుట...పిల్ల నచ్చితే వెంటనే పెళ్ళి జరిగించెయ్యాలిట."

"ఆ...అలాగా...అమ్మాయి అదృష్టవంతురాలు కాబట్టే ఈ బిల్లుకూడా దీని పెళ్ళి సమయానికి వచ్చింది." జానకమ్మ కూతురు తల నిమిరింది.

* * *

నారాయణరావుగారు వీధిలోకి, ఇంట్లోకి తిరుగుతూ వస్తూ పెళ్ళివారికోసం ఎదురు చూస్తున్నారు. ఫలహారాలు, కాఫీ రెడీగా పెట్టుకు కూర్చుంది జానకమ్మ.

"అబ్బ ఇంకా రాలేదేమండీ ... సాయంకాలం 3 గంటలకు వస్తామన్నారు కదా అని అమ్మాయిని 2 గంటలకే ముస్తాబు చేసి కూర్చోబెట్టేను. అప్పుడే ఐదయింది. దానితల్లో పువ్వులు వాలిపోతాయి. మళ్ళీ జడవెయ్యాలి," అంటూ విసుక్కుంటూంది.

"విసుక్కుంటావేమిటే ... పెళ్ళంటే మాటలా! ఓపికపట్టాలి ... అదుగో టాక్సీ చప్పుడయినట్టుంది. వస్తానుండు" నారాయణరావు వీధిలోకి వెళ్ళేరు.

"ఈ రోజు బండి లేటు బావగారూ ... అందుచేత మీతో చెప్పినసమయానికి రాలేకపోయాం" వియ్యంకుడు కారు దిగుతూ అన్నారు. వియ్యపురాలిని లోపలికి తీసు

కొనివెళ్ళింది జానకమ్మ. మంచి మర్యాదా, అమ్మాయి అబ్బాయిలు ఒకరినొకరు చూసుకోవడం అన్నీ పూర్తయాయి.

"అయితే బావగారూ పిల్ల మావాడికి... నచ్చిందండీ..."

"నచ్చదుటండీ ... అసలు ఇదివరలో మీరు చూడలేదు కాని ... యీపాటికి మా అమ్మాయి మీయింటికోడలై యుండును గా" తన కూతురు సౌందర్యాన్ని పొగుడుతున్నారు నారాయణరావు.

"అయితే ముహూర్తం.. ఇప్పుడే నిశ్చయం చేసుకుంటే తీరిపోతుంది గా బావగారూ". కట్నం ప్రసక్తి లేకపోవడం బిల్లు ప్రభావమే అనుకుంటున్నారు నారాయణరావు.

"ఓ...దానికేం ముహూర్తం పెట్టుకోవచ్చు. మా బ్రహ్మగారితో కొంచం మాట్లాడండి" విశ్వనాథుడు గారు గదిలోంచి లేచి వీధి అరుగుమీదకు వెళ్ళేరు.

"అయ్యా నారాయణరావు గారూ..... ఇలా రండి" ప్రక్కకు పిల్చేరు బ్రహ్మగారు.

"అబ్బాయికి అమ్మాయి నచ్చింది బాగా.. అంతవరకు సరే...ఇంక మనం లాంఛనాల విషయం...కట్నం విషయం..."

"లాంఛనాలన్నీ జరుపుతామండీ.. గవర్నమెంటు బిల్లులోనే వుందిగా!" నారాయణరావు ధైర్యంగా అన్నారు.

"అదసరేలెండి...కట్నం ... దానిమాట చెప్పండి."

"అయ్యయ్యో! ఆమాట ఎత్తకండీ!... కొంపమునుగుతుంది... గవర్నమెంటు వాళ్ళకు తెలిస్తే మీరు నేను అంతా జైల్లోకి వెళ్ళవలసి ఉంటుంది..." నారాయణరావు బిల్లును అంపగా చేస్తూ కని అన్నారు.

"అవన్నీ తెలుసునుసార్ ... మద్యనిషేధం పెట్టలేదూ ... తాగేవాళ్ళు మానుతున్నారా? అంగులోనూ రెండు వేల వరకూ వాళ్ళే ఒప్పుకున్నారు...అది మనం పైకి చెప్పకోవచ్చు...మరి కనీసం ఇంకొక రెండు వేలయినా లేకపోతే...అబ్బాయికి బోల్డు ఖర్చు పెట్టేరుపాపం ..అదంతా ...

"మా మీదగుద్దటం ధర్మంటండీ ,అయినా రెండు వేలకుమించి కట్నం గాని, ఏదిగాని తీసికొనకూడదు. ఇదిగో మీకు పేపరు కూడ చూపెడతా... నారాయణరావు లోపలకు వెళ్ళబోయేరు.

"అవసరం లేదండీ ... నాకు తెలుసు. అందుకే అది లోపాయికారీగా జరగాలి... మీరు ఎవరితోనూ చెప్పగుగా.. మేమంత కన్నా చెప్పం...అయినా నాపెత్తనమేముందండీ! వారు మీతో చెప్పమన్న మాటలు చెప్పేను." బ్రహ్మగారు తన పని తను చేసేనన్నారు.

"ఆహా...! వాళ్ళు బిల్లులు పెట్టేది మనలను లోపాయికారీ ఏర్పాటులు చేసికోమని టండీ" ...రావు ఆశ్చర్యంగా అడిగేరు.

"మరి లేకపోతే... ఈ మాయప్రపంచంలో.. ఏసుకున్నారు.. !"

"అంతేలెండి...పదిమంది మాయమనుష్యులు బయలుదేరితే మాయప్రపంచమవుతుంది...మాయమనుషులకు భయపడి ఇటువంటి వాటి కన్నింటికి తలొగ్గుతూ ఉంటే .. మా పని అయినట్టే ..మేము లోపాయికారీలు ఇవ్వలేము" విసుగ్గా అన్నారు నారాయణరావు.

"అలా అంటే ఎలా చెప్పండి...ఈడొచ్చిన అమ్మాయి...ఇద్దరకు నచ్చిందా యెనూ..." బ్రహ్మగారు సామదానాలలో తచ్చాడుతున్నారు

"ఫరవాలేదు లెండి ఈ సంవత్సరం కాకపోతే అమ్మాయి పెళ్ళి వచ్చేసంవత్సరం చెయ్యొచ్చు...అయితే ఈ లోపాయికారి డబ్బు గురించి ఒక కాగితం మీద రశీదు రాయించిఇస్తారా...?" నారాయణరావు గారు తెలివి ప్రదర్శించేరు.

"ఆఁ...అవన్నీ ఎలా ఇస్తారులెండి... మరి మేం సెలవుతీసికొని వెళ్ళొస్తాం..." పెళ్లివారు నిష్క్రమించేరు.

"ఆకేమిటండి . వచ్చినవాళ్లు వచ్చినట్టే వెళ్ళేరు!" పిల్ల నచ్చిందటగా..." జానకమ్మ అన్యాయంగా అడిగింది.

"ఆ నచ్చింది...మరి బ్లాక్ మార్కెట్ లో ఇవ్వవలసిన రెండు వేలు కట్నం మనకు నచ్చొద్దూ"?

"అయ్యో...ఇదేం కాలమండీ...కట్నాలకు కూడా అప్పుడే బ్లాక్ మార్కెట్ ఏర్పాటు చేసేరన్నమాట"!

"ఆఁ...చెయ్యరు మరీ ప్రబుద్ధులు... చదువుకున్నారుగా..."

"మరయితే ఏమి టాలోచించేరు ?"

"ఆలోచించే దేముంది. వీడు కాకపోతే ఇంకొకడూ...బి.కాం.ప్యాసయి దగ్గిరదగ్గిర రెండువందలు తెచ్చుకుంటున్నాడు ఒక అబ్బాయి. ఈ ఊరే కూడానూ...వాళ్ళతో అమ్మాయిని చూసుకోడానికి రమ్మని చెప్పివస్తాను...నెలతిరక్కుండా పెళ్ళి చేసేస్తాను చూసు అమ్మాయికి..." నారాయణరావు గారు పౌరుషంగా బయటకు వెళ్ళేరు.

*　　*　　*

అమ్మాయి చేత సంగీతం పాడించటం మొదలగు కార్యక్రమాలన్నీ పూర్తయాయి. ఆ పెళ్ళికొడుకు అమ్మాయి సౌందర్యాన్ని వెయ్యికళ్ళతో చూస్తున్నాడు. త్వరగుండా తండ్రి ఈ సంబంధం స్థిరపడుస్తాడని ఆనందిస్తున్నాడు. తండ్రి తన అభిప్రాయం అడిగానా నేనూ అభ్యంతరం చెప్పనవసరం లేనట్లున్నాడు రఘు. వరప్రసాదరావుగారు కొడుకు ముఖంలోని మార్పులను గ్రహించేరు. అమ్మాయీ లక్షణంగానే వుంది కానీ......ఆలోచన తెగటం లేదు

"అయ్యా బావగారూ అమ్మాయిని చూపించట మయింది......అబ్బాయికీ నచ్చిందనే


## కుమారి మాత్రలు (Regd)

బహుకాలములో అనేక బాధపడు స్త్రీలకు అనుకూలమైన ఔషధం నాణ రు. 8. స్పెషల్ రు. 5. ఎక్స్ట్రా స్పెషల్ రు. 8. పెద్ద మందుల షా లన్నింటిలో దొరుకును.

P Devee & Co. (AP) Calcutta

## నారసింహ లేహ్యమ

బంగారుతో చేరినది. మేహ, ... ఆశక్త, వివృత్తుల వగైరా హా... బలము రక్తవృద్ధి కలిగించును. ... దర్శి రు 8.80 పోస్టేజి రు.1-...

ఏ. వి. ఎ. అండ్ కంపెనీ ఆయుర్వేద వర్... ...(PO) నెల్లూరుజిల్లా.

## డాక్టర్ డిగ్రి పొందండి!

ఇంటిలో తీరికగా కూర్చొని వుం... పత్రము, పోస్టల్ ట్యూషన్ పొంది ప్రభుత్వ రిజిస్ట్రేషన్ పొందిన కాలేజి ద్వారా మీరు డిప్లొమా పొందవచ్చును ఉచిత ప్రాస్పెక్టస్‌కు వ్రాయండి.

Indian Homeopathic College, (AWM) Jullundur City.

పండిత డి గోపాలాచార్యులవారి




ఆయుర్వేదాశ్రమం(ప్రైవేటు) లిమిటెడ్
మదరాసు .17

# LEUCODERMA

(శ్వేత కుష్ఠ)

వలన ఎంతమాత్రం భయపడనక్కర లేదు. మావద్ద గల ప్రఖ్యాత ఆయుర్వేద ఔషధములు సులభముగా, నమ్మకంగా తెల్ల, ఎఱ్ఱ మచ్చలు ... నైన, శరీరంలో ఏభాగమునందున్నా పోగొట్టును. వేనవేలు మా మందు విజయమునుగూర్చి ప్రశంసిస్తున్నారు పైపూత, లోనికి మందు సీసా 1 ...

రు. 7/- మాత్రమే.

Vaidyaraj Ramsharam Lalgupt (AP.)PO. Rajdhanwar(H.Bag)

# యూరప్ యాత్రలో రెండు మజిలీలు

శ్రీ కృష్ణ

## ఫ్లారెన్స్ (ఇటలీ)

ఇటలీలో ప్రాచీన సంస్కృతీ పునరుజ్జీవానికి ఆటపట్టు, అనేక కళాప్రవాంతులకు ఊటపట్టూ ఫ్లారెన్స్ నగరం; ఇటలీ దేశలక్ష్మి జడలో నాగరం! రకరకల ప్రాచీన కళాప్రదర్శనశాలలు, విగ్రహాలూ, కలకలలాడే షాపులూ, బజార్లూ గల 'ఆర్నో' వంతెన, చూడముచ్చటగా ఉంటాయి. ఒకప్పుడు ఇక్కడ మృతుడైన ఒక భారతీయ రాజకుమారుని స్మృతిగా అక్కడి ప్రజలు శిలావిగ్రహం ప్రతిష్ఠించుకున్నారు. ఆశిలావిగ్రహం చంద్రకాంత శిలావిగ్రహం అతని రూపవిలాసాలు పుణికిపుచ్చుకున్న జీవకళావిగ్రహం. నలుగురూ సాయంవేళ వాహ్యాళికి తరలివచ్చే చక్కని ఆరామంలో అది ప్రతిష్ఠించారు.

ఫ్లారెన్స్ ఉన్నివస్త్రాలకు పేరుగన్నది. ఆస్ట్రేలియా, ఫ్రాన్స్, జర్మనీ, బెల్జియం, హాలెండ్, స్విట్జర్లాండ్, అమెరికాలనుంచి ముడిఉన్నిని ఇటలీ దిగుమతి చేసుకుంటుంది. 1958 లో 42,850 టన్నుల ఉన్ని ఇటలీ దిగుమతి చేసుకున్నది. ఇక్కడ ముడిఉన్ని విభజించి శుద్ధిచేస్తారు.

ఇలా శుద్ధిచేసిన ఉన్నిని ఇండియాకూడా దిగుమతి చేసుకుంటున్నది. 1959 లో మొదటి ఆరునెలలలోను అయిదులక్షల పౌనుల ఉన్ని ఇండియా దిగుమతి చేసుకున్నది.

## బెర్లిన్ (జర్మనీ)

"అదిఒక బంగారుకాలం; అదే ఒక మహావిలయసమయం. ఆశారేఖలు పొటమరించిన సుప్రభాతం, అదే విగతాశావిచార కాళరాత్రి. భావివిశ్వాసగీతాలు కుహూవులాలపించే నవవసంతం — ఆరోజే నిస్పృహాన్విత జనశిశిరం" — ఇవి నేనంటున్న మాటలు కావుసుమా! 1790 లో లండన్, పారిస మహానగరాలనుగూర్చి ప్రసిద్ధ నవలాకారుడు చార్లెస్ డికెన్స్ 'టేల్ ఆఫ్ టూ సిటీస్'లో చేసిన వర్ణన అది.

ఒక్కసారి నేటి బెర్లిన్ మహానగరంలో కాలుపెట్టినవారికి అప్రయత్నంగా పైమాటలు గుర్తుకురాక తప్పదు. బెర్లిన్ నగరంలో తూర్పు, పశ్చిమ భాగాలు దర్శించినవారికి ఆమాటలలో నిజం బోధపడుతుంది. తూర్పు బెర్లిన్‌లో 'నిస్పృహాన్విత జనశిశిరం' ఆవరించి నిస్తబ్ధంగా ఉంటుంది. ప్రపంచ యుద్ధం అయిపోయి పన్నెండేళ్లు గతించినా తూర్పు బెర్లిన్‌లోని శిథిలాలు, పాడుపడిన భవనాలు చూస్తే అప్పుడే కాలి చల్లారినట్లు, ఆక్రితం రాత్రే బాంబులు పడ్డట్లు తోచక మానదు. ఈ గత చరిత్ర శిథిలశకలాల్లోనే కనిపిస్తాయి మనకు ఫ్రెంచి రాయబారి కార్యాలయము, అడ్లాన్ హోటల్, విలియమ్ కైజర్ కోట, హిండెన్‌బర్గ్ కోట, హిట్లర్ 'ఛాన్సెలరీ' భవనం, ప్రసిద్ధ క్రైస్తవమతాలయమూను.

'స్టాలిన్ అల్లే' అనే ప్రాంతంలో మనకు రష్యన్ వాతావరణం కనిపిస్తుంది. దుకాణాలు, కాపురాలు నిండి ఉండే ఆకాశసౌధాలు (Sky Scrapers) బారులు తీరినిలిచి ఉండటంవల్ల ఈ బజారు ఇరుకుగా సందులా ఉంటుంది. పశ్చిమ బెర్లిన్‌లా తూర్పు ప్రాంతం బాగుండదు. తిండి, అద్దెలు చాలా చౌక అయితే తతిమ్మా సామగ్రి చాలా ఖరీదు. సామాన్యంగా కొని ఎవరూ భరించలేరు. ఇండిర ఎంత హెచ్చు ఖరీదులో అక్కడ 14,700 మార్కుల ఖరీదు పెట్టక సామా కారుకూడా దొరకదు.

కొంపగోడు అన్నీ వదలి తూర్పు నుంచి పశ్చిమ బెర్లిన్‌కు శరణార్థులు రో రెండు మూడు వందలదాకా వస్తూవుం చిన్న సంచిలో అవసరమైన సామానుల కుని వారు తరలివస్తుంటారు. వీరిలో నలభైఅయిదుమంది కార్మికులు, మిగత డాక్టర్లు మొదలైన నిపుణులు.

పశ్చిమ బెర్లిన్‌లో మగవారికన్న సంఖ్య విపరీతంగా పెరుగుతోంది. 34 మంది స్త్రీలు, 300,000 మంది పెళ్లి యువతులు అధికంగా ఉన్నారు. 'బా హౌసెస్' ఏర్పాటుచేసి ప్రభుత్వం సులువుగా వివాహాలయ్యే ఏర్పాటు న్నది. అయితే దీనిఫలితం అష్టం తిరి వార్తలు. ఈ బ్రహ్మచారి గృహాలలో యువకులు బ్రహ్మచారులుగానే ఉండ డం, వివాహం లేకుండానే సంఖ్య కృతం కావడం జరుగుతున్నది.

బెర్లిన్‌లో వెయ్యిమంది భారతీ లున్నారు. సామాన్యంగా భారతీ పెళ్ళాడే జర్మన్ వనిత బెర్లిన్‌లోనే పోతుంది. మన జాత్యాధిక్యత ఆమెకు అనురాగపంతో అక్కడే ఆమెకు స్వే ఉంటుందట!



# శరత్ చెప్పిన కథలు

తెనిగింపు: సాంబశివరావ్ బుచ్చిబ్జి



## శ్మశానంలో సంబరం

ఇంద్రదేవ్ గారింట్లో ఓనాడు శరచ్చంద్రుడు టీ తాగుతున్నాడు. రకరకాల కబుర్లూ, ముచ్చట్లూ పిచ్చాపాటిగా చెప్పుకుంటున్నారు. ఆసందట్లో ఇంద్రనాథుడి తాలూకు చొరవా, సాహసం ప్రసక్తి వచ్చింది.

"అబ్బో, ఆ యింద్రనాథుడు, అంటే యువరాజు, ఎంత చొరవైనవాడనుకున్నారు! అతనితో ఓ కంచాన తిని ఓ మంచాన పడుకున్న నాబోటిగాళ్ళకే తెలుసుండా సంగతి! మేమంతా ఎక్కడయితే బెదిరి తేజారత్తి పారిపోయే వాళ్ళమో, అక్కడ తను పీఠం వేసుక్కూచునేవాడు. భయమనేమాట అసలతని జీవితంలోనే యెరగడంటే నమ్మండి. ఇంతకూ అతనికుండే ధైర్యం యెలాంటిదో చిన్నకథ చెప్తా వినండి", అంటూ యిలా ఆరంభించారు తమ కథని శరత్ బాబు—

"నేనెప్పుడూ రాజుకి కుడిభుజంలా వుంటూండేవాణ్ణి అవసర మొచ్చినప్పుడల్లా నన్ను రాజు పిలుస్తూనే వుండేవాడు. ముఖ్యంగా శవాన్ని శ్మశానానికి మోసుకుపోవడమంటే ఒక్కరివల్ల అయ్యే పని కాదుగా మరి! అందుకని తిరుచు యీ పని కోసరం నేనతనివెంట వస్తూ వుండాల్సొచ్చేది.

ఆ దఫా కాళీపూజ జరిగిన మర్నాడే మావయ్యగారి యింట్లో దగ్గర గొప్ప తిరునాళ జరుగుతోంది. కలకత్తానించి గొప్ప గొప్ప భక్తులంతా వొచ్చారు. ఆ చుట్టుపట్లవున్న పల్లెగ్రామాల్లో జనులంతా సంబరం చూసేందుకు విరగబడి మరీ వొచ్చారు. నేను కూడా ఓ మూల కూచుని ఆ తిరునాళ్ళని తిలకిస్తున్నా. అసమయానికల్లా యెక్కణ్ణుంచి వూడిపడ్డాడో గాని, రాజు ఒక్క గంతులో గభాల్న వురికిపడి, "ఊఁ—పదపోదాం," అన్నాడు.

అంతే. ఇహ నోరు మెదపకుండా లేచి బయటికొచ్చాను. అవతలి వీధి మొగదల తారాపదుడున్నాడుగదూ! పాపం వాళ్ళబ్బాయి కలరా పట్టి చచ్చిపోయాడు. పసిపిల్లాడు; మాకేళ్ళకూడా వుంటాయో లేదో! ఎన్నో తంటాలు పడ్డాడు కానీ బతకలేదు. ఒక్కడే కొడుకు. ఆ కొడుకుచూస్తే యిలా అన్యాయంచేసి వెళ్ళిపోయాడు. తీరా కలరా రోగి శవం. దాన్ని పట్టుకుని తారాపదుడూ, ఆయన భార్యా పిచ్చెక్కిన వాళ్ళకి మల్లే కుయ్యో, మొర్రోమని మొత్తుకుంటూ యేడుస్తున్నారు. ఆ శవాన్నింకా అక్కడుంచామంటే యేం మోసం వొస్తుందో చెప్పలేం. అందుకని ఏదేమైనా సరే శవాన్ని యీ క్షణమే శ్మశానానికి తీసుకెళ్ళిపోవాలి. ఆ వీధిలో వుండే వాళ్ళంతా సంబరం చూసేందుకెళ్ళిపోయారు. వీధివీధంతా ఖాళీ. మువ్వలాగయినా రావాలిస్మీ" అన్నాడు రాజు.

మరేమీ మాట్లాడకుండా రాజుతో బాటే వెళ్ళిపోయాను. సంబరంచూసే సరదా అంతటితో సరిపోయింది.

తారాపదుడికీ, ఆయన భార్యకీ నాలుగు విధాలా నచ్చజెప్పి, ఆ పసికందు శవం పట్టుకుని మేం యిద్దరం శ్మశానానికి బయల్దేరాం. అప్పటికి రాత్రి సుమారు ఒంటిగంటపైనే దాటి వుంటుంది.

"రాజూ, ఓలాంత రెక్కడయినా నంపాయించి పట్టుకొస్తే బావుంటుందేమో!" అన్నా బిక్కు బిక్కులాడూ.

"వానిద్దూ—లాంతరూ లేదు గింతరూ లేదు. ఇంత అర్ధరాత్రికట్ల జానికోసం యెక్క వెళ్ళుతుంటాం. ఎవరు మాత్రం యి మద, నా దగ్గిర అగ్గిపెట్టుంది. అంత అవసరమైతే మాసుకుందాంలే" అ... రాజు.

నేను మళ్ళీ మాటాళ్ళేదు. ఆ అ... శవాన్ని భుజంపై వేసుకుని రాజు... నడిచి వెళ్తుంటే, నేనతనివెనక కి... మనకుండా బయల్దేరాను.

శ్మశాన మేమో గంగానది వొడ్డు... అదెంత పెద్దదనుకున్నారు! దాని... చెప్తుంటేనే గుండెలాణికి పా... యిప్పుడు కూడా. పగలు సైతం జ... శ్మశానంవైపు వెళ్ళడమంటే బెంగ... తేజారత్తిపోతారు. దానిచుట్టూ... చూసినా చాలా దవ్వుదాకా వూరు... వాడగాని, చిన్న కొంపగాని యేదీ... కయినా లేదు. అంతా యిసకమయం... డక్కడ ఒకటో, రెండో ఖర్జూరం... మళ్ళ గుబుర్లూ మాత్రం అవుపిస్తాయి.

శ్మశానం మధ్యనే ఓ చిన్న... శవాల్ని తీసుకొచ్చే వాళ్ళంతా... ప్పుడుగాని, వానప్పుడుగాని ఆ పాక... వొచ్చి కూచుంటారు. ఈ మోస్తరుగ... యెంతో వుపయోగంగా వున్నప... అదంటే వల్లకాటికన్న వల్లమాలిన... ఆ వూరి వాళ్ళందరికీ. అదేమో దె... కొంపట. రాత్రుళ్ళు సంగతలా వుం... పట్టపగలు యెవరైనా తోడులేక... వొంటిగా వెళ్ళాలంటే, అటు క... మాసేందుక్కూడా భయపడ్తూంటారు.

రాజు మాత్రం యిలాంటివేవీ... చెయ్యడు. ముందతనే తిన్నగా ఆ పా... అడుగు పెట్టాడు. నేను కూడా అతడి... కాలే లోపలి కెళ్ళానుగాని, నా వొళ్ళు... అదుపులో లేదప్పుడు; నా కాళ్ళకూ...

> ### ఇంటి గొడవలు
>
> ఉపాధ్యాయుడు: "మన... వివేచన ఉంది; జ్ఞానం ఉం... కనుక మనం పశువులం కాదు...
>
> గోపీ: 'మరి మనమం... పశువులలోంచే వచ్చామని న... నాన్నగారు ఎప్పుడూ చెబుత... ఉంటారెందుకండీ.'
>
> ఉపాధ్యాయుడు: 'ఒకే వి... యింటి గొడవలు క్లాసు... తీసుకురాకు ఎప్పుడూ'



## సుఖ జీవిత సేవ

భారత "సిద్ధ వైద్య మహిమ" మన దేశ సిద్ధుల సాటిలేని కీర్తికి ఒక తార్కాణము.

"మేల్ మాయిల్ మందు"

ప్రపంచములో ప్రఖ్యాతి గాంచిన మేహ, కుష్ఠరోగనివారిణి భయంకరమైన మేహ వ్యాధివల్ల కష్టపడువారలకు పునర్జన్మమిచ్చు అద్భుత సంజీవి మేహరోగ నివారణ మూలి, లేహ్యము.

డా॥ కే. టి. కృష్ణమూర్తి ఆచారి & సన్సు,

5/22, మేల్‌మాయిల్. (P. O.) (N. A. Dt.) S. India.

నమ్మకమైన నంజనగూడు కుటుంబ ఔషధములను వాడుడు.

## నంజనగూడు పండ్లపొడి

తీపి, ఉప్పు ప్యాకెట్లు.

సకల పండ్లవ్యాధులను ఆపి, మాన్పు

బి.వి.యస్.టి. నంజనగూడు పండ్లపొడి (డబ్బ)

| శ్రీకర కస్తూరి మాత్రలు | కర్జ్ | బాలక్స్ |
|---|---|---|
| పిల్లలకు, పెద్దలకు శ్రేష్ఠమైన సంజీవి. | (గోరోజన మాత్రలు) పసిపాపలకు. | విరేచన మాత్రలు పెద్దలకు పిల్లలకు. |
| జ్వరేగ్ | కాలరెక్స్ | జిన్‌జిప్ |
| సకల జ్వరములకు. | అతిసారము, కలరాకు. | జీర్ణవృద్ధికి, పిత్తశాంతికి. |

స్వాభావిక, పరిశుద్ధ యూనికార్న్ తేనె

సోల్ ఏజంట్లు: యునైటెడ్ కన్సర్న్, 54, బందరు వీధి, మద్రాసు-1.

శాఖలు: విజయవాడ, హైదరాబాదు, (స్టాకిస్టులు కావలెను)



## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవుచున్నదీ, మీ సరియైన దర్శనుగురించినీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పువ్వుపేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదీలగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము పొందుటకు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేనయినా వున్న యెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన ఫోకట్లు మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయుండి.

Pt. DevDutt Shastri, Raj Jyotishi (WP-13) Jullundur City.


## శ్మశానంలో సంబరం

లకూ ఏవో మేకులు దిగ్గొట్టినట్టయిపోయింది. అయినా రాజా దగ్గరే వున్నాడు. అందుకే ఆ మాత్రమైనా నిలబడగలిగాను.

అరుగుమీద శవాన్నుంచి-"అబ్బా, చాలా సేపయింది బీడీతాగి; అందుకని ఓ దమ్ము కొట్టేస్తాను ముందు" అన్నాడు రాజా.

ఒకపక్క గుండె బెదురుతో వేల మార్పులు చూస్తూ నే పక్కనే చతికిల బడ్డాను. అంతలో ఆ చీకటి తెరల్లోంచి ఎక్కణ్నుంచో సన్నటి గొంతు గభీమని వినిపించింది. "ఆ చేత్తోనే నాకూ ఓ బీడీ ఇస్తారా?" అంటూ.

ఇహ చూసుకోండి నా భయం! ఒక్క అరుపుతో లేచినుంచున్నాను. కాళ్ళు తేలిపోతున్నాయి. కంటిరెప్పలు క్రింద వాలటం లేదు. వెంట్రుకలన్నీ నిక్కబొడిచాయి. వొళ్లంతా చెమటలు కమ్మింది. గుండె గడియారం ముల్లులాగ గబగబా కొట్టుకుంటోంది.

"ఎవరది?" అన్నాడు రాజా నిర్లక్ష్యంగా

"నేను" ఇదీ జవాబు.

"నేనంటే ఎవరు?" అంటూ రాజా చప్పున అగ్గిపుల్ల తీసి వెలిగించాడు.

ఆ వెలుగులో పాక అంతా కలయజూశాం. మా పక్కనే మురికి చేరిపోయిన చిన్న పరుపు వేసుకుని పడుకున్నదో మనిషి లాంటి ఆకారం. ఆపాదమస్తకం దుప్పటి కప్పుకున్నాడు.

రాజా బాగా పరకాయించి చూసి—"ఇదవిటోయ్ ఇది మరీ గమ్మత్తుగా వుంది. ఎవరిదో శవంలా వుందిలే!-ఎవరో పాపం కాల్చేద్దామని తీసుకొచ్చి ఎందుకో యిలా వొదిలిపెట్టి పోయారు. ఒకవేళ కర్రలు-గిర్రలవీ తెచ్చేందుకెళ్లారో యేమిటో మరి!" అన్నాడు.

వెంటనే వినిపించింది మళ్ళీ అదేగొంతు. "ఊహు నేను శవాన్ని కాను. బ్రతికేవున్నానయ్యా బ్రతికేవు-న్నా-ను."

ఇది వినగానే నాకసలు మరీ వూపిరాలేదు. రాజా చేతుల్ని నొక్కి యేదో చెప్పాలనుకున్నా కాని నోట్లో వున్న పళ్ళన్నీ బిగుసుకుపోయినట్టయింది. దాంతో మరి నోరెత్తలేకపోయాను.

రాజా కివేవీ లెక్కలోకిరావు. అందుకని వెంటనే అతనంటున్నాడు. "అయితే యింతకూ నువ్వెవరివయ్యా?" అంటూ గట్టిగా అడిగాడు.

అగ్గిపుల్ల పూరిగా కాలిపోయింది. రాజా మరోటి వెలిగించాడు. ఆ దుప్పట్లోంచి మళ్ళీ అదేగొంతు వినిపించింది.-

"నేను గంగా యాత్రికుణ్ని బాబూ."

రాజా మరి కొస్త ముందుకెళ్లి ఆ దుప్పటి

అంచు కొంచెం లాగాడు. ఇంచుమించు యౌవనదశ్యోళ్ళ పండుముసలాయన మా వేపు రెప్పవెయ్యకుండా మరీ చూస్తున్నాడు. మొహంపైని మృత్యుచిహ్నాలు మచ్చుకయినా లేవు.

రాజు వెంటనే మరో బీడీ వెలిగించి ఆ ముసలాయన నోట్లో వుంచాడు. అతగాడు మాంచి జోరుగా ఓ దమ్ములాగి, "ఆహా, ఎన్నాళ్ళకు తరించిందినాయనా, నా జన్మ ఆఖరికి మీరు దేవుళ్లాగ వొచ్చి రక్షించారు. ఈ వూరొచ్చి చానాళ్ళయింది. నోరువిడిచి అడిగినా ఒక్కరూ చిన్న బీడీపీక యిచ్చిన పాపాన పోలేదు. అంత పిసినారివాళ్ళు" అన్నాడు.

ఇహ రాజు ఆ ముసలాయనతో మాటలకి లంఘించుకున్నాడు. 'ఇంతకూ మీది ఏవూరో చెప్పావుకాదు. నీతో ఎంతమంది కొచ్చారుగి? వాళ్ళంతా యేమయ్యారు? నువ్విక్కడ చిక్కుపడ్డావేం? ఏవిటో యి వైనం కాస్త వివరంగా చెప్పు తాతయ్యా' అని అడిగాడు రాజు.

"ఏం చెప్పను నాయనా, ఇక్కడికొచ్చి అప్పుడే మూడోనాళ్ళు. కాని రెండు తంటాలుపడ్డా చావనూ, తంరాకుండా వుం




రిజిస్టరు చేయబడిన 'సాన్ఫొరైజ్డ్' ట్రేడు మార్కునకు అధికారులైన క్లూయెట్ పీబోడీ అండ్ కంపెనీ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ. లో సంస్థాపితము) వారిచే ప్రచురింపబడినది. ఈ కంపెనీ యొక్క కచ్చితమైన ప్రమాణములకు తగినట్లు కుంగకుండా ఉండే బట్టలమీదనే 'సాన్ఫొరైజ్డ్' ట్రేడుమార్కు వేయుటకు అంగీకారము యిస్తాము.

వివరములకు : 'సాన్ఫొరైజ్డ్' సర్వీస్, 95, మెరిన్ డ్రైవ్, బొంబాయి-2.

SAN 56-8 TE

# యు-డి-కొలోన్ మరియు
# యు-డి-కొలోన్ సోప్
# టాటావారిచే తయారు చేయబడినది




## సరియైన సహవాసి

టాటావారి యు డి కొలోన్ ... స్త్రీ పురుషుల ఉభయులకూ పరిశుభ్ర పరచుటలో దివ్యమైనది ... దాని మనోల్లాసకరమైన చల్లదనము మిమ్ములను హాయిగానుంచును.

టాటావారి యు డి కొలోన్ సోపు — దాని గుణమునకు తగిన పరిమళముగలది ...

దాని తాజాదనము చెడకుండా నిలవుండుటకై ప్రత్యేక బంగారు రేకు కాగితపు రేపర్‌లో ప్యాక్ చేయబడినది.

**ఇవి టాటా ఉత్పత్తులు—కనుక ఇవి మంచివని మీకు తెలియును**


# శ్మశానంలో సంబరం

నాతాలూకు ఇద్దరు మనవరాళ్ళూ, మరొకాయనా నన్నిక్కడికి తీసుకొచ్చారు. వాళ్ళు ముగ్గురూ నాతోనే వుండేవాళ్ళు. కలకత్తా నుంచి ఎవరో భక్తబృందం భజనలు చేసుకుంటూ వొచ్చారట. ఇందాకే వాళ్ళలా వెళ్ళారు. నాకు చావేమో వేగంగా రాకుండా వుండట. అందుకని వాళ్ళు నాపైని మహా రుసరుసలాడుతున్నారు. చచ్చేవాడెలాగూ అక్కడే చావనీ అని యీ ముసలాణ్ణి మీద కెక్కించుకు తీసుకొచ్చాం. ఇక్కడ చూస్తే యీ గంగానది గాలితగిలి ముసలిపీనుగ మళ్ళీ దుక్క తన్నుకున్నాడు. చావసలు మచ్చుకైనా వొచ్చే సూచన్లు లేవంటూ యేలుక్కుంటారు. నాకేం తెలుసు నాయనా యీ గొడవలన్నీను; నేనెప్పుడు చస్తానోయేమిటో అసలు గంగాయాత్రికులుగా వొచ్చేవాళ్ళు తిరిగి యింటికెళ్ళ కూడదటగా!" అన్నాడా ముసలాయన.

"ఎవరు చెప్పారు తాతా తిరిగి వెళ్ళకూడదని? నిన్ను చూస్తుంటే ఇప్పుడప్పుడే చచ్చేట్టు లేవు. మంచి ఆరోగ్యంగానే అవుపిస్తున్నావు మీ ఇల్లెక్కడ చెప్పు. ఇప్పుడే దిగబెట్టి వస్తా. లేకపోతే యింటికి మళ్ళ కూడదని నిన్ను తీసుకుపోయేందుకొచ్చారే పెద్ద మనుషులు—వాళ్ళు ముగ్గురూ నీ గొంతుక ముడి పిసికి నీ పని పట్టేస్తారు జాగర్త" అన్నాడు రాజు.

"నువ్వు చెప్పింది నిజమే నాయనా, చాన్నాళ్ళబట్టి మా వాళ్ళలాగే బెదిరిస్తున్నారు. ఏదో వొంటిగా మాని ఎప్పుడో ఒహాప్పుడు వాళ్ళు నా పీక పిసికేయక మానరు" అన్నాడా ముసలాయన.

అప్పుడు రాజు అతగాడికి ధైర్యం చెప్పి—"సరే తాతా, ఇక ఫర్వాలేదులే. భయపడకు. మా పనేదో ముందు పూర్తికానీ. తర్వాత నిన్నిక్కణ్ణుంచి తీసుకెళ్తాం. ఈ రాత్రికి మా యింట్లోనే వుందువుగానిలే. రేపుదయం మీ ఇంటికి దిగబెట్టేస్తాం" అన్నాడు.

తర్వాత తారాపదుడి తాలూకు అబ్బాయిని పాతిపెట్టేశాం. రాజు గంగలో మునిగి స్నానాదులు ముగించుకొచ్చి ఆ ముసలాయన్ని లేవదీసి తన భుజంపైని వేసుకున్నాడు. అతగాడి దుప్పటీ, బిచాణా పట్టుకోమని నాకప్పజెప్పాడు.

ఇంతకుముందిక్కడికొచ్చేప్పుడెలా వొచ్చామో, వెళ్ళేప్పుడూ అలానే వెళ్ళిపోయాం. రాజు ముందు నడిచి వెళ్తున్నాడు. అతని భుజాలపైని ముసలాడున్నాడు. వాళ్ళ వెనక దుప్పటీ, పరుపూ పట్టుకుని నే బయల్దేరాను.

మావయ్యగారింటికొచ్చి చూశాను. సంబరం యింకా అక్కడ సాగుతూనే వుంది."



# గెలుపెవరిది

శాంతిసాగర్

‘నిన్ను ప్రేమిస్తున్నాను, శారదా!’

‘అంటే?’ కళ్ళు సగం మూసి తల ఓరగా పెట్టి, శివరాం వైపు చూస్తూ అర్థం చెప్పమని ప్రశ్నించింది శారద. శివరాం నీళ్ళు నమిలాడు.

‘నాది స్వార్థరహితమైన ప్రేమ; నీ కోసరం ఏం చెయ్యమన్నా చేస్తాను...... నన్ను వివాహం చేసుకోడం ఇష్టమేనా శారదా?’

‘ఏం చెయ్యమన్నా చేస్తానన్నావు; అయితే నన్ను వివాహం చేసుకోమని అడగొద్దులే’ అని నవ్వింది శారద.

‘అయితే నేనంటే నీకు అనురాగం లేదూ? నా ప్రేమను తిరస్కరిస్తావా?’

‘ఎందుకు తిరస్కరించకూడదో నీవే చెప్పు.’

‘అవును...ఎందుకు కూడదు...కాని, శారదా, ప్రేమకు కారణం ఏం వుంటుంది? నేను నిన్నెందుకు ప్రేమిస్తున్నాను? నువ్వు సంగీతం బాగా పాడుతావనిగాని, నీ కళ్ళు నిర్మలతటాకాల్లా ఏదో మధురానుభూతి కలిగిస్తాయనిగాని చెప్పలేను. ఇదంతా ఒక్క అసమగ్రమైన వివరణ మాత్రమే. నా హృదయం, నా జీవితమే నీది...ఇలా ఆత్మసమర్పణ చేసుకుంటున్న నన్ను స్వీకరించలేవా, శారదా?’’

శారద మళ్ళీ నవ్వింది. ‘నీ హృదయం నాకెలా కన్పిస్తుంది...నీ జీవితం...నీవింకా విద్యార్థివే...నాకంటే ఒక్క సంవత్సరం పైమెట్టులో...నాకు వచ్చిన సంగీతం కూడా నీకు రాదు. పెద్దగా డబ్బుకూడా లేదు...ఏం లేకపోయినా కనీసం డబ్బున్నా బాగుండిపోయేది...ప్చ్...’ అని తేల్చివేసింది శారద తమాషాగా నవ్వుతూ.

‘ఛి, చివరకు నువ్వు డబ్బుకే విలువయిస్తావన్నమాట!...అంతేనా?’

‘ఏం? డబ్బులేనిది ఏపని జరుగుతుంది? నువ్వు మాత్రం ఆ వుంటే కొత్త డబ్బు లేకంటే ఎలా చదువుకుంటావ్? ఎందుకు పనికి వస్తావ్?’

శివరాం మాట్లాడకుండా లేచి వెళ్ళిపోయాడు. శివరాంకు పందొమ్మిది, శారదకు పదిహేడు వయసు. శివరాం ఇంటరు సీనియర్, శారద జూనియర్ — ఆ రోజుల్లో.

* * *

మూడేళ్ళలో శివరాం ఆనర్సు క్లాసులో పాసయాడు. శారద ఇంటరు రెండు సంవత్సరాలు తప్పి మూడోసారి పాసయి, ఉన్న ఊళ్ళోనే బి. ఎ. లో ప్రవేశించింది.

ఆనర్సు డిగ్రీ పుచ్చుకున్న సంవత్సరమే స్వంతవూళ్ళో కాలేజీలో ఎకనామిక్సు లెక్చరరు అయాడు శివరాం. శారద అతని స్టూడెంటు. తరగతిలో అటెండెన్సు పిలిచేపుడు ‘సార్’ అంటున్నా, తను చెప్పేది తాను శ్రద్ధగా వింటోంది అని నమ్మకం శివరాంకు.

కాలేజి తెరిచిన రెండుమూడు నె లకు గాని శివరాం శారదతో మాట్లాడ తటస్థపడలేదు. ఒకసారిమాత్రం లైబ్రరీ కన్పించి ‘మళ్ళీ ఒక్కసారి కాలేజీ చేరాం కదూ, మిస్టర్ శివరాం?’ అన నవ్వుతూ.

‘అవును. కాని నువ్వింకా చదువుతు వున్నావే, శారదా’ అన్నాడు ఏడిపిం లని.

‘ఏదో సరదాకి...నువ్వు లెక్చరిస్తే వి లని!’ అనేసి విసురుగా వెళ్ళిపోయింది.

ఎకనామిక్సులో టెస్టుపెడితే శార మార్కులు చాలాతక్కువ వచ్చాయి. పేపరునిండా రిమార్కులు వ్రాసి పెట్ట శివరాం.

ఆ సాయంత్రం శారద శివరాం దగ్గ వచ్చి, ఏమండీ, సార్ తెలిసిందాన్ని అని నా పేపర్ని ఒక గంటసేపు దిద్దిన న్నారే! నీకు ఎకనామిక్సురాని విష నువ్వు చెప్పనక్కర్లేకుండానే తెలుస అన్నది.



# ★ గెలుపెవరిది ★

"అయితే ఎకనామిక్సు కూడా అక్కర
) విరయమైపోయిందేమిటి?"

"దాంట్లో కొత్తయినా ఆకర్షణ
ంటేగా మరి"

"నీకసలు కేపిటల్, యుటిలిటీ లాటి
గాలకే అర్థం తెలీదే నువ్వు ఎకనామిక్సు
దుకు తీసుకున్నావ్ మరి?" అన్నాడు
వంగా.

"ఇంకేం, తీసుకు [illegible] లెక్కలు [illegible]
వు. [illegible]
నామిక్స్‌గా" అన్నది [illegible]

"[illegible]."

"[illegible]!"

[illegible]

శివరాంతో మాట్లాడలేదు. ఫస్టు టెర్ము పరీక్షలో ఎకనామిక్సుకు అసలు హాజరు కాలేదు.

శారదను చూస్తోంటే శివరాంలో మూడేళ్ళనాటి అనురాగ భావం మళ్ళీ తొందరపెట్టుతోంది. కాని శారద తన మాట వినదు. అసలు మాట్లాడడమే కష్టంగా వుంది. ఒకరోజు శారదను వచ్చి మాట్లాడమని కబురు పెట్టాడు, వచ్చింది.

"శారదా నువ్వు ఎకనామిక్సును చాలా అశ్రద్ధ చేస్తున్నావు. అంత యిష్టం లేకపోతే [illegible] వదులు మానేయరాదూ?"

"ఎకనామిక్సుకోసం కాదు చదివేది. [illegible]."


మెరయుచు పొంగే ఈనో
★ దేహములోని మలినములను పోగొట్టును
★ చల్లదనము నిచ్చును
★ కడుపున స్వస్థత చేకూర్చును



గుణము కలిగిస్తూనే
నవోత్సాహమును
కలిగించును




ఈనో
'ఫ్రూట్ సాల్ట్'
త్రాగండి

'ఈనో' మరియు 'ఫ్రూట్ సాల్ట్' అను మాటలు రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కులు
[illegible] (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్


'సరదా ఏమిటి సరదా' ఎందులో వుంది ఆ సరదా?

'ఇదుగో మీతో వచ్చి మాట్లాడ్డంలో! పోనివ్వండి మీకు కష్టంగా వుంటే మీ క్లాసుకే రాను.'

శివరాం తన ధోరణి మార్చితేగాని లాభం లేదనుకున్నాడు. శారద తన క్లాసుకే రాకపోతే తనతో మాట్లాడకనే పోతే, ఇక తను గెలిచేదెలా?

* * *

'అదికాదు శారదా! నీకు బాగా తెలిసిన వాణ్ణి వున్నానుగదా, ఏదైనా సహాయం కావాలంటే చేస్తాను. క్లాసులో నీకు అందరికంటే తక్కువ మార్కులు రావడం నాకు తలవంపులుగా వుంది. అందుకని చెబుతున్నాను.

'ఓ అలాగా! అయితే కష్టపడి చదివి మంచి మార్కులు తెచ్చుకుంటాను!

'ఇదిగో యీ నోట్సు తీసుకువెళ్ళి చూడు'

'థాంక్స్!'

ఒకవారం తర్వాత శారద తన్నై వచ్చింది నోట్సు పట్టుకుని. తానడిగిన సందేహాల ద్వారా కొంత శ్రద్ధ తీసుకుంటున్నట్లు వ్యక్తం చేసింది కూడా.

ఒకరోజున కాలేజీలో వినోదపు సందర్భంలో శారద పాటపాడింది. ఆపాట వింటూంటే. అందరూ ఆ పాటలను మెచ్చుకొంటూంటే ఆమెమీది అనురక్తి శివరాంలో మళ్ళీ ఉవ్వెత్తుగా లేచి ఉప్పెనలా ముంచింది. మర్నాటిరోజు శారద వచ్చినపుడు తను పాఠం చెబుతూ వివుస్తూ ఆమె కొంటెకళ్ళ నవ్వు ఎదురైనప్పుడల్లా శివరాం హృదయం వివశమై పోతోంది.

చివరకు శివరాం ఆలోచించి ధైర్యం తెచ్చుకున్నాడు. ఇప్పుడు శారద తన స్టూడెంటు; ఎకనామిక్సు బోధిస్తున్నాడు, తనకంటే తెలివిలో చదువులో తక్కువని తెలుస్తూనే వుంది. ఇరవైయేళ్ళు దాటినా తలిదండ్రులు ఆమెకు వివాహం చేసే స్థితిలో లేరు. తనకంటే మంచి సంబంధం కలలో కూడ తేలేరు. ఇక ఏం చూసుకుని శారద తన్ను నిరాకరించగలదు? శారద గర్వానికి అర్థంలేదు! ఆమె నెమ్మలిరుకు విలువయిచ్చేట్లయితే ఇప్పుడు తను అర్హుడవుతాడు కూడాను. ధైర్యం చేసి అడిగాడు ఒకనాడు.

'శారదా, నువ్వు వివాహం చేసుకోవా?'

'ఇదికూడా ఎకనామిక్సేనేమిటి?'

'ఎందుకు కాదు, వినుంటే నువ్వు ఎకనామిక్సుతో బాధపడలేవు; పెళ్ళి చేసుకుంటే ఆబాధ తప్పిపోతుంది. మూడేళ్ళ క్రితం అడిగినట్టే అడుగుతున్నాను. నన్ను పెళ్ళి చేసుకో శారదా!

'ఎకనామిక్సుతో బాధతప్పడానికి ఎకనామిక్సు లెక్చరరుతో బాధ కొనితెచ్చుకోవ

డమే మార్గం కాబోలు. చాలు బాబూ!' అని నవ్వింది శారద. ఆ నేలిగ్గా నవ్వేసే ధోరణి ఏమిటో శివరాంకు కొంచెం కూడా అంతుపట్టలేదు. తన ఉద్రేకం ఎక్కువైన కొద్దీ ఆమె పెంకితనం పెరుగుతోంది. అది పెంకితనమేనా? లేక...

'అర్థంలేకుండా నవ్వడంమాత్రం వచ్చు, ఇంకేవిషయానికీ బుర్రపనిచేయక పోయినా! నన్ను పెళ్ళి చేసుకోకపోతే నీకసలు పెళ్ళి కాదు, అన్నాడు కోపంగా.

'పెండ్లికాకపోతే మానె, అనవసరంగా నా గురించి మీ బుఱ్ఱ పాడుచేసుకోవటం దేనికి' అన్నది నిర్లక్ష్యంగా.

శివరాంకు కోపం ముంచుకొచ్చింది. 'శారదా, లెక్చరరు నన్న విషయం మరచి పోతున్నావా? కనీసం ఆ స్థానానికైనా గౌరవం యివ్వాలి' అన్నాడు.

'నేను స్టూడెంటు నని యిప్పటికైనా జ్ఞాపకం వచ్చింది. నయం' అంది శారద.

* * *



చిత్రం: డి. వెంకటరావు, నెల్లూరు.

తర్వాత చాలా రోజులు శారద శివరాం దగ్గరకురాలేదు. సంవత్సరాంతపు పరీక్షల్లో శారదకు ఎకనామిక్సులో పాసు మార్కులు రాలేదు గనుక మరీ అధ్వాన్నంగా తక్కువ కూడా రాలేదు. కోపంతో బాగా తగ్గించి వేయాలో మంచి చేసుకోడానికి కొంచెం పెంచివేయాలో తేల్చుకోలేక చాలాసేపు తికమకపడి ఇరవై వేసి, దాన్ని ముప్ఫై చేసి, మళ్ళీ ఇరవై ఏడుక్రింద మార్చాడు శివరాం.

బి. ఎ. సీనియరులో ప్రవేశించిన తర్వాత కూడా శారద శివరాం దగ్గరకురాలేదు. రాను రాను శివరాంలో నిస్పృహ ప్రవేశించింది. శారదకు తనమీద అనురాగం కల్గించడం అసాధ్యమైన విషయంగా తోచింది. పోనీ శారద ఎవరినైనా ప్రేమిస్తోందా అంటే అలాటి సూచన లెక్కడా కన్పించటంలేదు. ఎంచూసుకొని ఇరవైయేళ్లు నిండిన శారద అంతధీమాగా, గర్వంగా వున్నదికి పోనీ స్వతంత్రవ్యక్తిగా జీవితం సాగించాలని నిర్ణయించుకుం దనుకోడానికి డిగ్రీవస్తుందని నమ్మకంకూడా లేదు. తనను పెళ్ళిచేసుకోక పోతే మానె; శారద భవిష్యత్తు ఏమౌతుంది అన్న ఆదుర్దా వేధించింది శివరాంను. శారదకు తండ్రిలేడు. తల్లిమాత్రంవుంది. ధనవంతులూ కారు. అలాటి శారద ఏమౌతుంది అని జాలి పడ్డాడు. శారద అంగీకారం లేనిది వాళ్ళమ్మకు పెద్దలద్వారా కబురుపెట్టేలాభం లేదు.

ఆ సంవత్సరంలో రెండు పెళ్ళి సంబంధాలువస్తే తిరగ్గొట్టాడు ఎటూ తేల్చుకోలేక. తలిదండ్రులు పెళ్ళిచేసుకోమని తొందర పెడ్తున్నారు. మూడో సంబంధం వచ్చింది. ఇంకోవారం రోజుల్లో పెళ్ళిచూపులకు వెళ్ళిరావాలి. శారను మరచిపోవాలనే పరిస్థితి రావటంతో శివరాంకు దిగులు పట్టుకుంది.

ఎకనామిక్సుపరీక్ష ముందురోజు శారద శివరాం ఇంటికి వచ్చింది. ఇన్నాళ్ళకుశారద రావటం శివరాంకు ఆశ్చర్యాన్ని కల్గించింది. ఆశ కలిగింది. కాని ఆమె పరీక్ష అవసరం కొద్దీ వచ్చిందని తెలుస్తూవుండటంవలన అతనిలో తెలీకుండానే చివురెత్తిన ఆశాభావం కాస్తా రూపంలేకుండా అణగిపోయింది. ఏవో సందేహాలు, పరీక్షకోసం తెలుసుకోవాలనుకున్న విషయాలు తెలుసుకున్నాక శారద ప్రశ్నించింది.

"ఇంతకూ నేను పాసవుతానా, లేదా చెప్పండి".

"నాకెలా తెలుస్తుంది?"

"ఇప్పటి నా ప్రిపరేషన్ బట్టి"

"కావచ్చు బహుశా" అన్నాడు శివరాం నిర్లిప్తంగా.

శారద నవ్వింది. "ఎందుకు నవ్వుతావ్" అన్నాడు శివరాం.

"మీరు ఓడిపోతున్నారని"

ఈమాటతో శివరాం హృదయంలోని ఏవో లోతుల్లో సంచలనం కలిగింది.

"ఎందులో" అన్నాడు శారదనుండి దృష్టి మరల్చుకుని.

'నేను ఎకనామిక్సులో పాసుకానన్నారుగా. ఇప్పుడు కాబోతున్నాను!

'అందులో నాకు గెలుపూ ఓటమీ ఏమీ లేవు. నువ్వు పాసయితే నాకు సంతోషమే.'

"అట్లాగా" అని శారద మౌనంగా కొంతసేపుండి, "నేను పాసయితే, మరి మీరు సహాయంచేసినందుకు ఏం ఇవ్వాలో!" అన్నది.

పెళ్ళి చేసుకొమ్మని మళ్ళీ అడగడానికిది ఆహ్వానంకాబోలు! అడిగితే ఏమంటుందో అని అడగబోయి ఆగిపోయాడు శివరాం.

"ఏమీ ఇవ్వక్కర్లేదు!" అన్నాడు.

"ఇక వెళ్ళొస్తాను" అని లేవబోయి శారద మళ్ళీ అంతలోనే ఇంతసేపు ఇంట్లో కూర్చుంటే కాస్త కాఫీ అయి ఇచ్చారుకారు!" అన్నది నిష్ఠూరంగా.

"సారీ, మరచిపోయాను. అమ్మతో చె వస్తాను. అయిదునిమిషాలు కూర్చో!' అ లోపలికి వెళ్లాడు.

అతను లోపల్నుండి తిరిగి వచ్చేసరి శారద పమిటచెరగుతో కళ్ళు తుడు కుంటోంది. శివరాం రాగానే 'అబ్బ క కంట్లోనలకపడింది. ప్రాణంతీస్తోంది'అన్న

"ఊరికే కన్ను నలపకు" అని సందే స్తూనే "పోనీ నేను ఊదనా?" అన్నాడ

'ఊ...తప్పేట్లులేదు."

శివరాం, శారద కుడికంటి పైరెప్పను పట్టుకొని గట్టిగా వూదాడు.

'పోయిందా?' అన్నాడు.

కళ్ళార్పుతూ చిలిపిగా అతని కళ్ళల్లో చూస్తూ 'ఉహు' అంది శారద చిరునవ్వుతో

'అయితే ఇంకోసారి వూదుతానుంక అంటూ శివరాం చప్పున శారద ముఖంపట్టుకుని ముద్దు పెట్టుకున్నాడు.

శారద దూరంగా జరిగి కూర్చుంది.

శివరాం దగ్గరకువెళ్ళి చెయ్యిపట్టుకు "నలకపోయిందా" అన్నాడు నవ్వుతూ.

"ఊ" అన్నది శారద.

'పెళ్ళిచేసుకుందాంశారదా!' అన్నాడు శారద నవ్వింది.

శివరాం లోనికివెళ్లి కాఫీ తెచ్చాడు.

కాఫీ త్రాగుతూ 'అబ్బ చివరకు గ చాను: అన్నాడు తృప్తిగా.

"పాపం!" అంది చిరునవ్వుతో శార కాఫీ కప్పు చుంబిస్తూ.

# కరణం కొలువుపోయినా....

కే.ఆర్. మోంచర్ల

...తికే, నిజాయితీకి పెట్టింది పేరు, కరణం రాజశేఖరం. కాలం మారినా ఆ కరణీకాన్ని పట్టుకు వ్రేలాడుతూ, రాజశేఖరం జీవితంలో పెద్దపొరపాటు చేశాడు. కరణంగా, వ్యక్తిగా, ఆ గ్రామంలో రాజశేఖరం మంచి పేరూ పలుకుబడీ సంపాదించాడు. భగవంతుడెప్పుడూ మంచివాళ్ళనే పరీక్షిస్తాడన్నట్లుగా, రాజశేఖరం జీవితం రెండు మూడు అనుకోని సంఘటనలవల్ల తారుమారైంది.

జమాబందీ సమయంలో తహసీల్దారు శేషగిరి, సీతానగరంలో ముకాం వేశాడు. తగురీతిగా మర్యాద కావించాడు రాజశేఖరం. వెళ్ళిపోయేముందు, "రాజశేఖరంగారూ, మీ ఊళ్ళో పట్టుకేసి ఓ మంచి పాడిగేదె ఉంటే చూసి పెడ్దురూ. పాలకి చాలా యిబ్బందిగా ఉంది" అన్నాడు శేషగిరి. కట్నకానుకలతో అధికారుల్ని సత్కరించి, వారిని మచ్చిక చేసుకునే అలవాటు లేనందువల్ల, "గేదెలైతే ఉన్నాయి కానీండి. చాలా ఖరీదులో ఉంటాయి మూడు నాలుగు వందలకు తక్కువలో మంచిగేదె రావడం కష్టం. అటుపైన మీ యిష్టం," అన్నాడు రాజశేఖరం. "డబ్బిస్తే మీరు సంపాదించేదేమిటండీ? అయ్యగారే కొనుక్కుంటారు," అని పక్కనున్న జవాను, యజమాని ఉద్దేశ్యాన్ని తెలియచేశాడు. "ఆ పక్షంలో నేనేమీ చెయ్యలేనండి," అని రాజశేఖరం తన అసహాయతని చూపాడు. పైకేమీ మాటాడలేకపోయినా, అహం దెబ్బతిన్న శేషగిరి అనుచితంగా రాజశేఖరంమీద కక్ష పెంచుకున్నాడు.

వర్షాలవల్ల ఆ మరుసటేడు పంటలు దెబ్బతిన్నాయి. రంగయ్య ఆ వూళ్ళోకల్లా పెద్ద భూస్వామి. రంగయ్య పొలాలు మిగతా పొలాలమీద కొంచెం నయం. రూపాయికి పావలావంతు పంటమాత్రం నాశనమైంది. పన్నుల మినహాయింపు విషయమై శిఫార్సు చేస్తూ, రిపోర్టు తయారుచేశాడు రాజశేఖరం. 'రూపాయికి ముప్పావలావంతుపంట మరిగి నాశనమైందని సిఫార్సు చేయమని' కోరాడు రంగయ్య. "ఉన్నదున్నట్లుగానే రిపోర్టు పంపిస్తాను. అబద్ధమాడి నన్ను నేను వంచించుకోలేను," అని సమాధానమిచ్చాడు రాజశేఖరం. రంగయ్య ధనాశ చూపినా లాభం లేకపోయింది. రాజశేఖరం చలించక తన విధి నిర్వర్తించాడు. రంగయ్య మనస్సు కుతకుత ఉడికిపోయింది.

ఏవో రికార్డులు తాలూకాఆఫీసులో దాఖలా చెయ్యవలసిన అవసరంకలిగి ఒరోజు ఉదయం రాజశేఖరం, జట్కాలో రాజమండ్రీ బయలుదేరాడు. మలుపు తిరగ్గానే చింతతోపు దగ్గర, రంగయ్య తాలూకు మనుష్యులు జట్కా నడ్డగించి, రాజశేఖరం తీసుకుపోతున్న రికార్డులు తగలపెట్టేశారు. పోలీసు రిపోర్టుయిచ్చి, అటుపైన, జరిగిన సంగతి తహసీల్దారు శేషగిరికి విన్నవించుకొన్నాడు. రంగయ్యదగ్గర్నించి డబ్బు ముట్టడంవల్లనైతేనేమి, కామందుల కొగురు తిరిగి బ్రతకలేమన్న అభిప్రాయంవల్లనైతేనేమి, జట్కావాలా సాక్ష్యమివ్వలేదు. దాంతో రాజశేఖరం అసహాయుడైపోయాడు. అవకాశంకోసం ఎదురుచూస్తున్న శేషగిరి తను చెయ్యవలసింది చేశాడు. ఫలితం! రాజశేఖరం కరణీకం పోయింది.

రాజశేఖరం చాలా బాధపడ్డాడు. మనోవ్యాధితో మంచమెక్కి, థర్డుఫారం చదువుతున్న పదమూడేళ్ళ కొడుకు చంద్రాన్నీ, భార్యనీ విడిచి, ఓ సాయంకాలం సూర్యుడితోబాటు తనూ అస్తమించాడు. మర్నాడు ఉదయించిన సూర్యుని అరుణకిరణాల్లో రాజశేఖరం చితిమీద మంటలు కలిసిపోయాయి.

* * *

ఏలూరులో ఓ ప్రెస్సులో ప్రూఫురీడరుగా పనిచేస్తున్న చంద్రం మేనమామ కామేశ్వర్రావు, అక్కనీ, చంద్రాన్నీ తీసుకుపోయాడు. తల్లికడుపు చల్లదనంవల్లనైతేనేమి, తండ్రిపెంచిన విధానంవల్లనైతేనేమి, చంద్రం బుద్ధిమంతుడయ్యాడు. సంస్కృతాంధ్ర భాషలలో మంచి జ్ఞానాన్ని సంపాదించాడు. అయితే మేనమామకూడా పేదవాడవడంవల్ల, చంద్రం కూడా పనిచెయ్యవలసి వచ్చింది. అవీ యివీ చిల్లరపనులుచేస్తూ, ఏవీ సరిపడక చివరకు ఓ న్యూస్ పేపరు ఏజంటు వద్ద పేపరు బాయ్‌గా చేరాడు. ఉదయం ఏడున్నరకి మెయిలురాగానే పేపర్లబంగీ తీసికొని, పేపర్లివ్వవలసినవారి కిచ్చేసేవాడు. తీరిక సమయాల్లో చదువుతూ పరీక్షలు కడుతూ వచ్చాడు. మూడేళ్ళలో మెట్రిక్యులేషన్ ప్యాసయ్యాడు.

డిప్యూటీకలెక్టరుగా ప్రొమోషన్ వచ్చి శేషగిరి ఏలూరు బదిలీ అయ్యాడు. మెట్రిక్యులేషన్ ప్యాసయినా ఓ నెలరోజుల వరకూ, చంద్రం పేపరుబాయ్‌గానే ఉన్నాడు. ఓ రోజున ఏజంటు ఏదో పని చెప్పడంవల్ల, త్వరగా పేపర్లివ్వడం ముగించాలన్న ఉద్దేశ్యంతో మేనమామ పాత సైకిలుమీదే బయలుదేరాడు. శేషగిరి బంగాళా ఆవరణలోపలిదాకా సైకిలుమీద పోయి, సైకిలు దిగకుండానే పేపరందించాడు. విలాసంగా కుర్చీలో కూర్చుని కాఫీ త్రాగుతున్న శేషగిరి కస్సుమంటూ లేచాడు. "ఏం? కళ్ళు నెత్తికెక్కాయా? పెద్ద కలక్టరులా వచ్చావు. సైకిలుదిగి పేపరివ్వలేవూ?" అన్న శేషగిరి మాటలకి, చంద్రం చాలా నొచ్చుకొన్నాడు. వచ్చే కన్నీరాపుకుంటూ, "కరణీకానికే నోచుకోని నా బ్రతుక్కి కలక్టరుగిరీకూడానాండీ!" అంటూ బాధగా బయటకువచ్చేశాడు. ఆ క్షణంలో శేషగిరి ఏమని భావించాడో చెప్పడం కష్టం.

మేనమామ పనిచేస్తున్న ప్రెస్సులోనే గుమాస్తాగా చేరాడు. కార్యదీక్ష, దానికి తగ్గఓర్పుకల చంద్రం, రెండేళ్ళలో ఉభయభాషా ప్రవీణ అయ్యాడు. కొవ్వూరు హైస్కూలులో తెలుగుటీచరుగా చేరాడు పద్దెనిమిదో ఏటనే. తమజీవితం ఓ దరిని చేరిందికదా అని తల్లి ఎంతగానో సంతోషించింది. "అక్కయ్యా! ఏనాటికైనా నీ కొడుకు కలక్టరయి తీరుతాడే" అనేవాడు కామేశ్వర్రావు.

ఆనాడు శేషగిరి అన్నమాటలు చంద్రాన్ని మనస్సులో ఓమూల పీక్కుతిన



"ఏం కళ్ళు నెత్తికెక్కాయా? పెద్ద కలెక్టరులా వచ్చావు. సైకిలు దిగి పేపరివ్వలేవూ" అన్నాడు శేషగిరి.

సాగాయి. ఇటు మేనమామదగ్గర ఉన్నంత కాలం పై మాటలు వింటూ వచ్చాడు. దాంతో చంద్రం ఒకే ఒక్క ఆశయం పెట్టుకొన్నాడు, ఏ నాటికైనా తను కలక్టరయితీరాలి. లక్ష్మి సిరికోసం శ్రమపడుతూ ప్రయివేటుగానే బియ్యే ప్యాసయ్యాడు. అంతటితో ఆగక ఇరవై నాలుగోఏట ఎమ్. ఏ. డిగ్రీని సాధించాడు. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు లెక్చరరుగా ఉద్యోగం దొరికింది. తర్వాత చంద్రం జీవితం, కాకతాళీయమైన సంఘటనలతో [illegible]గా దొర్లిపోయింది.

ఉద్యోగంలో చేరడంకోసం మద్రాసు బయలుదేరాడు మెయిలులో చంద్రం. ఏలూరుస్టేషనులో చంద్రం కాఫీకోసం దిగాడు పక్కనున్నాయనతో. ఒక పద్దెనిమిదేళ్ళ అమ్మాయి చంద్రం కంపార్ట్మెంటులోనే ఎక్కింది. కాఫీతాగి తిరిగి వచ్చేసరికి, వాళ్ళిద్దరి స్థానాల్నీ కూడా ఆక్రమించి బెడ్డింగు పరుచుకొని, ఒక పుస్తకం చదువుతూ కూర్చుంది ఆ అమ్మాయి. "మేడం క్షమించండి. కొంచెం బెడ్డింగుని చుట్టి కూర్చుంటారా. మీరు మా స్థలాల్నీ కూడా ఆక్రమించారు" అన్నాడు సహజంగా చంద్రం. "నేను మద్రాసువరకూ పోవాలండి. బెడ్డింగును నేను తియ్యను. చాలా అవస్థపడవలసి వస్తుంది" అని కసిరింది. "మారండి, మీపేరు?" సౌమ్యంగా అడిగాడు చంద్రం. "ఏం? లక్ష్మి", కటువుగా వచ్చింది సమాధానం. "లక్ష్మిగారూ, మీరు బెడ్డింగుని చుట్టనన్నడం ఏమీ బాగోలేదు. అంత అవస్థపడలేనివారయితే బెర్తు రిజర్వు చేయించుకోలేకపోయారా? మీరు ఒప్పుకోనిపక్షంలో, మేమిద్దరంకూడా బెడ్డింగుమీదనే కూర్చోవలసి వస్తుంది. రండి ఇలా కూర్చోండి" అన్నాడు చంద్రం బెడ్డింగుమీద కూర్చుంటూ. అరగంటసేపు మొగవాళ్ళ దౌర్జన్యాలమీద ఉపన్యాసమిచ్చి అలిసిపోయి ఊరుకుంది లక్ష్మి. చంద్రం తాపీగా, "లక్ష్మిగారూ, మీరు మగవాళ్ళ పెట్టెలో ఎక్కిందేకాక, తోటిప్రయాణీకులకు స్థలంయివ్వక ఇబ్బందిపెడ్తూ ఇటువంటి ఉపన్యాసాలివ్వడంలో అర్థంలేదు" అన్నాడు. లక్ష్మి ముక్కు తిప్పుకోలేకపోయింది.

తర్వాత ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు లెక్చరర్ గా క్లాసుతీసుకొన్న చంద్రాన్ని చూసి లక్ష్మి స్తబ్ధురాలైపోయింది. "మేష్టారూ! తెలియక ఆనాటి రైలులో పొరపాటుచేశాను. క్షమించండి" అని అడిగింది. సమాధానంగా చంద్రం చిన్న నవ్వు నవ్వి ఊరుకొన్నాడు. అయితే, క్షమాపూరితమైన ఆచిరునవ్వే లక్ష్మి హృదయాన్ని దోచుకొంది. పోట్లాటతో పరిచయమైన వారిద్దరిమధ్య రాగలతలు అల్లుకొన్నాయి.

* * *

ఐ. సి. ఎస్. పరీక్షలకు వెళ్ళి ఫస్టు రాంక్ లో వచ్చిన చంద్రాన్ని విశాఖపట్నం డిస్ట్రిక్టు కలెక్టరుగా వేసింది అప్పటి ఆంధ్రప్రభుత్వం. "లక్ష్మీ! నువ్వు బియ్యే ప్యాసవగానే నిన్ను వివాహం చేసుకుంటాను. ఈఏడు జాగ్రత్తగా చదువు. నేను నిన్ను విడిచివెళ్తున్నానన్న బాధకి తావీయకుండా చదువుమీదే మనస్సు లగ్నంచెయ్యి. ఏడాదయ్యేసరికి మనం ఇద్దరం..." అన్నాడు లక్ష్మితో చంద్రం వెళ్ళేముందు. ఆనంద బాష్పాలతో వీడ్కోలిచ్చింది లక్ష్మి.

అప్పటికి శేషగిరి విశాఖపట్నంట్రాన్సఫరయ్యాడు. తన పైఅధికారిగా వస్తూన చంద్రానికి స్వాగతమిచ్చాడు స్టేషనులో. కాలగర్భంలో చాలా సంవత్



అరగంటసేపు మగవాళ్ళ దౌర్జన్యాలమీద ఉపన్యాసమిచ్చింది లక్ష్మి.

# కాల్గేట్‌తో దంతక్షయం కాకుండా కాపాడుకోండి
# రోజంతా నోటినించి దుర్వాసన రాకుండాకూడా చేసుకోండి



ఎందు చేతనవగా: ఒకసారి తోముకుంటేనే
కాల్గేట్ డెంటల్ క్రీమ్ నూటికి 85 వంతుల వరకు దంతషయము లేకుండా చేసి, దుర్వాసన పోగొడుతుంది.

భోజనం చెయ్యగానే కాల్గేటును ఉపయోగించి బ్రష్‌తో పళ్ళు తోముకొన్నట్లయితే అనేకమందికి దంతక్షయం కావడం ఆగిపోతుందనీ, దంత వ్యాధుల చరిత్రలో ఇది అపూర్వ విషయమనీ, శాస్త్రీయ పరిశోధన వల్ల ఋజువైంది. అంతేకాదు. నోటినుంచి దుర్వాసన వచ్చేవారు దీనిని వాడినట్లయితే 10 మందిలో 7 మందికైనా వెంటనే గుణమిస్తుందనికూడా ఋజువైంది. ఒక్క కాల్గేట్ విషయంలోనే ఇవి ఋజువైనవి.

కాల్గేట్‌నుంచి నురనురమంటూ వచ్చేనురగ పళ్ళ సందుల్లోకి లోపలికంటా చొచ్చుకుపోయి, అక్కడ కుళ్ళి పోయి ఉండే ఆహార పదార్థాల పలుకులను బయటికి గిలా వేస్తుంది. పళ్ళు చాలా చెడిపోడానికి, దుర్వాసన రావడానికి కారణం ఆ పలుకులే.

కాల్గేట్‌తో పళ్ళు తోముకోవడమంటే పిల్లలకు చాలా సరదా. ఎందుకంటే దానినుంచి వచ్చే చాలా సేపు ఉండే పిప్పరమెంటు వాసనంటే వారు చెవి కోసుకుంటారు.




మీకు పళ్ళపొడి అలవాటైతే,
కాల్గేట్ పళ్ళపొడివల్లకూడా
ఇన్ని లాభాలూ ఉన్నాయి
......ఒక డబ్బా కొన్ని
నెలలు వస్తుంది।

కాల్గేట్‌తో నిత్యమూ పళ్ళు తోముకొంటే.

- ✓ దంతషయం కాదు
- ✓ దుర్వాసన ఉండదు
- ✓ దంతాలు మల్లె పువ్వుల్లాగ ఉంటాయి




తెల్లని పళ్ళకోసం, నోటి శుభ్రత కోసం....ప్రపంచంలో మరే టూత్ పేస్టుకంటె కాల్గేట్‌నే హెచ్చుమంది కొంటారు.

OCB. 3OT 1

# కరణం కాకపోయినా

రాలు గ్రగున తిరిగిపోవడంవల్ల, ఆనాటి న్యూస్ పేపరుబాయ్ నేడు తన పైఅధికారిగ వచ్చాడని శేషగిరి గుర్తుపట్టలేకపోయాడు. చంద్రంకూడా అదేస్థితికి లోనయ్యాడు. మంచి పాలనాదక్షతగల చంద్రం. అచిర కాలంలోనే మంచిపేరు సంపాదించాడు.

ఒంట్లో అస్వస్థతవల్ల శేషగిరి సెలవు పెట్టాడు ఓసారి. శేషగిరిని చూడ్డంకోసం ఒకరోజున చంద్రం కారులో బయలుదేరాడు. గుమ్మంలో లక్ష్మి ఎదురైంది! "నాన్నగారికి ఒంట్లో బాగోలేదని తెలిసి, నేనూ ఓ పది రోజులు సెలవుపెట్టి వచ్చానండి. రండి లోపలికి" అని ఆహ్వానించింది. లక్ష్మి శేషగిరి కూతురని అప్పటికి తెలిసింది చంద్రానికి.

మాటలసందర్భంలో కూతురి మనస్సు తెలుసుకొన్న శేషగిరి ఆనందపరవశుడయ్యాడు. చంద్రం తనకి అల్లుడవుతున్నాడంటే ముగ్ధుడైపోయాడు. వెనువెంటనే చంద్రం ఫలానా రాజశేఖరం కొడుకని తెలియడంతో దిమ్మెరపోయాడు. రాజశేఖరం ఎడల తను చాలా నీచంగా ప్రవర్తించాడు. తను చేసినపనికి అప్పట్నించి బాధపడూనే ఉన్నాడు కొంచెంగా. ఆయాసంతోటే మంచంమీద కూర్చుని, "చంద్రం! పైఅధికారిగా కాదుకాని, పిన్నవానిగానే నిన్ను భావిస్తూ, నీ చేతులు పట్టుకొంటున్నాను. నీ తండ్రికి నేను తీరని అపచారం చేశాను. నన్ను క్షమించు" అన్నాడు ఉండబట్టలేక. శేషగిరి ధోరణి లక్ష్మికీ, చంద్రానికీ అర్థం కాలేదు.

మౌనంగానే యింటికి వచ్చి తల్లితో జరిగిన సంగతి చెప్పాడు. ఫలానా శేషగిరి రావని తెలియడంతో, తల్లి జరిగిన సంగతి చెప్పాలనుకొని, "చంద్రం, ఆనాడు మీ నాన్నగారి కరిణీకం ఈయన ధర్మమా అంటూ..." అని అటుపైన మాట్లాడలేకపోయింది. చంద్రం విషయం అర్థం చేసుకొన్నాడు. అదే క్షణంలో, తను పేపరుబాయ్‌గా పనిచేస్తున్నప్పుడు తన్ను నిరసించిన డిప్యూటీ కలక్టరు శేషగిరేనని స్ఫురించింది. ఒక్కసారిగా ఒళ్ళంతా ప్రతీకార జ్వాలలతో భగభగ మండిపోయింది. ఆవేశంతో, "అమ్మా! శేషగిరిని నలుగురిలో నవ్వులపాలు చేస్తానమ్మా. లక్ష్మిని వివాహం చేసుకోను. అన్ని విధాలా శేషగిరిపై నా అధికారం చూపించి, యమయాతన పెట్టి, నా తండ్రి ఆత్మకి శాంతిని చేకూరుస్తాను" అంటూ వణికిపోయాడు. తను చేసిన పొరపాటు తెలుసుకొంది తల్లి. శాంతంగానే, "చంద్రం, నన్నడిగితే నువ్వు చేసే పనిలో అర్థం లేదంటాను. నువ్వావేశంగా ప్రవర్తిస్తే, క్షమాహృదయులైన మీ నాన్నగారికి ఆత్మశాంతి లభించదేమో! చంద్రం, బండె గాడిదప్పరుండా ఉంటే నువ్వు ఓ కరణం అయి ఉండేవాడివి. కాని అదృష్టవశాత్తూ నువ్విప్పుడు కలక్టరు వయ్యావు. నువ్వు కలక్టరువయినా, కరణానివైనా నా కొడుకువే. తల్లిగా నిన్ను ఒక్క కోరిక కోరుతున్నా. లక్ష్మికి ద్రోహంచేసి, ఓ స్త్రీ హృదయాన్ని బాధపెటనని మాటివ్వు" అంటూ చెయ్యిచాచింది. తల్లి హృదయాన్ని తెలుసుకొన్న చంద్రం సిగ్గుతో కుంచించుకుపోయాడు. "అలాగే నమ్మా. నీమాట జవదాటను" అంటూ తల్లి చేతులు పట్టుకొన్నాడు. చంద్రాన్ని హృదయానికి హత్తుకుంటూ, ఆనందబాష్పాలు రాల్చింది కన్నతల్లి.





కాల్గేట్
బేబి పౌడరు

పిల్లల
చర్మమును
చాల సుఖముగా
నుంచును!

అనేక వేల మంది గృహిణులచే కొనియాడ బడిన అత్యుత్తమమైన శమనపరచే సువాసనగల పౌడరు!

CBP/41

మీకు
నమ్మకమైన
నీలగిరి తైలం
కావాలంటే

కేమిల్
బ్రాండ్
వాడండి



అది కల్తీలేనిది..

L. R. SWAI

# అన్వేషణ

## పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

'పొరపాటున ఏ హోటలు వాడికో చ్చేసి చిల్లర తీసుకోకుండ వచ్చెయ్య ంగద!' ఆచారి తెలివిగా పూర్వ సంగ ంజ్ఞప్తికి తేబోయాడు.

'పది రూపాయలనోటు ఊరికే ఎందుకు కుంది? ... ఎవరికో యిచ్చేసి మరిచి ు వుంటావు!' హుస్సేన్ ఆలీ, కవుల ంజ పరధ్యానం జ్ఞప్తికి తెచ్చాడు.

'పర్సులో రూపాయల కాగితా ్నాయికదూ... యింకా పదిరూపాయిల ు ఏమిటోయ్!' పరమహంస అసలు ంస్యం కనుక్కున్నట్లు చిదానందంగా ్వాడు.

'ఇదికూడా నటనా?' నటకులంతా ్గన నవ్వారు. 'పదిరూపాయిల నోటు ు ఆయన బాధపడుతూంటే, మీ ళాకోళం ఏమిటి... ఆ మిగిలిన నోట్లు ంవ్వండి. ట్రంకులోపెట్టి తాళంవేసి స్తాను ... మళ్ళీ వెళ్ళేటప్పుడు తీసు ండి!' బలవంతంగా పర్సు తీసుకుని ంకులో బిగించింది రాణి.

నాటకం మొదలయింది. సిద్ధంగా వుండా పరమహంస హెచ్చరించాడు.

రంగస్థలం చుట్టూ మూగారు నటకులు, ి, శివరాం. కొందరు నటకులు పరమ ంస దయాప్రసాదం పొందాలని తెర ంకనుంచి పాత్రల సంభాషణ అందిస్తా ి సిద్ధమయ్యారు.

తెర లేచింది.

పిచ్చివాడుగా ప్రవేశించాడు పరమ ంస. మరో నిమిషంలో రూపం మార్చు ి విశంతువయ్యాడు. మరోకక్షణంలో ంకీయవేత్తలా మారాడు. ఇంకోకసారి పంతులులా ప్రత్యక్షమయ్యాడు. ప్రేక్షకు ను హాస్యంతో కడుపుబ్బ నవ్వించాడు. 'భరణం' నాటకం పరమహంస రచన, ్లకత్వంతో నటింపబడి ప్రేక్షకుల మన్న ంనందింది. శివరాం దొంగగా రంగస్థలం మీదకు వచ్చి చేసిన అట్టహాసాలకు రాణికి నిజంగా భయంపుట్టింది. పరమహంస ఆనం దంతో పులికొడు. నాటకాంతంలో తనకు నాటకరంగంలో భార్యగా నటించిన రాణి, భార్యకన్న ఎక్కువ సహాయంచేస్తున్న నాగరిక యువతి అని పొగిడాడు. శివరాం గురించి తాను విన్న సంగతులు, సాంస్కృతిక కార్యక్రమాలలో అతనికున్న అభిరుచి ద్విగుణీకృతంగా పొగిడాడు.

నాటకం పూర్తయేక రాణి స్వయంగా వచ్చి దాచిన రూపాయికాగితాలు తిరిగి శివరాంకు యిచ్చేసింది. మౌనంగా, మంద స్మితంగా అందరికీ నమస్కరించి, తనకోసం హాలులో నిరీక్షిస్తున్న మరియమ్మను చేరింది. ఇద్దరూ హాస్టలు హాలుగుమ్మం దిగారు. కారు లున్న పెద్దలు రాణివద్దకువచ్చి యింటిదగ్గర దిగపెడతామని వినయంగా నిలబడ్డారు. విన యంగానే వారి ఆహ్వానం తృణీకరించింది రాణి. మరియమ్మకు ఒళ్ళు మండింది. కారులో యింటిదగ్గర దిగితే పొరుగింటివారి ముందు ఎంత గౌరవమో రాణి గుర్తించుకో లేకపోతోందని చికాకుపడింది. ఆమెమీద ఆధారపడిన తనకు స్వతంత్ర భావాలు

> మేష్టారు : '1891 లో పుట్టిన మనిషికి ఇప్పుడు వయస్సెంత ఉంటుందిరా'
>
> గోపి : 'ఆడమనిషా - మగ మనిషా సార్'?
>
> మేష్టారు : 'ఏమనిషైతేనేం'
>
> గోపి : 'ఆడవాళ్లు వయస్సు విషయంలో అమితంగా అబద్ధా లాడతారండీ!

అమలు జరిపించేయోగం లేకపోయిందని లోలోపలనే బాధపడింది మౌనంగా.

రాణి రిక్షాయెక్కి మరియమ్మతో వెళ్ళి పోయింది. నటకులంతా తక్షణం పరమ హంసకు నమస్కరించి గ్రీన్ రూమ్ కాళీ చేసి వెళ్ళిపోయారు. ఒంటరిగా పరమహంస తన సామానులు రిక్షాలోకి ఎక్కించుకుని హోటలుకు పయనమై పోయాడు.

పదిరూపాయిల నోటు పోయినపుడు నటకు లంతా సానుభూతి చూపడం మాని సహజ హాస్యధోరణిలో ప్రసంగించినపుడు రాణి చూపిన ప్రవర్తన శివరాం హృదయంలో హత్తుకుపోయింది. రాణి మాటల్లో తియ్య దనం, నవ్వులో చిలిపితనం, కళ్ళల్లో మిణుకు కాంతి, నడకలో హుందాతనం చనువు, నడతలోని చలాకీతనం, సరిగా శారదరూపం కళ్ళముందు కడుతోంది. ఆమెలాంటి స్త్రీలను అప్పుడే ఇద్దరిని చూశాడు శివరాం. అయినా రాణితో ఏర్పడినంత చనువు ఇతర స్త్రీలతో యిప్పటివరకు ఏర్పడలేదు. లేచి పోయిన శారద జీవితంలో లభ్యంకావడం అసంభవం కనుక, శారద రూపం చాలవరకు పుణికిపుచ్చుకుని, తన పూర్వ మధుర స్మృతులు ప్రతినిమిషం జ్ఞప్తికి తెస్తున్న రాణి సాంగత్యం తప్పకుండా తనకి హాయి కలిగిస్తుందని విశ్వసించాడు. మతాలు వేరైనా, ఏకభావప్రాతిపదికపై ఒకే తెనుగుజాతిగా వ్యవహరిస్తున్న తనకు, రాణికి ఏవిధంగానైనా బాగా సాన్ని హిత్యం ఏర్పడితే ఒక బాంధవ్యం ఏర్పరుచు కోడానికి అభ్యంతరం ఉండకూడ దనిపిం చింది శివరాంకు.

తనభావాలతో ఏకీభవించని సనాతన సాంప్రదాయబద్ధులైన బ్రహ్మయ్యగారు, సుభద్రమ్మ, శివరాందృష్టిలో మెదిలారు. ఏమైనా ఆమె సాంగత్యం వృద్ధిచేసుకుని జీవితంలో కొంత మానసిక శాంతి పొందుతే బాగుంటుందేమో అనుకున్నాడు శివరాం. సాంగత్య సాన్నిహిత్యంలో మనిషి నిజ రూపం తెలుసుకోడానికి ఎక్కువ అవకాశం ఉంటుందని ఆశించాడు శివరాం.

ఒకరోజు ఆఫీసు విడిచి ఇంటికి వెళ్లాలని బస్సుస్టాండుదాకా వచ్చాడు శివరాం. ఎదురుగా రాణి నడిచివస్తోంది. శివరాంను చూసి నమస్కరించింది.

'ఇలా ఎక్కడికి వెడుతున్నారండీ!' నవ్వుతూ సాగదీసుకుంది రాణి.

'ఆఫీసునుంచి ఇంటికి వెళుతున్నా!'

'ఎక్కడ మీ ఆఫీసు?'

'ఆ ఇరానీ హోటలు ప్రక్క భవనంలో!'

'మా ఆఫీసు ఈ ఎదురు వీధిలోనే వుందండి!'

ఏదో ఆశగా సరదాగా నవ్వింది రాణి.

'అయితే మీరు రోజూ కనిపించలేదే మునుపు!'

'తెలియక మీరు గుర్తుపట్టి ఉండక పోవచ్చు. ... ఇకముందు రోజూ కలుసుకో వచ్చుగా!" నవ్వింది రాణి సరదాగా.

జన ఆఫీసు వీథిలోని ప్రక్క సందులోంచి రోజూ యింటికివెళ్ళే రాణి, శివరాం దూరంగా కనిపించగానే, సందు మళ్ళి నడి వీధిలోకి నడిచి ఎదురుగా వచ్చింది. శివరాంతో మాట్లాడి సంతృప్తిపడింది. రోజూ ఈవిధంగానే కలుస్తే బహుశా శివరాం పరిచయం వృద్ధికావచ్చునని కూడా లోలోపల ఆశపడింది.

'మాయింటికి ఒకసారి రండీ!' భయంగా, బెదురుతూ, మెల్లిగా, బలహీనంగా నవ్వుతూ ఊరుకుంది రాణి.

'తప్పకుండా......రేపు సాయంత్రం రమ్మన్నారా?'

'రండి.........!'

"ఆరు గంటలకు సాయంత్రం వస్తా!"

'ఊఁ!' రాణికళ్ళు మెరిశాయి. బుగ్గలు నవ్వుల పొంగుల్లో సొట్టలు పడ్డాయి.

శివరాం బస్సు ఎక్కాడు.

బడినుండి తిరిగి వస్తున్న విద్యార్థినులు కమిలిపోయిన సింగారంతో కాంతిహీనంగా కనిపించారు. సినీమాకు బయలుదేరిన యువకులు సొగసుగా ముస్తాబయ్యారు. వ్యాపారం నిమిత్తం.........గుంటూరునుంచి వచ్చిన చౌదరులు యిద్దరు గట్టిగా దినుసులు ధరలు చెప్పుకుంటున్నారు. ఒక విజయవాడ నివాసి 'ఏం బ్రదర్! అణాపుచ్చుకుని రెండుఫర్లాంగులైనా త్రిప్పలేదే బస్సు మీద మమ్మలిని!' అంటూ కండక్టరుతో సరసాలాడి బస్సు దిగుతున్నాడు. కళ్ళజోడు పెట్టుకున్న నల్లని సన్నని విద్యార్థిని, జాజిమొగ్గల ఆకారంలోని బంగారుహారం కనిపించేలా పమిటి సర్దుకుంటూ, దానిమ్మగింజల దంతాలతో ఏమిటో ముసిముసిగా నవ్వుకుంటోంది శివరాంవైపు చూస్తూ. బస్సులోకి రాగానే చెప్పులు చేతపుచ్చుకున్న ఒక పల్లెటూరి వనిత ప్రక్కస్త్రీపై చెప్పులతో రాస్తూంటే చిరాకుగా మందలించబడింది. ఒక బస్సు స్టాండు దగ్గర ఒక కుర్రాడు తల్లివెంబడి బస్సులో చొరబడి దిగనంటూ మారాము చేస్తూంటే 'నాయనా పైసలు లేవు దిగరా!' అంటూ తల్లి సముదాయించింది. కాలేజీ విద్యార్థినులు తమ కళాశాలలో లెక్చరర్లు పాఠాలు చెప్పే రీతులగురించి హాస్యంగా బిగ్గరగా ముచ్చటించుకుంటున్నారు. 'చంపకం, యం. ఏ.' అని పేరుపెట్టుకున్న లెదర్ బేగ్‌తో కూర్చున్న ఒకనల్లని నాజూకు యువతి ఏదోమహాపాపిని చూస్తూన్న చికాకు ముఖంతో శివరాంవైపు కోపంగా చూస్తోంది. బస్సులోని మనుష్యుల ఆకృతులు సహజమైనవో, మనస్సులోని భావాల సంఘర్ష


రీటా కురుల్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులను రీటా అమోఘముగ నయముచేయును. వేనకు వేలు వారి గుణమును పొందియున్నారు. మీరు కూడ నేటినుండియే రీటా వాడుడు.

రీటా హిందూ దేశమంతటా దొరకును

కేశ సంపదకు

రీటా



# చదివి సుఖపడండి




దాంపత్య జీవితంలో బలహీనులయి, నాశనమయ్యేవారి నుద్ధరించుటకు ప్రముఖ డాక్టర్లు కనుగొన్న కొన్ని అమూల్య రహస్యాలు "జీవిత రహస్యాలు" పుస్తకంలో ఉన్నాయి. ఇంకా అందులో ఒకవంతు ధాతువుకు 80 వంతుల రక్తం నష్టమవుతుంద నేది అబద్ధమని ఎలా నిరూపించారు, బీజాల కదులువల్ల ఫలితాలు, వాటిలో నొప్పులువల్ల, బుడ్డ వరిబీజాలు, సుఖవ్యాధులు రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు, దాంపత్య జీవితాన్ని ఆనందమయం చేసుకోవడానికి కనుగొన్న మార్గాలు, కుటుంబ నియంత్రణమార్గాలు, యింకా మీజీవితంలో వెంటనే తెలుసుకోవలసిన అన్ని సంగతులు, "జీవిత రహస్యాలు" అనే ఈ తెలుగు పుస్తకంలో వున్నాయి. వెల రు. 3-50. పోస్టు ఖర్చు ఉచితం. ఇది క్రిందిచోటే దొరుకును. 'దేశసేవ ప్రచురణలు, అశోకనగరు, ఏలూరు, ఆంధ్రకు వ్రాస్తే వి. పి. పోస్టుద్వారామీకూ పంపబడును.

SWASTIK

మన్నికగల
అశోకా వివేక్
కలములనే
వాడండి.

అశోకా,
పెన్ వర్క్సు
తెనాలి

# ★ అన్వేషణ ★

గల్లో కృత్రిమత్వం పొందినవో తెలుసు కోడం కష్టం అనుకున్నాడు శివరాం.

బస్సుదిగి, చేతిలో టిక్కట్టు ఆలోచనల కదలికల్లో చిన్న చిన్న ముక్కలుగా వేళ్లతో తుంపి, మలయ మందమారుతంలో హాయిగా రేపటి రాణి సమావేశం గురించి ఊహాగానం చేస్తూ యింటికి చేరాడు శివరాం.

మర్నాడు కోటీ దగ్గర బస్సుదిగి, రాణి యింటివైపు నడిచాడు శివరాం. ఆలస్యంగా ఆఫీసు వదలడంవల్ల బస్సుస్టాండు దగ్గర రాణి కనిపించలేదనుకున్నాడు. రెండు పెద్ద ఇనుప స్థంభాలకు భారీఎత్తున ఒక పెద్ద సిగరెట్టు పెట్టెలోంచి సిగరెట్లు పైకి వచ్చి ప్రజలవైపు తొంగిచూస్తున్నాయి. ఆఫీసు విడిచిన ఉద్యోగులు భార్యలను సుస్తాబు చేయించి సుల్తాను బజారులోని కూరల బజారువైపు నడుస్తున్నారు. రకరకాల సినిమాల చిత్రాలు అందాలు పొంగి ప్రసరిస్తున్న యౌవ్వనరేఖల శరీరాలతో ప్రేక్షకుల నాకర్షిస్తున్నాయి. సరిగ్గా ఆరుగంటలకు రాణి యింటిముందు ప్రత్యక్షమవగానే, రాణి వీధిలో శివరాం కోసమే ఎదురుచూస్తున్నట్లు నిలుచుంది.

'మీరు యిల్లు సరిగా గుర్తుపట్టగలగో లేరో అని' ఆగిపోయింది రాణి. తక్కిన మాటలు శివరాం అర్థం చేసుకున్నాడు.

తిన్నగా మేడమీదకు తీసుకెళ్ళింది రాణి. శివరాం అనుసరించాడు.

పాతబడిపోయిన సిమ్మెంటు గచ్చు నేలతో నల్లగావున్న మేడమీది వరండా, వరండాలో రెండు కుర్చీలున్నాయి. క్రింద గాలిపటముపడి ఉంది.

'చంటిపిల్లలా గాలిపటాలు ఎగురవేస్తున్నారా!' శివరాం హాస్యమాడాడు.

'నేను ఎగురవేస్తూంటే బాగానే వుంటుంది... కాని మా అమ్మ నాకంటె చంటి పిల్లలా గంతులేస్తుందండి...ఎవరో గాలిపటం ఎగురవేస్తూంటే అది వాలి మా మేడ మీదకు వచ్చింది... చిలిపి పిల్లలా పుటుక్కున తాను తెంపి గాలిపటం పట్టుకుంది... మీరు గాలిపటం ఎగురవెయ్యండి... నేను దారం పట్టుకుంటాను...' గాలిపటం చేతపట్టించింది రాణి. నవ్వుతూ దారం శివరాం పట్టుకున్నాడు. గాలిపటం వదిలేసింది రాణి గాలిలో.

'ఇప్పుడు మీరే చంటిపిల్ల లయ్యారు కదండీ!' పకపక నవ్వింది రాణి.

గాలిపటాన్ని విడిచి ఇద్దరూ కుర్చీలమీద కూర్చున్నారు. 'మీ యింటిముందు దృశ్యం చాలా బాగుంటుందండి ఎత్తు పల్లాలతో... చిత్రం గీస్తే మధ్య తరగతి సామాన్య కుటుంబీకుల పేటలా చక్కగా రావచ్చు...' శివరాం వీధిలోని సొగసు కళాత్మకదృష్టితో పరిశీలించేడు.

'మీకు చిత్రలేఖనం వచ్చునా?'

నవ్వాడు శివరాం వచ్చు నన్నట్లు.

'ఏమండీ! నా బొమ్మగీసి యివ్వరూ ఒకరోజు?'

'అలాగే!,

మందస్మితాలు లతల్లా అల్లుకుపోయాయి వారిద్దరిమధ్యా నరసవ్వ ఒంగిన నడుంతో టీ తీసుకువచ్చింది మేడమీదకు.

'మా ముసలవ్వ మంచిపాటలు పాడుతుందండీ!' అన్నది రాణి.

ఆమె మాటకు హుషారు కలిగిన నరసవ్వ ఇద్దరికీ 'టీ' అందిచ్చి తక్షణం తాను ఎరిగిన జావళీలు పాడ్డం అందుకుంది

'ఇదుగో చూడు.....క్రిందకు వెళ్ళి మిఠాయి, జిలేబీకూడా తీసుకురా!...... అమ్మనడుగు...!'

నరసవ్వ గబుక్కున పాటమాని క్రిందకు పోయింది. మరియమ్మ మరుక్షణంలో ఒక ప్లేటులో వివిధ రకాల తీపివస్తువులు పెట్టి తీసుకువచ్చింది.

శివరాం మొహమాటపడ్డాడు.

'అంతమనిషి ఉన్నారు... ఆ మాత్రం తీపివస్తువులు తినలేరూ!' రాణి హాస్యం చేసింది.

'అబ్బ! మొన్న మీరు నాటకంలో ఎంత బాగా నటించారండీ!......నాకే భయమేసింది!' మరియమ్మ కళ్లు నిగిడ్చి కోపిల్లుతున్నట్లు అభినయించి వక్రంగా నవ్వింది.

'మా అమ్మ ప్రతిరోజూ అడగడమే... మిమ్మల్ని ఇంటికి ఒకసారి పిలవమని!" రాణి మరియమ్మను సంతోష పెట్టాలని ప్రయత్నించింది. మరియమ్మ ఉబ్బిపోయింది.

'మా అమ్మాయి మిమ్మల్నిగురించి ఎంతో చెప్పిందండే...మీ అంత మంచివారు లేరని...' మరియమ్మ నిండుగా హాయిగా మందస్మితం చేసింది.

నరసవ్వ మేడమీదకు వచ్చింది.

రాణి అడగడంతో మళ్ళీ జావళీ అందుకుంది. నరసవ్వ జావళీల మాధుర్యంలో మైమరచి శివరాం ఫలహారం ముగించాడు.

పంచమి చంద్రుడు ఆకాశంలో ప్రత్యక్షమై వెన్నెల మేడమీదకు ప్రసరించాడు.

శివరాం రాణి జీవితంగురించి తర్కించే ప్రశ్నలు వేశాడు. స్వస్థానం గుంటూరని, బొంబాయిలోనూ, మద్రాసులోనూ తమ బాబయ్యలు ఉద్యోగాలలో ఉన్నారని, తరచువస్తుంటారని, గుంటూరులో ఒక చిన్న

# తరచుగా మూత్రవిసర్జన

తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైనచిహ్నము. శరీరాన్ని గుల్లచేయ మేకాకుండా యీ వ్యాధి తనబంధంలో చిక్కిన వారిని ఆరోగ్యకారోగ్య మృత్యువుకు అవస్నవిధము ప్రథమదశలో శారీరక మానసికశ్రమకు యిచ్చగించకుండుట, నడుములో నొప్పి రావు మాంద్యము కాళ్లల్లో తిమ్మిరి. వరముల బలహీనతతో యీ వ్యాధి బొడచూపును. పైలక్షణములతోకూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నతో అధికదాహం. ఆకలి. ఎంతు నోరు యెండుట, దురదలు కాళ్ళలో గుల్లు కూకంతగడు శరీరమంతా బొల్లు, కీళ్లనొప్పులు. కంటిపొరలు, తియ గడ్డలు రాచపుండ్లు. యిట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు మిన్నో సంభవింపవచ్చును.

"వీనస్ధారామ్" మాత్రలు వారి, అనేక వేలమంది తమబాధల నుండివివారణపొంది మృత్యురాశమునుండి రక్షింపబడిరి. "వీనస్ ధారమ్" ఆప్రియ పద్ధతులమీద, ప్రాచీన యూనానివైద్య విధానప్రకారం అమూల్య ఓషధుల రాకపదార్థముల, ధ్యాతావిక క్షారముల సారముతో తయారైనవి. "అమిత దాహం తగ్గి.... పలుమారు మూత్రవిసర్జనచేయు అవసరము. 2 లేక 3 రోజులలోనే మీకు చాలాభాగము నివారణగును కొద్ది రోజులలోనే మీకు నగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "వీనస్ ధారమ్" కొద్ది వ్యయముతో, సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేకపద్యము లేదు నిరాహారముతో నుండే అవసరంలేదు. రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై రోగుల యిదివరకటికంటే యెక్కువరకాల ఆహారపదార్థములు తినికొనవచ్చును వివరములు గల ఇంగ్లీషు కరపత్రములు అడిగినతో ఉచితముగా పంపబడును

ధర: 50 మాత్రల సీసా రు. 6-75

ప్యాకింగు పోస్టేజి ఉచితము.

లభించు స్థలము,

VenusResearch Laboratory (A.P.W)
P. O. Box No 587, Calcutta

యిల్లు రెండెకరాల భూమి కూడా తనకుందని, ఏదో ఉద్యోగంమీద వచ్చే జీతంతో జాగ్రత్తగా నగరంలో కాలక్షేపం చేస్తున్నామని రాణి సమాధానం యిచ్చింది. శివరాం అన్వేషణ సాగించడానికి ఆధారం ఏమీ కనిపించలేదు.

రాణి పేక తెప్పించింది. ఆటలో నిమగ్నులయారు రాణి, శివరాం. మాటలతో అట్టే కాలం గడపడం అసాధ్యమని ఆటలు ప్రారంభించింది రాణి.

ఆటలమధ్యలో మరియమ్మ రాణిని క్రిందకు రమ్మని పిలిచింది. పేక ముక్కలు ముడిచి రాణి క్రిందకు నడిచింది. అయిదు నిమిషాలు గడిచినా రాణి మేడమీదకు రాలేదు. శివరాం లేచి నిలుచుని పచారు చెయ్యసాగాడు. మేడ చివర నిలుచుని వీధిలోకి చూశాడు. ఎవరో నల్లని వ్యక్తి కంగారుగా రాణి యింటి గుమ్మం మెట్లు దిగిపోతున్నాడు. రాత్రి ఏడున్నరగంటలకు ఒక వ్యక్తి రాణిని పలకరించి తిరిగి కంగారుగా వెళ్లిపోడంలో ఏమైనా జీవితరహస్యాలు దాగివున్నాయేమో అని అనుమానం కలిగింది శివరాంకు. ఆ నల్లని వ్యక్తి రూపంలో ఏవిధంగానూ తనతో తులతూగక పోవడంతో శివరాంకు మరీ అసూయ కలిగింది. రాణిపైన కోపం వచ్చింది. మౌనంగా కుర్చీలో కూర్చున్నాడు, పేకముక్కలు కలుపుతూ చేతుల్లో.

రాణి మేడమీదకు వచ్చింది. వేళ్లాడే జడ కొప్పుగా చుట్టుకొని, మల్లెపూలదండ తురుముకుంది. శివరాంకు ఏదో అనుమానం కలిగింది.

తలవంచుకుని శివరాం ప్రశ్నించాడు, వెళ్ళిపోయిన మనిషెవ్వరని?

"ఆయనా?...మా ఆఫీసులో పనిచేసే పెద్దగుమాస్తా రాఘవరావుగారండీ!... చాలా మంచి మనిషి!" తేలికగా నవ్వేసింది రాణి.

రాణి అంతరంగం అర్థం చేసుకోడం కష్టమనిపించింది శివరాంకు. మౌనంగా కాస్సేపు మర్యాదగా పేక ఆడి, సెలవు తీసుకుంటానంటూ లేచాడు.

ఎగ్జిబిషన్ మైదానాల్లో ఆడుతున్న సర్కసు ఫోకస్ లైటు కాంతివంతంగా చుట్టూ తిరుగుతూ, ఆకాశంలోకి బాణంలా చొచ్చుకుంటోంది. లేచి నిలుచున్న శివరాంను చూసి రాణి నిట్టూర్చింది.

"మళ్ళీ దర్శనం? పేలవంగా నవ్వింది.

ఆమె అమాయికమైన వదనంలోని దైన్యం చూడగానే శివరాం కోపం తగ్గిపోయింది.

'మళ్ళీ ఎప్పుడో వీలైనప్పుడు కలుద్దాం!' శివరాంకు నమస్కరించి వీడ్కోలిస్తూ రాణి అనుసరించింది. క్రింది వీధి గదిలోంచి నడుస్తూంటే, సినీతారలా ఆకర్షణీయంగా ఏటవాలుగావున్న రాణి ఫోటో గోడమీద చూశాడు శివరాం. ఆ ఫోటోలో కనపడే చాంచల్యం గురించి శివరాం హృదయంలో బాధపడ్డాడు. స్త్రీసహజమైన చంచలచిత్తం నాటకాల అనుభవంలో గడించిన నటన, నిత్యము నవ్వుతూ కనిపించే పెదాల వెనకాల అర్థంకాని అంతరంగం నిండుకున్న రాణికి బహుశః తనవంటివాడు దూరంగా ఉంటేనే బాగుంటుందేమో అనుకున్నాడు శివరాం.

హోటల్లో భోంచేసి రాత్రి యింటికి చేరాడు పదిగంటలకు. యథాప్రకారంగా వీధిగేటు తాళం వేయబడివుంది. రోజూ ఆలస్యంగా వస్తే గేటు దాటి లోపలకు పోవడం చాలా అసభ్యమనిపించింది. మరో అద్దెకొంప చూసుకోవాలని నిశ్చయించుకున్నాడు శివరాం. పేరిశాస్త్రిగారు ఈ విషయంలో సహాయం చెయ్యగలరని ఆశించాడు.

మర్నాడు పేరిశాస్త్రిగారింటికి వెళ్ళాడు శివరాం. ఆయన రాజమండ్రి వెళ్ళారని విని ప్రయోజనం లేక తిరిగి వచ్చేశాడు. సాయంత్రం కాలక్షేపంగా గ్రంథాలయానికి వెళ్ళి వార్తాపత్రిక తిరగేశాడు. రాజమండ్రి దగ్గర గోదావరి పొంగుతోందని, విపరీతంగా ఒడుదుడుకులుగా నది ప్రవహిస్తూండడంవల్ల పట్టణానికి ప్రమాదం సంభవిస్తుందేమో అనే అనుమానం కలుగుతోందని, పట్టణ సంరక్షణకు తగిన కట్టుబాట్లు జరుగుతున్నాయని వార్త కనిపించింది. గోదావరితీరం కట్టక్రింద పల్లపువీధిలో నివసిస్తున్న బ్రహ్మయ్యగారిపైన, తల్లిపైన దృష్టి మళ్ళింది. ఒకవేళ గోదావరి వరదలు పొంగుతే!......క్షేమసమాచారం తెలియజెయ్యమని తక్షణం బ్రహ్మయ్యగారికి ఉత్తరం వ్రాశాడు శివరాం.

ఉత్తరం బ్రహ్మయ్యగారికి అందకుండానే గోదావరి ఉప్పొంగింది.

అర్ధరాత్రి పన్నెండు గంటలకు పట్టణమంతా మాటుమణిగి నిశ్శబ్దంలో సుషుప్తిలో ఒరిగినపుడు గోదావరి మెల్లిగా అడ్డుకునే కంకరరాళ్ళను అణగద్రొక్కి నిరోధించే చెట్లను ఊడబీకి, అడ్డంగా బారుకు పరుచుకున్న మట్టికట్టను కెరటాల ప్రవాహంతో చీల్చి దొలిచి, కాపలా కాస్తూ నిలుచున్న పోలీసువాడి ఈలలకు బెదరకుండా, వామనావతారంలా విపరీతంగా యినుమడిస్తూ, ఈదురుగాలి శబ్దాలతో విజృంభిస్తూ, కట్ట మించి పొంగి, పల్లపు నేలమీదకు ప్రాకింది. పట్టణానికి ఉత్తరాన దక్షిణాన బలవంతంగా బెల్లులు పెకలించి కట్ట త్రెంచి గండ్లు వేసుకుని పట్టణంలోకి చొరబడింది గోదావరి. జల ఊరుతున్నట్లు రోడ్లమీద నీరు వ్యాపించింది. అరగంటలో కట్టమీదనుంచి గోదావరి జలపాతంలా మారింది. చీకటిలో కెరటాల పొంగులో ఏదో కోపంతో ఉద్రిక్త

(46-వ పేజీ చూడండి)


రోజంతా శుభ్రముగా
నుండుటకు

ఆకర్షణీయమైన సువాసన, బహు
మెత్తని పొడి-మరే టాయిలెట్ పౌ
డరులోనూ లేనట్టి-చమట దుర్గంధ
మును, చర్మవ్యాధులను గలిగించు
క్రిములను నిర్మూలించే లోకప్రసిద్ధ
యిన జి-11* పేటెంటు గలిగియున్నప్ప
టికి గోద్రెజ్ టాయిలెట్ పౌడరు
ఎక్కువ ఖరీదేమీ లేదు.

ఉక్కపోతనుండి వింకదైన శీఘ్ర
విముక్తి గలిగించి చమటవల్ల
చర్మము రేగుటను పోగొట్టును....ఇది
పసిబిడ్డలకు వరప్రసాదము!

గోద్రెజ్

టాయిలెట్ పౌడరు
దుర్గంధమును పోగొట్టును
సురక్షకమైనది • సువాస
నగలది • శమనకరమైనది

సంపూర్ణ రక్షణకు సింథాల్ తో
స్నానముచేసిన పిదప వాడండి.

(* పేటెంట్ హెగ్జాక్లోరోఫెన్
యు. ఎస్. ఏ.)



గోద్రెజ్ శ్రేష్ఠమైన సబ్బులను
ఇతర టాయిలెట్టులను తయారుచేయును

# మీ యింటి చిన్నతోట



…లు పరిగారు. నేల చల్లబడింది. …ండి బీటలువారిన నేల తడిసి, పుటక మొక్కల పచ్చని వలువ తొడగింది. …ొక్కలయినా ఎక్కువ వచ్చే కాలం, …వికసించి కోయలు పలికించే కాలం …ి.

…ప్రాంగణం వంక ఒకసారి దృష్టిని …చండి. దాన్ని నందనవనం చెయ్య… …చోటు చిన్నదని మీరు చింతించ… ఎంతచోటుంటే అంతలోనే తోటను …చ్చును. ఇంటి ముందు చోటు …గా లేకపోతే వరండాలోనే తొట్లలో … మొక్కలను చేర్చి అలంకరించ… … వరండా వెడల్పు తక్కువని అను…, చూరునుంచి తొట్లను వేలాడదీసి, …నే మొక్కలను పెంచవచ్చును. …లతో ఏ అలంకారం చేసినా అది అవుతుంది.

… యింట్లో చోటు చాలా కొద్దిగా …మాంథి మొక్కలు నాలుగు చెప్పండి …చి చేస్తాను' అంటారు చాలా మంది. …్' మొక్కలంటూ వేరే లేవు. తగు… అమర్చితే ఏ మొక్కయినా బాగానే …ంది. యౌవనం రాగానే ఎటువంటి …కి నా కళ వచ్చి పడ్డట్టే, పూవులు …వగానే ఏలాటి మొక్కయినా శోభి…

…టలో మొక్కల రకాలూ, జాతులూ …ఎక్కువ ఉంటే, ఆతోట అంతగొప్ప …దని కొందరి అభిప్రాయం. …గా శాస్త్ర వృక్షశాస్త్రం చదువు…గారిలో ఈ అభిప్రాయం ప్రబలి…ుంది. కృష్ణరాజసాగరు వద్ద …వనాన్ని చూసి ఒక విద్యార్థి కుతు…విరిచి "అంతా చూస్తే, ఓ పాతిక …యినా ఉన్నట్లులేదు. ఈ తోటకింత …ఎందుకొచ్చిందబ్బా!" అన్నాడు. …కొద్దీ చూసినా తనివితీరని ఆ పూల… అందం ఆయన యెడల వ్యర్థం …ది. తోటలో ఎన్నిజాతులు చేర్చి…కో వేలుమడిచి లెక్క వేస్తున్నా…ు న. అమ్మాయి సంగీతం కంఠం …తను బట్టిగాక నేర్చిన కృతుల …మబట్టి విలువ కట్టినట్లుంది. మొక్కల… తక్కువగా ఉన్నాయని కించపడ…

…కండి. సొగసుకు బాహుళ్యం అక్కరలేదు. ఉన్నంతలో అమరిక బాగుండాలి. ఒంటికి నగ అలంకారమే. కాని అలంకారానికి నగలు దిగవెయ్య నక్కరలేదు. ఉన్న రెండు నగలే సొగసరిగి తగిలిస్తే సొబగు కూరుస్తాయి. అలాగే తోటలో అందాలు చిందాలంటే మొక్కలు ఉక్కిరి బిక్కిరిగా కిక్కిరిసి ఉండనక్కరలేదు.

మన యిండ్లతోటలలో 'లాను' అనబడే పచ్చికమళ్లు లేకపోవడం ఒక లోపమే. పచ్చిక సువిశాలంగా ఉండి, ఏపుగా పెరుగుతూ, కలుపుమొక్కలు లేకుండా ఉంటే పచ్చని పచ్చడం నేలమీద పరిచినట్టుంటుంది. దాన్ని చూస్తూ కూర్చుంటే కంటికి ప్రశాంతంగా ఉంటుంది. మధ్య మధ్యను గాని, దాని అంచులవద్దగాని పూలమళ్లు ఉంటే, అవి ఈ పచ్చడంమీద అద్దిన పూలవలె ఉంటాయి. చిలుకూ దాని అంచుకూ ఏవిధంగా పొందిక అవసరమో, అలాగే లానుకూ, పూలమడికీ పొందిక అవసరం. అవి రెండూ ఒకదాని శోభనొకటి పెంపొందించుకుంటాయి. అదే ఒక చిత్తరువను కొంటే, అందులో పూవులు చిత్రమూ, లాను దానికి బ్యాక్‌గ్రౌండూ అవుతాయి. ఆ రెండూ ఉన్నచోట తోట ఉద్భవించింది. తోట అనే కళాఖండానికి అత్యవసరమయిన వీరెండు.

తోటలో ఆహ్లాదము నిచ్చేవి పూవులు, …టితంగులు. కనుక సర్వ ఋతు పుష…యందున్నూ తోటలో పూవులుండేటట్లు ఏర్పాటు చేసుకోవాలి. పూలమొక్కలలో రెండు రకాలున్నాయి. కొన్ని స్వల్పజీవప్రమాణం గలవి. ఇవి కొద్దికాలం పెరిగి, పూసి, నాలుగురోజులు జీవితాన్ని మూడు పూవులూ ఆరుకాయలుగా గడిపి జీవితాన్ని చాలిస్తాయి. ఇవి వార్షికజాతులు. జంతి, మ[illegible]ంట, సూర్యకాంత మొదలయినవి. రె[illegible]కపు మొక్కలు చాలా ఏళ్లు జీవించి ఏటా ఒక ఋతువులోగాని ఏటి పొడుగునాగాని పూస్తాయి. ఇవి బహువార్షికజాతులు. మందార, గన్నేరు మొదలయినవి ఇటువంటివే. వార్షికజాతుల పూలకు గల శోభ సాధారణంగా బహువార్షిక జాతుల కుండదు. వార్షికజాతులను ఒకమడిలో వేస్తే మడిలోని మొక్కలన్నీ ఒక్కఎత్తుకు పెరిగి పూస్తే, అచ్చంగా పూలపాన్పులాగ ఉంటుంది. దీనిని పూమడి అంటారు. అందంలో దీనికి సరి రాగలభాగం తోటలో మరొకటి లేదేమో. బహువార్షికముల పూలు ఆకుల మధ్య అక్కడఅక్కడా చెదరి ఉండటం వల్ల ఇంతసొగసు నివ్వలేవు. కాని పూమడి అందం ఎంత ఎక్కువో అంత తాత్కాలికం. నెలో రెండునెలలో అయేటప్పటికి మొక్కలు పూతమానేసి ఎండిపోతాయి. వాటిని పీకి, మడిని తవ్వి ఎరువువేసి తిరిగి మరొకజాతి మొక్కలనువేస్తే, మళ్ళీ అవి పూసేవరకూ ఆ ప్రదేశం నగతీసివేసిన మెడవలె బోసిగా కనిపిస్తుంది. కనుకనే పచ్చిక…





మడికి వెనుక కేవలం వార్షిక పూలమడులనే కాక, కొన్ని బహువార్షిక జాతులను కూడా వేస్తే, పూలమడిని తీసివేసినపుడు, వీటి పువ్వులు కొంతవరకు ఆలోటును పూరిస్తాయి.

పూలమడిలో ఒకజాతి మొక్కలు ఎండిపోగానే దానినితీసి మరొకటి నాటి ఏటిపొడుగునా ఏదోఒక మొక్కలు ఉండాలి గనుక, మూడు కాలాలలోనూ ఎదిగే మొక్కలేవో మనకు తెలిసిఉండాలి. ఏకాలంలో వెయ్యాల్సినదాన్ని ఆకాలంలో వెయ్యకపోతే అవి చాల బలహీనంగా పెరిగి, అసలు పూయకపోవడంగాని, మరీ రోట్టబలిసి పూత తగ్గిపోవటంగాని జరుగుతుంది. ఈకాలంలో నాటే మొక్కలను వానకాలపు జాతులనీ, దీపావళిప్రాంతంలో నాటేవాటిని చలికాలపువని, శివరాత్రి చాయలనాటే వాటిని వేసవికాలపువనీ అనవచ్చును. ఈకాలంలో పూలమళ్లలో వేసుకొందుకు పనికివచ్చే మొక్కలలో కొన్ని ముఖ్యమయిన వాటిని గూర్చి మాత్రం క్లుప్తంగా ఇక్కడ ముచ్చటించబడింది. వీలయినంతవరకూ మొక్కల ఇంగ్లీషు పేర్లను గుర్తుంచుకొంటే, కంపెనీలకు రాసి విత్తనాలు తెప్పించుకోడానికి సులువుగా ఉంటుంది.

## కాలియాప్సిస్:—

ఏటిపొడుగునా పెంచదగిన పూలమొక్క. చాలా తోటలలో కానవస్తుంది. రెండు మూడడుగులవరకు పెరిగి పూలకాడలు సన్నగా పొడుగ్గా ఊగుతూ ఉంటాయి. చెట్టునిండా విరబూస్తాయి. చాలారంగుల రకాలున్నాయి గాని సాధారణంగా బంగారుచాయ రేకలున్నా, బొడ్డు చుట్టూ పొడుం రంగున్న ఉండేరకము చాలా అందంగా ఉంటుంది. నాలుగు అడుగున్నర ఎత్తు పెరిగే మొక్క చొప్పున నాటవచ్చును. పూలుకోసి కుండీలలో పెట్టుకోవచ్చును.

## కాస్మాస్:—

ఇది కూడా చాలా సామాన్యమైనదే. పువ్వు ఇంచుమించుగా కాలియాప్సిస్‌లాగే ఉంటుంది. బొడ్డువద్ద వేరేరంగుమాత్రం ఉండదు. మూడు నాలుగడుగుల పొడుగు ఎదుగుతుంది. రెండడుగుల దూరంలో నాటినా మడిని పూర్తిగా కమ్ముకుంటుంది. దీనిలో ఊదా, గులాబీ, ఎరుపు, పసుపు రంగుల రకాలు సాధారణంగాను, అరుదుగా తెలుపు విన్నీ ఉంటాయి.

## జినియా:—

(బంగాళా బంతి):-ఇది ఆంధ్రులకు సుపరిచితమయిన పువ్వు. దీనిలో రేకలు దొంతరలుగా ఉంటాయి. మొక్కలు రెండు మూడడుగులు పెరిగి, ఆకరువారాలలో పూతకు వస్తాయి. ఎండ బాగా తగిలేచోట వీటిని వెయ్యాలి. వీటిలో అన్నిరంగుల రకాలూ ఉన్నాయి.

దీనిలోనే "జినియా లినియారిస్" అనే కొత్తజాతి షుమారు ఇరవైయేళ్ళనుంచి వాడుకలోకి వచ్చింది. దీనికీ బంగాళా బంతికీ పోలికే లేదు. ఇది పది అంగుళాల ఎత్తుమాత్రమే పెరిగే పొట్టిమొక్క. పువ్వులు నారింజ వర్ణంగా ఉంటాయి. బొడ్డువద్ద పొడుంరంగుగా ఉంటుంది. రెక్కమీద లేతరంగు చార ఉంటుంది. పుష్కలంగా పూస్తుంది. చాలాకాలం పూస్తుంది. ఇటీవల వీటిలోనే తెల్లని పూలరకం ఒకటి ఉద్భవించింది. సన్నని బాటల ప్రక్కన అంచుగా వేసుకోడానికి చాలా ఉపయోగం.

## గైలార్డియా:—

(బనాతు బంతి):-అనేక రంగులు కలసిన వీటి పూవులు సొగసుగా ఉంటాయి. పూత ప్రారంభం కావడం ఆలస్యం, కాని మొదలెట్టాక చాలాకాలం పూస్తాయి. పూవులు కూడా త్వరగా వాడిపోవు. ఇందులో ఒంటిరేక పూలు, ముద్దపూవులూ పూసేరకాలున్నాయి.

## డాలియా:—

ఈ కుటుంబపు పూవులలో తలమానిక్యం అని చెప్పదగినదిది. విత్తనాల నుంచిగాని, మంచిరకాలను దుంపలనుండిగాని పెంచుతారు. కోలములలో పెంచితే వరండాల అంచున పెటడానికి ఎంతో బాగుంటుంది. షుమారు ఆరంగుళాల వ్యాసంలో సహస్రదళ పద్మంలాగ దొంతర రేకల పువ్వు పూస్తుంది. అందంలో దానికదే సాటి.

## ఆంటిర్రైనం:—

దీనిని ఇంగ్లీషులో 'స్నాప్ డ్రాగన్' అంటారు. పువ్వులు తెరుచుకొన్నప్పుడు, రాక్షసి నోరు తెరుచుకొన్నట్టుండడంవల్ల దీనికీపేరు వచ్చింది. కాడమీద కిందినుంచి పైదాకా ఇకిలించే పూవులతో బాగుంటుంది మొక్క. పూలకు సువాసన. అనేకరంగుల రకాలుకూడా ఉన్నాయి. ఇటీవల మన తోటలలో విస్తారంగా పాకుతున్నది.

## నీలగోరింట (బాల్సం):—

వీటినే కొందరు మునుగోరింట అనికూడా అంటారు. చాలా కాలంగా మన యిండ్లలో పెంచుతున్నదే. దీనిలో ముద్దపూవులు ఇంకా అందంగా ఉంటాయి. తెలుపు, గులాబి, ఎరుపు, ఊదా, ముదురు ఊదారంగుల రకాలున్నాయి. ఒకటి రెండు కొమ్మలనుమాత్రం పెరగనిచ్చి మిగిలిన వాటిని కత్తి



# ★ మాయింటి చిన్నతోట ★

రిసే, పూలు పెద్దవిగా ఒత్తుగా పూస్తాయి. మొక్కలను జానెడు దూరానికొకటి వెయ్యవచ్చు. వీటికాయలు ముదిరిన తరువాత ముట్టుకుంటే పేలుతాయని పిల్లలకు బాగా తెలుసు.

## పోర్టులకా (గడ్డిగులాబి) :—

ఇటీవల ఎక్కడ చూచినా శీఘ్రవేగంతో అలుముకొని పోతున్నదీరకం. దీనికాడలు నేలమీద పాకుతాయి. నేల తగిలిన చోటల్లా వేళ్ళువేస్తుంది. పెంచడం చాలా సులభం. అతిత్వరలో మడిఅంతా పాకి దట్టంగా ఉంటుంది. మిరిమిట్లు గొలిపే ముగురుగులాబీ రంగుపూలు ఉదయం 9గంటల నుంచి సాయంత్రం రెండు మూడుగంటల వరకూ తెరుచుకొని ఉంటాయి. ఆ కొంసేపు వాటి సొగసు వర్ణనాతీతం.

## లేడీస్‌లేస్ :—

నాజూకుగా కనిపించే రెండు మూడడుగుల మొక్క. ధనియాల పూవులలాంటి పూవులు పెద్దగుత్తులు పూస్తుంది. తెల్లటి ఈ పూవులు లేసులాగ చూడడానికి బాగుంటాయి.

## కోఛియా :—

ఈ చక్కని మొక్కతో మనం ఇతోధికమయిన పరిచయం చేసుకోడం మంచిది. ఇది పూలమొక్క కాదు. కాని బాగా ఎదిగాక చూస్తే ఎవరో కత్తిరించిన వాటిలాగా ఈ మొక్కలు చక్కని దీర్ఘగోళాకారంలో ఉంటాయి. ఒంటె వరసలో వీటిని నాటితే గుమ్మటాలలాగ ముచ్చటగా ఉంటాయి. గోలెములలో కూడా పెంచదగిన మొక్క.

## హాలిహాక్ :—

పైని చెప్పిన మొక్కలన్నీ 3-4 అడుగులకు మించి పెరగనివే. హాలిహాకు మాత్రం పొడుగ్గా అయిదారడుగులు పెరిగి కాండము పొడుగునా కిందనించి పైకి చక్కటి రంగుల పూలతో రాజఠీవిని ఒలికిస్తూ ఉంటుంది. కొంచెం ఆలస్యంగా పూతకువస్తుంది. తెలుపు ఎరుపుల అన్ని చాయలూగల రకాలున్నాయి.

## సూర్యకాంత :—

ఆరడుగులు పైబడి పెరిగే మొక్క. పెద్ద పూవులు పూస్తుంది. దీనినే కొందరు పొద్దు తిరుగుడు పువ్వు అంటారు. సూర్యుడెటు తిరిగితే అటు తిరుగుతుందని ప్రతీతి. కాని అలా తిరగదు. ఈ మొక్కను పెంచడం చాలా తేలిక. పొడుగుగా ఎదుగుతుందిగనుక గాలికి విరగకుండా కర్రలుకట్టితే ఇక నేమీ చెయ్యనక్కరలేదు. దీనిలో ముద్దపూల రకాలున్నాయి. ఎరుపుచాయగా ఉండే రకాలున్నాయి. పొట్టి పూలమొక్కల వెనక వేయడానికీ, గోడమీదనుంచి రోడ్డుమీదకు పూలు కనబడేటట్లు వేయడానికి ఇది బాగా పనికివస్తుంది.

జపాను (లేక చైనా) సూర్యకాంత అనే మైదానియాకూడా ఇంత పొడుగూ ఎదుగుతుందిగాని, పువ్వులు చిన్నవి, ఒంటిరేకవి. మొక్క చాలా కొమ్మలువేసి చిరకాలం పూస్తుంది. కాంపౌండు గోడదగ్గర వేసుకోడానికి బాగుంటుంది.

## మెట్టతామర :—

(క్యానా): మెట్టతామరను గురించి చెప్పనిదే పూలమడికి పనికివచ్చే మొక్కలను గూర్చి చెప్పడం పూర్తికాదు. మెట్టతామరలో ఎన్నో రకాలున్నాయి. రేకలమీద చిత్రవిచిత్రాలయిన చుక్కలుండేవి, చుక్కలు లేకుండా అన్ని సాదారంగులవి కూడా రకాలు ఉన్నాయి. విశాలమయిన పచ్చికబయలుంటే, దానిలో మెట్టతామర శోభించినట్టు మరొక మొక్క ఏదీ శోభించదు. ఇవి ఎంతదూరం నుంచైనా మనిషిని ఆకట్టి నిలబెట్టగలవు. వీటికి ఆహారం చాలా కావాలి గనుక, వేసేటప్పుడు ఎ తుగాతవ్వి ఎరువు బాగా వేసిన తరువాత దుంపలను నాటాలి.

## క్రోటన్స్ :—

పైన చెప్పిన మొక్కలన్నీ పూలమడిలో వేయదగిన ఏకవార్షిక జాతులు. కాని తోటలో ఇతర మొక్కలుకూడా అవసరమే. తోటలో రంగే ప్రధానంగనుక ఆరంగు, పూవులవలన వచ్చినా, ఆకులవలన వచ్చినా, ఒకటే. ఇంగ్లీషువారి పరిచయంవల్ల కేవలం ఆకుల అందంకోసం పెంచేమొక్కలు కొన్ని మన తోటలలోకి ప్రవేశించినయి. అట్లా మొదట ప్రవేశించిన మొక్కలు ఇంగ్లీషులో మామూలుగా 'క్రోటన్సు' అనబడేవి. అందువల్ల ఈ పర్ణజాతులన్నిటినీ కలిపి మనవాళ్లు క్రోటన్సు అంటూఉంటారు. కనుక తెలుగు క్రోటన్సుకూ ఇంగ్లీషు క్రోటన్సుకూ తేడా ఉన్నది. ఈ తికమక లేకుండా చక్కటాకుల మొక్కలన్నిటినీ పర్ణజాతులంటే బాగుంటుంది. ఇవి ఒకమాత్రపు నీడలో పెరుగగలవు. కనుక అంతగాగాని, అసలుగాని, ఎండ తగలని వెరండాలలోను, గదులలోనూ, చెట్లనీడలు పడేచోటనూ వీటిని ఉంచ


మకరధ్వజం మాత్రలు

సేవించినచో మంచిబలం పుష్టి కలుగును.

1 సీసా రూ. 10/-లు వి. పి. రూ. 1-4-0.

అడ్వాన్సు పంపవలెను.

డా॥ రత్నంసన్స్ మెడికల్‌హాల్

ములకపేట బిల్డింగ్స్ - హైద్రాబాద్ - 2.

పెరీరావారి




కుటుంబానికంతా ఉపయోగపడు

దగ్గు నివారిణి

అన్ని షాపులలోనూ దొరకును

వ్యాపార వివరములకు వ్రాయండి

విల్‌ఫ్రెడ్ పెరీరా ప్రైవేట్ లి.

మద్రాసు-7




గరంమసాలా పౌడరు

(Madras Curry Powder)

సిద్ధంగానున్నది.

టొమాటో సూప్

(వేడినీటితో, వేడిపప్పుకట్టుతో కలపండి)

మిరియాలరసము: పౌడరు, పేస్టు,

(వేడినీళ్లతో కలుపండి.)

ఉరగాయలు అనేకరకాలవి,

వడియములుకూడా ఉన్నవి.

ri GANESRAM&CO.,MADRAS-1.

నమ్మకమైనవి ఏజెంట్లుఆంధ్రప్రదేశ్ లో కావలెను




ఆంధ్రప్రదేశ్ ఏజంట్లు:

మెసర్సు సీతారామ్‌జనరల్‌స్టోర్సు ఏజెన్సీస్

విజయవాడ, సికిందరాబాదు.

కన్నను. అటువంటిచోట్ల పుష్పజాతులను వేస్తే అటు పూవులూ పూయవు, ఇటు ఆకులూ బాగుండవు.

పర్ణ జాతులలో మనకు చాలా కాలంనుంచీ పరిచయమయినవి క్రోటన్సు. వీటి ఆకులలో గల వైవిధ్యం అనంతం. ఆ రకాలన్నిటికీ పేర్లున్నాయి. వాటితో పరిచయం బాగా ఉంటేనేగాని ఆ పేర్లన్నీ ఎవరూ జ్ఞాపకం ఉంచుకోలేరు. అందువల్ల మించిపోయేది ఏమీ లేదు. ఇంపైన మొక్క దాని పేరు తెలియని మాత్రాన సొంపుతగ్గిపోదు. గోలేలలో పెంచి మెట్లదగ్గర ఉంచడానికి ఎంతో బాగుంటాయి.

క్రోటన్సు పేరుతో తప్పుగా పిలవబడే మొక్కలలో ముఖ్యమయినవి ఇరాంతిమం, ఆరేలియా, పానెక్సు, ఎకాలిఫా. వీటన్నిటిలోను మళ్ళీ రకాలున్నాయి. ఎర్రని ఆకుల అకాలిఫా ఒకటి వీటన్నిటిలోను సుందరతమైనది. ఎర్రటిఆకుల సౌందర్యం చెప్పుకోవాలంటే పాయిన్ సెట్టియా నే చెప్పుకోవాలి. బెంగుళూరులో తోటలలో జానెడుపొడుగు ఆకులు ఎర్రగా చెట్లనిండా ఉండి చెప్పనలవికాని సొగసునిస్తాయి. కాని ఈ మొక్క మన ప్రాంతంలో పెంచితే రానురాను దాని ఆకులలోని ఎరుపు భాగం చిన్నదైపోతుంది.

ఎర్రని (తోపు) ఆకులుగల చిన్న మొక్కలలో రంగుల పొన్నగంటి (కొన్నిచోట్ల దీనిని లైసుతోటకూర అంటున్నారు), ఐరిసిన్ ముఖ్యమయినవి. చిత్రవర్ణాలుగల ఆకులు కావాలంటే, గోలెములలో పెంచడానికి కోలియస్ బాగుంటుంది. చూరు నుంచి వేలాడదీసే గోలెములలో దిన్ని వేయవచ్చు. దీని ఆకులు చిన్నవిగా ఉంటాయి. పెద్దఆకులు రంగులు రంగులుగా ఉండేవి కావాలంటే కలేడియంను మించినది మరొకటి మీకు దొరకదు. దీని ఆకులు తమలపాకులలాగ 'ఇస్పేటు' ఆకారంలో ఉండి, మధ్య అనేకరంగుల చుక్కలుంటాయి. గంపనాటి పెంచుతారు.

లేతపచ్చని ఆకుమీద తెల్లని మచ్చలుండే ఆకులలత ఒకటున్నది. దాని పేరు పోథాస్. నీడలో చక్కగా పెరుగుతుంది. తొట్లలో పెంచి గదులలోపల పెట్టుకోడానికి ఎంతో బాగుంటుంది.

పువ్వులు పూసే బహువార్షిక జాతులు అనాదిగా మనదేశంలో ఆదరణ పొందినవి. తావిలేని పూవులకూ, పూవులేని లతలకూ నేడుండే ఆదరణ నాడుండేది కాదు. ఈ మొక్కలనుండి పూజకూ, పూల కుంపకూ,


అందమైన పొడుగైన కేశములకు
(పుష్ప మూలికలు)
ఇష్టమైన సువాసనతో కలుపుకొనండి

సుగంధ చర్మరక్షణ మలాము
సాంటలక్స్
SANTALUX
మొటిమలు, కాటులు, శెగగడ్డలు, గజ్జి, తామర మొదలగువాటికి.

శ్రేష్ఠమైన అగరువత్తులు
కస్తూరి వత్తులు
అంబర్ ,,
మల్లె ,,
గులాబ్ ,,

సుగంధ ద్రవ్యములు
ఫ్లవర్ డస్ట్
సాండల్ ఫేస్ పవుడర్
సుగంధ చందన పవుడర్
దశాంగం

హోల్‌సేల్ ఏజెంట్లు: యునైటెడ్ కార్పొరేషన్, 54 అందరు వీధి, మద్రాసు-విజయవాడ, హైదరాబాద్.

PAKCO పాకో స్లో-స్పీడ్, కోల్డు స్టార్టింగ్ క్రూడ్ ఆయిల్ ఇంజనులు
—: ప్రత్యేక లక్షణములు :—
* పనిచేయ ప్రారంభించుట తేలిక
* తక్కువ ఇంధన ఖర్చు
* క్రమమైన నడక
* దిట్టమైన నిర్మాణం
* ఎక్కువ మన్నిక
* అద్భుతంగా పనిచేయును






* బాష్ ఫ్యూయల్, ఇంజక్షన్ పరికరములు
మద్రాసు ఆంధ్ర, కర్ణాటక, కేరళ రాష్ట్రములకు ఏజెంట్లు.
Grams: 'LAMP'
K. S. SHIVJI & CO., (Estd. 1903)
Phone: 3617
పోస్టు బాక్సు నెం. 5, 178 79 బ్రాడ్వే, మద్రాసు-1.






సర్వోన్నత శ్రేష్ఠమైనదిగా నిరూపించబడినది

ఫిల్లర్
ఎక్సైడ్

క్లోరైడ్ & ఎక్సైడ్ బ్యాటరీస్ (ఈస్టరన్) ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు, ఆంధ్ర, కేరళ, మైసూరు స్టేట్స్‌కు ప్రధాన ఏజెంట్లు
జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీ ఆఫ్ ఇండియా
ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-2.
బ్రాంచీలు: కోయంబత్తూరు, బెంగుళూరు, సికింద్రాబాద్.
EBSC-23




## ముస్తాబు ద్రవ్యముల చరిత్రలో ఇంతవరకు తయారుకాని కొంగ్రొత్త ఫేస్ పౌడర్లు!

### గోకుల్ శాంటోల్ టాయిలెట్ పౌడరు :

శుద్ధమైన చందనపు చెక్కల పొడరుతో (మైక్రోనైజ్డ) చాల నింపైన టాల్కం చేర్చబడి, తయారుకాబడిన పౌడరు. మీ ముఖ కాంతితో మెరుగు చూపుట, చెమటను అపుట, దాంకాలము వాసన యుండుట దీని ముఖ్య విశేషములు. చెమట పొక్కులను అపుచేయును.

### గోకుల్ శాండల్‌వుడ్ టాయిలెట్ పౌడరు :

శుద్ధమైన చందనపు చెక్కలనుండి తయారుకాబడిన పౌడరు. ఫేస్ పౌడరులకు కలయునంత పవిత్రము చేయబడినది.

### గోకుల్ బ్యూటీ పౌడరు :

పరిశుభ్రమైన పసుపుకొమ్ముల నుండి తయారుకాబడిన పౌడరు. వివిధ ఛాయలలో గలవు. మీ ముఖవర్చస్సును పెంపొందించునట్టియు, క్రిమి సంహారక సంబంధమగు, నట్టియు గుణములు గలది. దీని సువాసన గంటలతరబడి నిలచియుండును.

## టి.యస్.ఆర్ & కో, కుంబకోణమ్

C.L. Mani

# మీ యింటి చిన్నతోట

పూబోంట్ల సిగపూదండలకూ పూలు లభిస్తాయి. వీటిని ఎండతగిలేచోట నాటవలెను. చాలాకాలం ఉండేవి గనుక వీటిని వేసేటప్పుడు కొన్ని విషయాలను గుర్తుంచుకోవాలి. మొక్కలు పూర్తిగా పెరిగాక ఎంత విస్తరించుకొంటాయో అంతదూరం మొక్కకూ మొక్కకూమధ్యఖాళీనివ్వవలెను. ఎత్తుగా పెరిగే మొక్కలను వెనుక వరుసలలోనూ, పొట్టివాటిని ముందు వరుసలలోనూ నాటి, అన్నీ కనబడే అవకాశం కల్పించవలెను. ఒకేరంగు పూలు పూసేవాటినన్నిటినీ ఒకచోట గుమిగూర్చి నాటాలి. అప్పుడా రంగు దూరానికి ఒకముద్దగా కన్పించి, కంటికి 'నజరు'గా ఉంటుంది. చాలా రంగులపూలు ఒకేచోటున కలగాపులగంగా ఉంటే దూరానికి ప్రస్ఫుటంగా ఏ రంగూ కనిపించదు.

మల్లె, నందివర్ధనం, లిల్లీ, నైటుక్వీను, పారిజాతం మొదలయిన తెల్లరంగు పూలు, సువర్ణ గన్నేరు, పచ్చగన్నేరు వంటి పసుపువన్నె పూలు, మందార, మిరప మందారం, రామబాణం, గుల్మకాశీరత్నం, గన్నేరు ఆదిగాగల రక్తవర్ణపుష్పాలు, నీలాంబరం, డిసెంబరుపూలు, చిత్రమూలం మొదలయిన లేత నీలపు పూవులు, వ్యాపార పుష్పాలు అయిన గులాబి, చామంతి, మల్లెలూ మనకు చాలాబాగా తెలిసిన పూవులే. వాటిని గురించి విశేషముగా వ్రాయవలసిన పనిలేదు.

పైన చెప్పిన పర్ణపుష్ప జాతులు, చాలావరకు, విత్తనాలుచల్లి గాక, కొమ్మముక్కలవల్ల గాని, అంట్లు తొక్కడంవల్ల గాని వృద్ధిచేయ్యాలి. అలాగ మనమే మొక్కలను వృద్ధిచేసుకోడం చాక. లేదా, వేరు తొడిగిన మొక్కలనే మొక్కల వ్యాపారులు అమ్ముతారు. వాటిని నాటడానికి ఇది మంచికాలం.

తోటకు శోభనిచ్చే మొక్కలు అసంఖ్యాకంగా ఉన్నాయి. కాని ఎంత కొద్దిమొక్కలతోనైనా తోటను పూర్ణచిత్రంగా రూపొందించవచ్చును. పై మొక్కలను పూల మడులుగానూ, గుబురులుగానూ మాత్రమే గాక ఇతర విధములుగా కూడా కూర్చుతారు. తోట వైశాల్యం హెచ్చిన కొద్దీ, ఈ కొత్తరీతులను అవలంబించడానికిన్నీ ఉద్యానరచన అనే కళారంగంలో సిద్ధిని పొందడానికీ అవకాశాలు కలుగుతాయి. దానికి మొదటిమెట్టు మొక్కలలోని అందాన్ని ఆస్వాదించగల్గడం. తోటలను పెంచటం ద్వారానే ఈ సౌందర్యోపాసన సాధ్యం అవుతుంది. ★




మీ ఆర్డర్
రబ్బరు స్టాంపు
Rs. 2—8—0
విజయ్ ట్రేడర్సు, గుంతకల్లు.

దీర్ఘ రోగములకు నమ్మకమైన చికిత్స
యోగ్యతాపత్రములు గలవు.
వివరములకు:
రావూస్ ప్రోడక్ట్సు
గుంటూరు.

గృహస్థ దగ్గు నివారిణి
Alembic
గ్లైకోడిన్
టెర్ప్-వసాకా
పిల్లలుకూడ దానిని త్రాగుటకు యిష్టపడతారు.
అలెంబిక్ కెమికల్ వర్క్సు కంపెనీ లి.,
బరోడా-3
Alembic
170 ml. (6 Fl. Ozs. approx.)
GLYCODIN
TERP VASAKA
TRADE MARK
COUGH SYRUP
Adults:-
Children:-
COMPOSITION
DOSE
ALEMBIC CHEMICAL WORKS CO.
GTV. 59.9 TE.
EVEREST

# రాశిఫలాలు

★ దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి ★

**21-10-1959 మొదలు**

**27-10-1959 వరకు**

## మేషం:

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ సమయంలో కార్యభారం విశేషంగా యుంటుంది. అనేక రకములైన బాధ్యతలు పైన వేసుకుని పట్టుదలతో సాధించగలుగుతారు. ప్రతివిషయంలోను, తరచూ ప్రతిబంధకాలు వస్తూయుంటవి. కాని మీ బుద్ధిబలంతో ఇతరుల మనస్సును నొప్పించకుండా కార్యసిద్ధి పొందగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో క్రమకరంగా ఉంటుంది. మీ ఆరోగ్యం సంతృప్తికరంగా యుండదు. ఉష్ణప్రకోపంవల్ల బాధలు కనుపించగలవు. ప్రస్తుతం ఇతరులసహాయం లభించగల అవకాశాలు తక్కువ, ధనాదాయంలో లోపం రాదు. కాని ఖర్చులు మాత్రం విశేషంగా పెరగగలసూచన లున్నవి. అనుకున్న ప్రయాణాలు సక్రమంగా సంతృప్తికరంగా జరుగగల సూచనలు లేవు. 25, 26 తేదులలో బంధుమిత్రులవల్ల అనుకూలత, విలువగల వస్తువులు కొంటారు. శుభవార్తలు.

* * *

## వృషభం:

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

గతవారంకన్నా ఈ వారం మీ వృత్తి వ్యాపారాలలో చాలా అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. ఇంతకుముందు మీతో కొంచెం వ్యతిరేకభావంతో వర్తిస్తున్న వారు ఈ సమయంలో అన్నివిధాలా సహాయం చేస్తారు. మీ దేహసౌఖ్యం లోపిస్తుంది. డబ్బుకు సంబంధించిన లావాదేవీలలో కలతలు రాగలసూచన లున్నవి. జాగ్రత్తగా యుండటం మంచిది. అధికారుల పరిచయం లభిస్తుంది. ముందుముందు జరుగబోవు అనేక ముఖ్య కార్యకలాపములనుగురించి ఈ సమయంలో ప్రయత్నాలు జరుగుతవి. ఇండ్లు భూములు మొదలయినవి కొనే ప్రయత్నాలు ఉత్సాహకరంగా జరుగవు కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా యుండదు. 22, 23 తేదులలో ధనలాభం. బంధుమిత్రులవల్ల కార్యసిద్ధి.

* * *

## మిధునం:

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

మానసికంగానూ, శారీరకంగాకూడా తీరుబాటు లేకుండా శ్రమచేస్తుంటారు. ప్రతిపనీ నిమిషాలమీద జరుగబోతున్నట్లు కనుపిస్తుయుంటుంది. కాని, ఏదీ జరగదు. మీ వృత్తి వ్యాపారాలలో ఏవిధమైన చిక్కులు లేవు. అయితే ఆదాయాన్ని మించిన ఖర్చులు రావటంవల్ల మనస్సుకు కంగారు కలుగుతుంది. ఈవారం రెండవభాగంలో అన్నివిధాలా అనుకూలంగాయుంటుంది. ఉత్తర పశ్చిమదిశలనుంచి లాభకరమైన వార్తలు తెలుస్తవి. క్రొత్తమనుష్యుల స్నేహం లభిస్తుంది. పుణ్యకార్యములు జరుగుతవి. ఇతరుల వ్యవహార విషయాలలో బాధ్యత వహించి మధ్యవర్తిత్వంవంటి పనులు నిర్వహించగలుగుతారు. పేరు ప్రతిష్ఠలు లభిస్తవి. 24, 25. 26 లలో బంధువుల రాక, కార్యసిద్ధి, శుభకార్య ప్రయత్నాలు.

> **గ్రహస్థితి**
>
> సింహంలో శుక్రుడు, కన్యలో రాహువు, తులలో సూర్యకుజులు, తులా వృశ్చికాలలో బుధుడు, వృశ్చికంలో గురువు, ధనుస్సులో శని, వృషభ మిధున కటక సింహాలలో చంద్రుడు.

* * *

## కర్కాటకం:

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఈ వారం మీరు అన్నివిషయాలలోనూ నిబ్బరంతో యుండటం అవసరం. ఇతరులు మిమ్ములను మాటలతో భయపెట్టటానికి చూస్తారు. డబ్బుకు సంబంధించిన విషయాలలో నిర్మొహమాటంగా యుండటం మంచిది. వృత్తివ్యాపారాది కార్యకలాపాలు కొంచెం నిదానంగా జరిగినా లాభకరంగా యుంటవి. ఈసమయంలో ఇతరుల సలహాలను పాటించి విశేషంగా ధనం పెట్టుబడి పెట్టటంవంటి పనులు తలపెట్టడం మంచిదికాదు. కొద్దిరోజులు బాధ్యతలు పెట్టుకోకుండా ప్రశాంతంగా యుండటం మంచిది. కుటుంబంలో శుభపుణ్యకార్యాలు జరుగుతవి బంధుమిత్రులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి 26, 27 లలో అకస్మాత్తుగా ధనలాభం, గొప్పవారితో పరిచయం, దైవకార్యాలు.

* * *

## సింహం:

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ప్రస్తుతం మీ మనస్సుకు తరచు చికాకు కలుగుతూ యుంటుంది. అనేక సందర్భాలలో విశేషంగా ప్రయత్నిస్తేగాని ఏ పనీ జరుగదు. సహాయం చేస్తామని చెప్పిన మనుష్యులు సమయంలో సంపూర్ణంగా సహాయం చేయలేకపోవటంవల్ల బాధకలుగుతుంది. అయితే మీ ధైర్యం, పట్టుదల ఈ సమయంలో మిమ్ములను కాపాడుతవి. కుటుంబంలో అభిప్రాయభేదాలు రాగల సూచన లున్నవి. వృత్తి ఉద్యోగాలలో మీ బాధ్యతలను సక్రమంగా నెరవేర్చుకుని, గౌరవం పొందగలుగుతారు. ధనాదాయము మున్నూ బాగా యుంటుంది. కోర్టు కచేరీలలో మీరు అనుకుంటున్న చిక్కులు ఏమీ ఉండవు. కానిపనులు శీఘ్రంగా పూర్తికావు. సందేహాలు వస్తవి. 24, 25 లలో సంచారం. అసంతృప్తికరమైన పనులు. ఆడంబరం.

* * *

## కన్య: (ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం మీరు ప్రయత్నించే ప్రతి చిన్నపనికూడా ముందు కొంచెం ఆందోళన కలుగకుండా నెరవేరదు. చివరకు అన్నీ సక్రమంగా జరిగి, సంతృప్తికరమైన ఫలితం లభిస్తుంది. దైవబలం బాగుంది. ఇతరులవద్దనుంచి మీకు రావలసిన ధనం సకాలంలో వస్తుంది. వ్యవహార విషయాలలో మీరు బుద్ధిబలంతో విజయం పొందగలుగుతారు. ధనవ్యయం అధికంగా యుంటుంది. దేహశ్రమ కూడా యుంటుంది. ఇతరుల సలహాలను పాటించి భారమైన కార్యకలాపాలు ప్రారంభించవద్దు. విలాసవినోదాలకు ఖర్చులు. వారం రెండవభాగంలో మీ వృత్తిలో అనుకూల, అభివృద్ధి సూచనలు బాగా కనుపిస్తవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా యుండక మధ్యలో కొంత నిరుత్సాహం కలుగుతుంది. 21, 22 లలో ఆందోళన, పనులలో ఆలస్యం, వృధా ఖర్చులు.

* * *

## తుల:

(చిత్త 3,4 పా, స్వాతి, విశాఖ 1,2 3, పా)

గౌరవానికీ, ఆడంబరానికీ లోటు వుండదు. ఆదాయం కూడా బాగా నేయుంటుంది. పుణ్యకార్యాల నిమిత్తం ధనవ్యయంచేసారు. బంధువులకు సహాయం చేయవలసిన బాధ్యతలున్నా విశేషంగా వుంటవి. ప్రయాణ

సూచన లున్నవి. కాని ఇతర కారణాలవల్ల ఆటంకం కలుగుతుంది. క్రీడాయక మయిన కాలం. అయితే మీ ఆరోగ్యం సంతృప్తికరముగా ఉండకపోవటంవల్ల ముఖ్యమయిన పనులు కొంచెం ఆలస్యంగా చేయవలసివస్తూ ఉంటుంది. మీ వృత్తిలో శ్రమపడి అభివృద్ధిని సాధించుకో గలుగుతారు. కోర్టు కచేరీలలో ధనవ్యయంతో పాటు శరీరశ్రమకూడ వుంటుంది. కొని పనులు సక్రమంగా నెరవేరక అసంతృప్తికలుగుతుంది. 25, 26 లలో ధనలాభం, గౌరవప్రాప్తి, సంఘ కార్యాలలో పాల్గొనటం.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4 వ పాదం అనూరాధ జ్యేష్ఠ)

ఈ వారం చాలావరకు ఇతరుల సలహా నిమిత్తం సహాయం నిమిత్తం యెదురు చూడకుండా స్వశక్తిమీద ఆధారపడటం మంచిది. వృత్తి వ్యాపారాలలో అంతగా ప్రోత్సాహం కనుపించదు. అయితే మీ గౌరవానికి లోపం రాకుండా కాపాడుకోగలుగుతారు. ఇతరుల కార్యరంగంలో సాధ్యమైనంత జాగ్రత్తగా యుండటం మంచిది. మీకు మాట చెప్పిన మనుష్యులు సమయంలో సహాయం చేస్తారని నమ్మకద్దు. వారం రెండవ భాగం కుటుంబంలో శుభసూచనలున్నవి. ధనాదాయమున్ను పెరుగుతుంది. చాలా జాగ్రత్తగా యుందామని అనుకుంటూ విశేషంగా ఖర్చులుచేస్తూ ఉంటారు. 21, 22 లలో మానసిక ఆందోళన 24, 25 లలో శుభకార్య ప్రయత్నాలు ధనలాభం.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

ప్రస్తుతం మీ శక్తిసామర్థ్యాలు చక్కగా వినియోగించుకుని వృత్తి ఉద్యోగాలలో సాటివారి సహాయంతో ఉన్నతస్థితి పొందగలుగుతారు. మొదట్లో కొంత శ్రమకరంగా కనుపించినా చివరకు అన్ని పనులు సంపూర్ణంగా నెరవేరుతవి. బంధుమిత్రులతో రాగల అభిప్రాయభేదాలు మధ్యలో మీ మనశ్శాంతికి భంగం తీసుకురాగలవు. జాగ్రత్తగా ఉండటం మంచిది. సంతానం యొక్క ఆరోగ్యంగురించి జాగ్రత్తగా యుండండి. ఈ సమయంలో క్రొత్త మనుష్యులస్నేహం లభిస్తుంది. కాని, వారివల్ల చిక్కులు రాకుండా చూచుకొనటం అవసరం. వారం రెండవభాగంలో మీ దేహసౌఖ్యం తగ్గుతుంది. 21, 22, 23 లలో ముందు ముందు లాభించగల పనులకై ప్రయత్నం, కుటుంబసౌఖ్యం. శుభవార్తలు తెలుస్తవి.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

ఈవారం మీకూ, మీ ఓర్పుకూ పరీక్షవంటి సమయం. ఇతరుల కార్యబాధ్యతలు పెరిగి మీ స్వంతవృత్తివ్యాపారాలకు కూడా మధ్యమధ్య ఆటంకాలు రావచ్చు. తలపెట్టిన ప్రతిపనీ నిదానంగా జరుగుతూ వుంటుంది. ముఖ్యమైన సమయాలలో తగు పెద్ద మనుష్యుల సహాయం లభిస్తుంది. మీకూ మీ స్నేహితులకు సంబంధించిన విషయాలలో ఇతరుల జోక్యం లేకుండా చూచుకొనండి. బంధువుల వద్దనుంచి మీరు ఎదురుచూస్తున్న వార్తలు ఉత్సాహకరంగా ఉండవు. గౌరవం, ఆడంబరం నిమిత్తం అనవసరమైన శ్రమ, ఖర్చులు భరించవలసి వస్తుంది. 24, 25 లో మనస్సంతృప్తి గౌరవం, వృత్తిలో అభివృద్ధి.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ప్రస్తుతం మీ కుటుంబధనాదాయ విషయాలలో ప్రోత్సాహకరంగా యుంటుంది. కోర్టు కచేరీలలో అనుకూలత కలుగుతుంది. మీ వృత్తి ఉద్యోగాది విషయాలలో ఆందోళన తగ్గుతుంది. గౌరవం ధనాదాయం పెరుగుతుంది. మీరు ఇతరులకు చెప్పిన మాటను శ్రమపడి సక్రమంగా జరుపుకోగలుగుతారు. సంచారం అధికంగా ఉంటుంది. మీకు సహాయం చేస్తామన్న పెద్దమనుష్యులు తప్పక చేస్తారని నమ్మకద్దు. అంతమాత్రంచేత మీరు తలపెటినపనులు జరుగవని ఆందోళన చెందవద్దు, ఈ సమయంలో మీస్నేహం కోరి దగ్గరకు చేరే మనుష్యులనుగురించి జాగ్రత్తగాయుండటం అవసరం, 22,23 లలో మనస్సుకు అసంతృప్తి, అధికశ్రమ.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

మీశ్రమకు తగినఫలితం కనుపిస్తుంది. మీతో మిత్రులవలె కనుపిస్తు మిమ్మలను ఇబ్బంది పెట్టగల మనుష్యులు తటస్థపడతారు. ఇతరుల సలహాలను నమ్మవద్దు. కుటుంబంలో కొంతవరకు ప్రశాంతవాతావరణం ఏర్పడుతుంది. వృత్తికి సంబంధించిన కార్యకలాపాలు చురుకుగాజరిగి గౌరవంతో బాటు ఆదాయంకూడా పెరుగుతుంది. శ్రమకరమైన పనులుకూడా దైవానుగ్రహంవల్ల సులభంగా నెరవేర్చుకుంటారు. మధ్యమధ్య ఇతరుల జోక్యంవల్ల మీకు మీ ముఖ్యస్నేహితులకు విరోధం ఏర్పడగల కారణా లున్నవి. త్రిప్పటతో కూడిన పనులు అధికం. అంగవల్ల దేహసౌఖ్యంలోపిస్తుంది. అధికారులవల్ల జరుగవలసినపనులు త్వరలో నెరవేరవు. 25 26 తేదులలో దైవకార్యాలు, అనుకూల వార్తలు శ్రమతో కార్యసిద్ధి. 

స్నానం చేసేటప్పుడు
హాయిగా ఉండాలంటే
గ్లోరి ఉండటం
ఎంతైనా అవసరం
MALABAR GLORY SOAP
మలబార్
గ్లోరి
సోపు
ది వెజిటబుల్
సోప్ వర్క్స్
కోజికోడ్




# ఆడపిల్లల చదువుతో అర్థం తిరుగుతున్న కథ...

శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మంచి చెడ్డలు లాభనష్టాలు మొదలగు ద్వంద్వాలతో కూడివుంది ప్రపంచమంతా. ఈ విరుద్ధ గుణాలెప్పుడూ పరస్పరాశ్రయంతో ఒకదాన్నొకటి వెన్నంటివుంటూ హెచ్చుతగ్గు పాళ్లలో కలిసి పెనగులాడుతూండడమే లోకవృత్తం. ఈ ప్రపంచంలో ఏదీ పూర్తిగా మంచిదనిగానీ పూర్తిగా చెడ్డదనిగాని చెప్పలేము. ప్రతిదీ మంచిచెడ్డల అనగా విరుద్ధగుణాల మిశ్రమమే.

## కష్టనష్టాలు

సృష్టి అభ్యుదయోన్ముఖమై నడుస్తోంది. ఉత్తమ సృష్టియైన మానవుడు ఈ అభ్యుదయ వాంఛతో తాను సకల శక్తులను బిగద్రొక్కి జ్ఞానానందసముపార్జనకొఱకు అంగలు వేస్తున్నాడు. ఈ ప్రయత్నం మానవులలో సర్వతోముఖంగా అన్నిచోట్లా సాగుతోంది. దీనిలో భాగమే ఇప్పుడు భారతదేశములో జాతి మత కులభేదాలు స్త్రీపురుష వివక్షత లేకుండా అందరికీ అభివృద్ధికి సమానావకాశాలు కలిగించే రాజ్యాంగ చట్టం నిర్మించడం, దాని కనుగుణమై విద్యావిధానం ఏర్పాటుచేయడమూను. దీనివల్ల కలిగే ప్రయోజనాలతో పాటు తాత్కాలికంగానైనా కొన్ని కష్టనష్టాలు వుండకతప్పదు. మానవ నిర్మితమైన ప్రతి సంస్థలోను, ప్రతి విధానంలోను ప్రయోజనాలతో పాటు తద్వ్యాఘాతాలు కూడా తప్పనిసరిగా పెరుగుతూ ఉండడం స్వభావసిద్ధమే.

## 'మంది' ఎక్కువైతే....

ఇటీవల మనదేశం రాజకీయంగా స్వతంత్రమైనప్పటినుండి విద్యార్థుల సంఖ్య పెరిగింది. దీనితోపాటు విద్యాలయాల సంఖ్య కూడ హెచ్చింది. ఇప్పుడు కొన్నిచోట్ల ప్రతి రెండేసి మైళ్ళకు పెద్ద పెద్ద గ్రామాలలో ఉన్నత పాఠశాలలు, ప్రతి మునిసిపల్ టవునులోను ఒక కళాశాల సాధారణంగా ఏర్పడసాగినవి. వీటిలో అన్ని రకాల స్త్రీపురుష విద్యార్థులు ప్రవేశానికి ఎగబడుతున్నారు. విద్యావ్యాప్తి విస్తారమైనకొద్ది విద్యార్థులలో క్రమశిక్షణ, దానితోపాటు విద్యాప్రమాణాలు సడలసాగినవి. మంది యెక్కువైతే మజ్జిగ పలచబడుతుంది

కమలాశేఖర్

కాదూ! ఏ నిర్మాణంలోనయినా వైశాల్యమెక్కువైనకొద్దీ సాధారణంగా ఔన్నత్యం తగ్గిపోతుంది కొన్ని శిఖరాలు మాత్రం అలంకారప్రాయంగా అంబరాన్ని చుంబిస్తుంటాయి.

## ముద్రాంకితాలు

అన్ని బాపతుల విద్యార్థులు విరివిగా విద్యాలయాల్లో ప్రవేశించడంతో బాహుళ్యమెక్కువవడంచేత వివక్షత లేకుండా అందరికీ ఒకేతీరుగా వడ్డించే ఒత్తిడెక్కువైన అన్నవిక్రయశాలలలోవలె విద్యాలయాల్లో కూడా విద్యావిక్రయం చేయవలసివస్తోంది. ప్రతి సంవత్సరం వందలకొలది పట్టభద్రులను ముద్రాంకితాలతో విడుదల చేయవలసివస్తోంది. ఒకేతీరు నాణేలను సిద్ధంచేసి ఎగుమతి చేసే యంత్రశాలలవలె విద్యాలయాలు తయారు కావలసి వచ్చింది. జనసంఖ్య విపరీతంగా పెరుగుతోంది. దేశం పారిశ్రామికం కావలసివస్తోంది. ఈ పరిస్థితుల్లో ఈ పరిణామం తప్పదేమో!

## నాడు ఆడువారు

పూర్వం విద్యాసాంప్రదాయం గల కుటుంబాలలో మగపిల్లలకు అయిదవ సంవత్సరంలో అక్షరాభ్యాసం చేసి నియబద్ధమైన జీవితం అప్పటినుండి అలవరచేవారు. తగిన వయసు రాగానే ఉపనయన సంస్కారము చేసి గురుకులానికి పంపేవారు. అక్కడ వారు బ్రహ్మచర్య వ్రతం సాగిస్తూ గురువును భగవంతునిగా భక్తిప్రపత్తులతో భావించి శుశ్రూష చేస్తూ ఇతర వ్యాపృత్తులు లేక ఏకదీక్షతో కొన్ని సంవత్సరాలు విద్యాభ్యాసం చేసి అభిమానశాస్త్రాలలో నిష్ణాతులైన తర్వాత తల్లిదండ్రుల ఆజ్ఞానుసారం వివాహితులై గృహస్థాశ్రమం స్వీకరించేవారు. ఆ రోజులలో స్త్రీలలో కూడా కొందరు విదుషీమణులు ఉండకపోలేదు. కాని వారు పురుషులతో పాటు గురుకులాలలో విద్యాభ్యాసం చేసినట్లు చెప్పదగిన నిదర్శనాలేమీ అంతగా కానరావు. చాలావరకు వారిది సాంప్రదాయ సంస్కారమువల్ల కలిగిన శ్రుతిపాండిత్యంగా వుండేది. అప్పయ్య దీక్షితులవారి కుమార్తె శ్రుతిపాండిత్యాన్ని గూర్చి కథలు మనము వింటునే ఉన్నాము. తమ విధ్యుక్తధర్మాలను స్త్రీలు ఇళ్ళలో పెద్దల క్రమశిక్షణవల్లను వారి ఆచార వ్యవహారములవల్లను సాంప్రదాయానుగుణముగా గ్రహించి సంసారమును చక్కదిద్దుకొనే నేర్పును సంపాదించేవారు. విద్యాధికులగు తండ్రి అన్నదమ్ములు చేసే విద్యావ్యాసంగాలు వింటూ వాటిలో పాండిత్యం గడించేవారు.

## గుణదోషాలు

ఇప్పుడు అన్నిరంగాలలోను మనదేశంలో పురుషులతోపాటు స్త్రీలు ముందడుగు వేస్తున్నారు. విద్యాలయాలలో పురుషులతోపాటు స్త్రీలు కూడా అంతకంతకు విరివిగా ప్రవేశించి విద్యాభ్యాసానికి దిగుతున్నారు. ఇప్పుడు స్త్రీ పురుషుల సహవిద్యాభ్యాసం పాఠశాలలలోనూ కళాశాలలలోను ధారాళంగా సాగిపోతోంది. ఇది మంచిదా చెడ్డదా, వాంఛనీయమా, అవాంఛనీయమా అనే ప్రశ్నకు తావులేదు. ప్రపంచంలో అన్నిటివలెనే ఇది పూర్తిగా మంచిదీకాదు పూర్తిగా చెడ్డదీకాదు. దేని గుణదోష నిర్ణయమైనా చూచేవారి మనస్తత్వాన్నిబట్టి కూడా ఉంటుంది. కనుకనే దేనినైనా సరే కొందరు శ్లాఘించడం కొందరు చెడనాడడం జరుగుతూంటుంది. 'లోకో భిన్నరుచిః' అన్నారు గదా! గుణదోషమిశ్రమమైన అనేక ఇతరవిధానములవలెనే సహవిద్యావిధానం కూడా సాగి

(44 వ పేజీ చూడండి)



# ప్రేమ వివాహాలు

## స్త్రీ ఎందుకు ప్రేమిస్తుంది?

**వనితాలోకం రచనల పోటీలో కన్సొలేషన్ బహుమతిపొందిన వ్యాసం**





చాలా మంది చేసుకునే వివాహాల్లో ఈనాడు ప్రేమవివాహాలసంఖ్య క్రమంగా హెచ్చినా, అవి ఎప్పుడూ తల్లిదండ్రుల ఇష్టప్రకారం జరిగే వివాహాల సంఖ్యకన్నా చాలా తక్కువగా ఉంటాయి. మన దేశ ఆచారాలను అనుసరించితే ప్రేమ వివాహాలు జరిగేటందుకు, అవకాశములు తక్కువ.

స్త్రీకి పురుషునిలో అందము, ధనము, ఉద్యోగమే కాకుండా ఇతర ఆకర్షణలు కూడా ప్రేమకి కారణాలు.

అందము, ధనము, ఉద్యోగము మొదలైన వాటివలన కలిగే ప్రేమ భౌతికమైన ప్రేమ అనవచ్చు. కొందరు స్త్రీలు పురుషుని అందంచేత అధికంగా ఆకర్షింపబడతారు.

## వై. అంజని

ఆ స్త్రీ తనని ఆకర్షించిన పురుషుని వివాహం చేసుకొన్నట్లయితే వారి దాంపత్యజీవితం సుఖాంతం అవుతుందనేందుకు వీలు లేదు. ఎందుచేతనంటే అందం శాశ్వతమైంది కాదు. అయినా ఇంకా అందమైన పురుషులు, ఆకర్షణీయమైన వాళ్ళు తటస్థపడవచ్చు. అప్పుడు ఆమె తనభర్తని ప్రేమించలేక పోవచ్చు. ఒకసారి అందాన్ని చూచి ఆకర్షింపబడినప్పుడు తిరిగి అందాన్ని కోరేందుకు అవకాశాలు ఉన్నాయి. ఇది కేవలం మోహము అని నా ఉద్దేశ్యము.

కొందరు స్త్రీలు ధనాన్ని కాంక్షించి ప్రేమించి వివాహం చేసుకొంటారు. వారు జీవితంలో కోరుకునేదల్లా ధనమొక్కటే అయినట్లయితే వారి జీవితం సుఖాంతం అవుతుంది. వారికి ధనం వున్నదనే తృప్తి వుంటుంది. కాని వారు పూర్తి సంతోష సౌఖ్యాలు అనుభవిస్తారనుకొనేందుకు వీలు లేదు. భార్యకీ, భర్తకీ అభిప్రాయ భేదాల వలన కలహాలు రావచ్చు. అట్లా అనుకుని వాళ్ళు జీవితం అంతా దుఃఖమయం చేసుకుంటారనుకోవడం పొరపాటు. వారికి అభిప్రాయ భేదాలు వచ్చేటందుకు అవకాశాలున్నాయని మాత్రమే వ్రాస్తున్నాను.

మరికొందరు స్త్రీలు ఉద్యోగాన్ని చూచి ప్రేమించవచ్చు. కాని అదికూడా ధనాన్ని చూచి ప్రేమించి వివాహం చేసుకున్నట్లే అవుతుంది.

పైరకం ప్రేమవివాహాలు పూర్తి సంతోష సౌఖ్యాల నీయకపోయినా తల్లిదండ్రుల ఇష్టాన్ననుసరించి జరిగే వివాహాలకన్న విజయవంతం అవుతాయనుటకు సందేహంలేదు.

తెలివితేటలను చూచి ప్రేమించి వివాహమాడినట్లయితే ఆ వివాహం పైరకం వివాహాలకన్న సుఖాంతం అవుతుందని గట్టిగా చెప్పవచ్చు. అటువంటి భార్య తన భర్త తెలివితేటలమీద చాలా నమ్మకం కలిగి ఉంటుంది. అందుచేత ఆ స్త్రీకి తనభర్త మీద గౌరవభావం కలుగుతుంది. నిత్యజీవితంలో తెలివితేటలకు చాలా ప్రాముఖ్యత ఉంటుంది. ఒక రకంగా ఆమె తనభర్తకి లోబడి ఉంటుంది. అంటే అతని అభిప్రాయాలను వ్యతిరేకించదు. ఆమె దాంపత్య జీవితం సంతోషంగా ఉంటుందని చెప్పవచ్చు.

స్వభావము తనకి అనుకూలంగా ఉన్న పురుషుని కొంతమంది స్త్రీలు ప్రేమిస్తారు. అటువంటి స్త్రీలకు ఆత్మగౌరవం అధికంగా



# ప్రేమ వివాహాలు

## కన్సొలేషన్ బహుమతిపొందిన మరొక వ్యాసం

ములుకుట్ల కనకసావిత్రి

జీవితంలో సుఖపడినా, కష్టపడినా అదేదో ముఖ్యంగా దాంపత్యజీవితంలో తెలుస్తుంది. అవివాహిత స్త్రీకి గాని, పురుషునకు గాని జీవితం సుఖవంతమైనా కష్టభాజనమైనా అదేమీ లెక్కలోనిది కాదు. వివాహం అయిన దగ్గర నుంచి మానవుల కసలు జీవితం ప్రారంభమౌతుంది. కనుక అతి జాగ్రత్తగా ఆలోచించిన తరువాతనే ఈ దశలో అడుగు పెట్టాలి. పూర్వం కన్యలకు మరీ శైశవంలోనే వివాహం చేసేవారు. అటువంటప్పుడు వారు ఆలోచించి నిర్ణయించగలిగిందేమీ లేదు. కాని కాలక్రమంలో అనూనాచారాలు క్రమంగా మారిపోయి వాటిస్థానే క్రొత్తపద్ధతులు ఆక్రమిస్తున్నాయి. ఈ రోజుల్లో సర్వసాధారణంగా వివాహాలు వయస్సు వచ్చిన తరువాతనే జరుగుతున్నాయి. ఇప్పటికీ వధూవరుల ఇష్టానిష్టాలతో ప్రమేయం లేకుండా చాలా వివాహాలు జరుగుతున్నాయి. అదృష్టవంతులైతే వాళ్ళే ఒకరినొకరు అర్థం చేసుకుని జీవితం సుఖంగా గడుపుతారు. కాకపోతే జీవితమే ఇంతేననుకొని జీవచ్ఛవాల్లాగ రోజులు వెళ్ళబుచ్చుతారు.

దురదృష్టవశాత్తూ, మానవులెంత నాగరికులౌతున్నా, ప్రేమ వివాహాలంటే చాలామంది పెద్దవాళ్ళకి సదభిప్రాయం లేదు. "ప్రేమ వివాహాలంటే తల్లిదండ్రుల ఇష్టం లేకుండా జరిగేవి." అని ఒక నిర్వచనం వారి మనస్సుల్లో మెదులుతూంటుంది. కాని వాటివలన కలిగే సత్ఫలితాలను చెప్పినా వీరర్థం చేసుకోలేరు. ఇంకా కొన్ని తరాలు దాటితేకాని ఈ దురభిప్రాయం పూర్తిగా సమసిపోదేమో. అయినా ఇట్టి పరిస్థితులలో యువతీయువకులు కొంచెం ముందడుగు వేస్తేనేకాని సంఘపరిస్థితులు పూర్తిగా బాగుపడవు. మనస్సులు కలవనప్పుడు మిగతా పరిస్థితులెంత బాగున్నా, భార్యాభర్తల జీవితం ఒక నరకమే. కడు బీదవాళ్ళయినా ఒకరినొకరు అర్థం చేసుకుంటే వారికి జీవితమే ఒక స్వర్గము. భిన్నాభిప్రాయాలు, వ్యతిరేకమైన అభిరుచులు గల ఇద్దరు వ్యక్తులను ఒకచోట చేరుస్తే దానివలన కలిగే దుష్ఫలితాలు ఇంతింతకాదు. అటువంటప్పుడు భార్య ఏ పని చేసినా భర్తకందులో తప్పే కన్పిస్తుంది. అలాగే భర్తేంచేసినా భార్యకు నచ్చదు. ఇటువంటివన్నీ చాలావరకూ ప్రేమ వివాహాలవలన రూపుమాసిపోతాయి.

ఆదికాలంనుంచీ ఈ ప్రేమ వివాహాలు అమలులో ఉన్నాయి. సాధారణంగా అన్ని పురాణకథలలోనూ ఈపద్ధతి ఉండి తీరుతుంది. యువతీ యువకులు ప్రేమ వివాహానికి సిద్ధపడితే వారు బాహ్య పరిస్థితులనుబట్టి మాత్రమే ఆ నిర్ణయానికి రారు. అంతరంగములలో ఇద్దరికీ ఒకే రకమయిన అభిలాష ఉంటే వారి ప్రేమ సఫలమౌతుంది, గమ్యాన్ని చేరుకుంటుంది. వివాహం చేసుకోవాలి, అన్న నిర్ణయానికి వచ్చారంటే, వారు ఒకరినొకరు పూర్తిగా అర్థం చేసుకున్న తరువాతనే ఆ నిర్ణయానికివస్తారు. అంతే కాని ఒకరిచే నొకరు ఏవో కారణాలవలన ఆకర్షింపబడి అంతమాత్రంచేతనే జీవితమంతా ఒకటిగా గడపాలనే నిర్ణయానికిరారు. ఎంత స్వతంత్రభావాలు కలిగిన స్త్రీయైనా, ఇప్పటికీ, సంఘాచారాలకు భయపడుతుంది. ఎందుచేతనంటే, అయిన వాళ్ళందరినీ ఎదిరించి తనపంతం నెగ్గించుకున్నా, పురుషుడు ఎవరి సహాయము లేకుండానే జీవితం ఎలాగో గడపగలడు. కాని స్త్రీ విషయంలో అలా కాదు. తానూహించిన సౌఖ్యంకోసం లోకాన్నెదిరించటం కన్నా, పరిస్థితులకు తలవంచి దుఃఖపడటమే స్త్రీసహజం. సంఘపరిస్థితులిలా ఉన్నప్పటికీ యువతీయువకులు ప్రేమవివాహాలకు తలపడి, అవసరమైతే సంఘాన్నెదిరించైనా తమ ఆత్మగౌరవం నిలబెట్టుకుంటున్నారంటేనే వారి ఆత్మస్థైర్యం, దృఢనిశ్చయం, తేటతెల్లమౌతుంది.

ఇకపోతే పురుషుణ్ణిగురించి స్త్రీకోరికలు మనిషినిబట్టి మారుతుంటాయి. ఒక స్త్రీ తనభర్త అక్షరాలా తాను చెప్పినట్లు నడుచుకోవాలని కోరుకుంటుంది. మరొక స్త్రీకి అది నచ్చదు, ఒక స్త్రీ పతియే దైవమని నమ్మి అతని సౌఖ్యంకోసం తానేం చేయటానికైనా సిద్ధపడి అందులోనే తాను కూడ ఆనందిస్తుంది. మరొక స్త్రీ తన భర్త తన్నారాధించాలంటుంది. తండ్రి విద్యావంతుణ్ణి, తల్లి ధనవంతుణ్ణి అల్లుడుగా కోరుకుంటారనీ, కన్య మాత్రం తన భర్త అందగాడైతే చాలని కోరుకుంటుందనీ ప్రతీతి. కాని ఇది పూర్తిగా నిజంకాదు. స్త్రీ తన

## ★ స్త్రీ ఎందుకు ప్రేమిస్తుంది? ★

ఉంటుంది. వీళ్లు భర్త ఆశయాలని, అభిప్రాయాలను గౌరవిస్తారు. అంటే అతని అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవిస్తారు. ఇటువంటి భార్యమీద భర్తకికూడా గౌరవం కలుగుతుంది. ఈ రకమైన ప్రేమ వివాహంకూడా తప్పకుండా సుఖాంతం అవుతుంది. ఇంకా ఇతర కారణాలను చూచికూడా స్త్రీలు ప్రేమిస్తారు. కాని ఇవి పైవాటంత సాధారణంగా జరగవు.

కొందరు పురుషులలో కరుణ, సానుభూతి సహజంగాకంటె అధికంగా ఉంటుంది. ఈ రకం పురుషులు ఇతరులయందు శ్రద్ధ తీసుకుంటారు. మామూలు మనుష్యులకంటె వీరిలో స్వార్థం ఒకపాలు తక్కువగా ఉంటుంది. ఇటువంటి పురుషులను కొంతమంది స్త్రీలు ప్రేమిస్తారు. అటువంటి పురుషుని వివాహమాడిన స్త్రీ భర్తని అధికంగా గౌరవిస్తుంది. పూర్తిగా భర్త అధికారంలో ఉండేందుకు అంగీకరిస్తుంది. అందుచేత వారు దాంపత్యజీవితంలో పూర్తి సంతోష సౌఖ్యాలను అనుభవిస్తారని చెప్పవచ్చు.

మరి కొందరు స్త్రీలు పురుషునిలోని అసమర్థతని చూచి ప్రేమిస్తారు. అసమర్థత అంటే తన విషయముకూడా చూసుకోలేనటువంటి నిస్సహాయత. ఇటువంటి పురుషులు ఎంత వయస్సువచ్చినా ఎవరో ఒకరి అదుపాజ్ఞలలో ఉంటారు. అటువంటి పురుషునికి ప్రతిపనికి ప్రేమపూర్వకమైన ప్రోత్సాహము అవసరం. ఆ పురుషుని ప్రేమించి వివాహము చేసుకున్న స్త్రీ కొంత మాతృత్వపు ప్రేమ భర్తమీద కనబరుస్తుంది. ప్రేమతో నిండిన బాధ్యత వహిస్తుంది. అందులో ఆ స్త్రీకి చాలా సంతోషం కలుగుతుంది. భర్తకికూడా బాధ్యతారహితమైన జీవితంలో ప్రేమపూర్వకమైన ఆజ్ఞలలో సంతోషంగా గడుస్తుంది. వారి దాంపత్య జీవితం చాలా అద్భుతంగా ఉంటుంది. కాని పై రెండు రకాలుగా ప్రేమించే స్త్రీలు అంత ఎక్కువగా ఉండరు. కాని ఈరకం ప్రేమే శాశ్వతమైనదని నా అభిప్రాయం. స్త్రీలు, భర్త మరొకరి అధికారంలో ఉన్నట్టయితే, తల్లిదండ్రుల ఇష్టానుసరించి జరిగిన వివాహమైతే, అంతగా బాధపడరు. కాని ప్రేమించిన స్త్రీ దానిని సంహించలేదనటంలో సందేహం లేదు.

ప్రేమ వివాహాలే సుఖాంతం అవుతాయనేవారితో నేనుపూర్తిగా ఏకీభవిస్తాను. ★

భర్త రూపసి అయి ఉండాలని కోరుకున్నప్పటికీ, ఒక్క రూపానికిమాత్రమే ప్రాముఖ్యమిచ్చి మిగతా విషయాలు వదిలేస్తుందనుకోవడం పొరపాటు. "యత్రాకృతిః తత్ర గుణాః" అన్న సామెత అన్నిచోట్ల పరిపడదు. అలాగే, కోరిక తీరినా తీరకపోయినా ఉండవలసిన సద్గుణాలన్నీ తనభర్తకుండాలనికూడ కోరుకుంటుంది. ముఖ్యంగా వివాహానికి ముందే ఒకరికొకరు పరిచయమైతే, అతని స్వభావం ఎంతవరకూ తనకు అనుగుణంగా ఉన్నది అనే విషయానికి సాధారణంగా స్త్రీ ప్రాధాన్యమిస్తుంది. ఎప్పుడైతే ఒక పురుషుడు తన కనుగుణమైనవాడు, అన్న నిర్ణయానికి వస్తుందో అప్పటినుంచే, అతడిని తన ఆరాధ్యదైవంగా చేసుకుంటుంది. తన హృదయంలో అతనికి చెరగని ముద్రగా స్థానమిస్తుంది. లోకంలో ఎవరూ కూడ అతనికి సరితూగరని గుడ్డిగా నమ్ముతుంది. తన అదృష్టం కొద్దీ అతడితోనే తన వివాహం జరిగితే జీవితమంతా ఆనందంగా గడపగల్గుతుంది. తన కనుగుణమైన సరళ స్వభావంతోపాటు భౌతికావసరాలయిన, తెలివితేటలు, ఉద్యోగం, ధనము అందముకూడ ఉంటే కోరడానికైనా ఏమీ లేకుండా ఊహింపదగిన సౌఖ్యాలన్నీ అనుభవిస్తుంది. కాని అవిలేకపోయినా జీవితంపై విసుగు కలగనీయకుండా ఆనందంగానే రోజులు గడుపుతుంది.

యువతీయువకులు ప్రేమించుకొని వివాహాలు చేసుకున్నా కొద్దికాలంలోనే మనస్సులు విరిగిపోయి చెప్పరాని దుర్దశలకు సంసారాలు లోనుకావటంకూడ అక్కడక్కడ చూస్తున్నదే. ఈ రకమైన వివాహాలు "పవిత్రప్రేమ" అన్న సాకుక్రింద. భౌతికాకర్షణలు ప్రాధాన్యంగా జరిగినవి అయి ఉంటాయి వరుడు ధనవంతుడవటం చేతకాని, రూపసి అవటంచేతగాని, వివాహానికి దారితీస్తే, ఆ రెండూ మారిపోవటం అసంభవం కాదు కనుక, కొద్దికాలంలోనే అసలు రూపాలు బయటపడి రెండు విభిన్న ప్రకృతులుగా అవతరిస్తాయి, పర్యవసానం, నలుగుర్లో నగుబాట్లు కావటం, బ్రతుకే భారంగా తలపోయటం, ఒకరికొకరు గర్భశత్రువులై వి ఆత్మహత్యలకు పాలుపడటం జరుగుతుంది. కాని ప్రేమను పవిత్రంగానె అర్థం చేసుకుని క్షణికమైన భౌతికలక్షణాలకు ప్రాధాన్యత నివ్వకుండా యువతీయువకులు వివాహానికి తలపడితే అదెన్నటికీ దుఃఖాంతము కాదు. విరిగిన మనస్సులను కలపడం ఎంత కష్టమో, కలసిన మనస్సులను విడదీయటం కూడ అంతే కష్టము. భార్యాభర్తలిద్దరూ ఏకమనస్కులై ఒకేమార్గంలో నడుస్తుంటే వారిగమ్యం ఎల్లప్పుడూ సౌఖ్యంగానే అంతరిస్తుంది. ఇటువంటిదే ప్రేమించి వివాహం చేసుకోకపోయినా తల్లిదండ్రుల ఇష్టప్రకారమే పెళ్ళి చేసుకుని కూడ సాధించవచ్చు. కాని ప్రస్తుత పరిస్థితులలో ఇది అరుదుగా జరుగుతుంది.

భార్యాభర్తలు ఒకరినొకరు నమ్మినప్పుడే వారి జీవితం సుఖవంతంగా ఉంటుంది. ప్రేమించి వివాహం చేసుకుంటే పరిస్థితులే ఇటువంటి వాటికి దోహదమిస్తాయి. అమన్య ఒకసారి ఈ పత్రికలోనే ఒక కథలో చదివాను. ఒక స్త్రీ తన భర్తను గురించి తలపోయటం "భగవంతుడా! సంతానాన్నివ్యకపోయినా హృదయమంతా అమృతం

(47 వ పేజీ చూడండి)


# భారతి

## 1959 అక్టోబరు సంచిక

### కవిత:

విశ్వనాథ మధ్యాక్కరలు: శ్రీ గిరి శతకము — శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
మనశ్శైశవము — శ్రీ సి. నారాయణరెడ్డి
శ్రావణాభ్రము — శ్రీ బోడు బాపిరాజు
అరుణ కిరణాలు — శ్రీమతి అరుణకుమారి
శింజాన మంజీర రవః — శ్రీ వంగల సుబ్రహ్మణ్యశర్మ
శిఖరవాణి — శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

### వ్యాసాలు:

రాగాల గయశాసనము జయశాసనమే — శ్రీ గోలటూరి వేంకటరమణయ్య
కేరళ ప్రభుత్వ గ్రామాచారము — శ్రీ రాళ్ళపలి గోపాలకృష్ణమాచార్యులు
సోవియట్ రష్యాలో ఆర్థిక ప్రణాళికలు — శ్రీ బులుసు వెంకటసుబ్బారావు
ధ్వని: వర్ణం — శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి
విడిపోతున్న రెండు సంస్కృతులు — శ్రీ సి. పి. స్నో
బిరుద నామధేయులు — శ్రీ వి. కాల శేషాచార్యులు
తెనుగు శాసనాలలో అన్యదేశ్యాలు — శ్రీ మాదేకుర్తి సత్యనారాయణ
తొలి తెలుగు కావ్యము: కవిజనాశ్రయము — శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి
కీ. శే. హరినాగభూషణంపంతులు — శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు
కథకళి సాహిత్యము — శ్రీ పుటపర్తి నారాయణాచార్యులు
దమయంతి వాక్చాతుర్యము — శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు
చల్లగా చేతులు చాపుతున్న చైనా — రాజకీయ విద్యార్థి
సాహితీ సుగతుని స్వగతం — రామచంద్ర

### కథలు:

గమ్యస్థానం — శ్రీ ఆర్. ఎం. చిదంబరం
ఏరు కోసేసింది! — శ్రీ మిక్కిలి సుందరరావు

### కలగూరగంప:

శల్లవుల శిల్పశైలి, వాల్మీకి దేవాలయం

### గ్రంథవిమర్శనము:

శబ్దరత్నాకరము, రేణుక, ఏకలవ్యుడు, యతుప్రశానము.

వార్తలు.

## వెల: రు. 1-0-0

మేనేజర్, భారతి, 7, తంబుచెట్టివీధి, మద్రాసు-1.

# ఆడపిల్లల చదువు

(40 వ పేజీ తరువాయి)

పోతోంది లోకంలో. ఇది తప్పనిసరిగా ముందుముందు బహుళ ప్రచారంలోకి వస్తుంది కూడాను. ఈ రోజుల్లో దీన్ని ఆపడం ఎవరితరం కాదు. ఒకవేళ విద్యాలయాలలో ఈ సాహచర్యం ఆపినా ఇళ్ళల్లోనూ, మార్కెట్లలోనూ, ఆఫీసుల్లోనూ, సినిమా హాళ్ళలోనూ, పండుగల్లోనూ, పబ్బాల్లోనూ ఎట్లాపగలరు? అసలు ఆపడమెందుకు?. వారు అదుపాజ్ఞలలో పుట్టి పెరిగిన శీలసంపన్నులైతే కలిసినంత మాత్రంతో మునిగి పోయేదేమిటి? ఇండ్లలో స్త్రీపురుషులు అత్తమామలతోను బావ, మరదులతోనూ, అన్నదమ్ములతోనూ, వదిన మరదళ్ళతోనూ, అక్కచెల్లెళ్ళతోనూ, ఇంటికివచ్చే అతిథ్యభ్యాగతులతోనూ ధారాళంగా కలిసిమెలిసి మర్యాదగా మెలగడం లేదూ? క్రమశిక్షణలో పెరిగి మర్యాద తెలిసిన వీరు ఒకరిఎడల నొకరు ప్రవర్తించే ఎడల విద్యాలయాలలో సహవిద్యాభ్యాసం చేసినంత మాత్రంతో పోయేదేమైనా వుందంటారా?

### ప్రస్తుతం....

కాని ఒక్క సంగతి. ప్రస్తుతం విద్యాలయాలలో చేరే విద్యార్థుల సంఖ్య, వారి వైవిధ్యం తీరు తెన్నులు మొదలగువాని వల్ల క్రమశిక్షణకు భంగం కలుగుతోంది. దీనివల్ల కొన్ని అవాంఛనీయమైన ఫలితాలు కలుగుతున్నవని ఒప్పుకోక తప్పదు. ఇవి తాత్కాలికమే కావచ్చు. ముందుముందు ఈ దుష్ఫలితాలు పెరుగుతున్న ఈ విద్యార్థుల సంఖ్యకు తగిన విద్యావిధానం కట్టుదిట్టాలతో ఏర్పడితే తగ్గవచ్చు.

### అనేక కారణాలు

విద్యాప్రమాణాలు 'నానాటికి తీసికట్టు' కావటానికి పైనచెప్పినవేకాక ఇంకా అనేక కారణాలు వున్నవి. ముఖ్యమైన కొన్నిటిని గీతామూర్తిగారు ఇదివరకే పేర్కొన్నారు. మగపిల్లలలో ఇదివరలోకంటె విద్యాప్రమాణాలు తగ్గడానికి ప్రస్తుతపు స్త్రీపురుష సహవిద్యాభ్యాసం కూడా కొంత బాధ్యత వహించవలసి వస్తుందనడం అతిశయోక్తి కాదు.

విద్యాభ్యాసం చక్కగా నిరంతరాయంగా సాగాలంటే విద్యార్థులు తమ విధ్యుక్త కార్యక్రమాన్ని విద్యాలయాల్లోను బయటకూడా శ్రద్ధతో ఏకదీక్షతో సాగించుటకు తగిన వాతావరణం ఉండాలి. విద్యావ్యాసంగానికి ప్రోత్సాహకరమైన సాహచర్యం ఉండాలి. అట్టి అనుకూల వాతావరణం, ఇప్పుడు అంతగా లేదు. విలాసాలకు, ఇతర గోష్ఠులకు అవకాశం ఎక్కువైంది. మగపిల్లలు బుద్ధి విద్యాభ్యాసాన్ని విడిచి ఇతర విషయాలలో వ్యభిచరించే అవకాశాలు ఎక్కువైనవి. విద్యాలయాలలో యుక్తవయస్కులై అవివాహితలుగా వున్న విద్యార్థినులు కొందరు ప్రతిక్లాసులోనూ వుంటున్నారు. వీరు మగపిల్లలకంటె మొత్తం మీద శ్రద్ధగా క్లాసులోనూ, ఇంటిలోనూ ఏకాగ్రతతో చదువుతూ ఎక్కువ అర్హతను చూపుతున్నారు. ఇది నిస్సంశయము.

ఈడువచ్చిన అవివాహితలగు ఆడపిల్లలు అలంకరించుకొని క్లాసురూములో సమవయస్కులైన మగపిల్లలకు ఎదుటనో ప్రక్కనో వెనుకనో—విడిగా కొంతదూరంలో ప్రత్యేకమైన స్థానాల్లోనే అనుకోండి—లెక్చరరుతోనో, అంతకంటె కొంచెంముందో వెనుకో వచ్చి కూచుంటారు. వివిధ సంస్కారాలుగల మగపిల్లలలో కొందరి మనసైనా వారిని చూచి కొంత చలించకపోదు. అధ్యాపకులు చెప్పే విషయాలు గమనించక ఆయన ధోరణిలో ఆయన ఏదో చెప్పుకుపోతున్నంతసేపూ ఈ బుద్ధిమంతులు ఆడపిల్లలవంక చూస్తూనే కాలం వృథాచేస్తారు. ఇందులో కొందరు కొనరాకుండాచేసే చేష్టలు పడేపాట్లు రాయటం కంటె ఎవరికివారు వూహించుకోవడమే మంచిది. కొందరు కొంగితపు వుండలనుచుట్టి కానరాకుండా వారిపైకి విసురుతారు. కొందరు అవకాశాన్ని బట్టి పకిలిస్తారు. కొందరు ఇకిలిస్తారు. ఇంకా ఎన్నో వికా

## ఎప్పుడూ ఇంతే—5

శంకర్.




రంగనాథం: అడుగో ఆ పోయేవాడే నా జీవితం సర్వనాశనం చేసింది, నా ఆశలు భగ్నం చేసింది.

రామనాథం మరి మీ ఆవిడ అతడు చాలమంచి వాడన్నదే.

రంగనాథం: దానికేం తెలుసురా ఆడమేళానికి - మా మరదల్ని చేసుకుని నా నోట మన్నుకొట్టిన దుర్మార్గుడైతేను.

రకపు చేష్టలు చేస్తారు. అధ్యాపకుడు ప్రసంగవశాన ఏదో ఛలోక్తి విసురుతే అందరితో పాటు నవ్వుతున్నట్లే ఆ సందు చూచుకొని ఆడపిల్లలవంక చూచి విలాస చేష్టలు చేస్తారు.

30, 40 మంది మగపిల్లలున్న క్లాసులో పశుప్రవృత్తిగల ఒకరిద్దరున్నా 'తాచెడ్డ కోతి వనమంతా చెరచినట్లు' కొనరాని అలజడిని కలిగిస్తారు. దుర్వ్యాపారం అంటువ్యాధివంటిది. అది శీఘ్రంగా వ్యాపిస్తుంది. ఆవులు పెయ్యలు మేసే బీళ్ళు ప్రత్యేకంగా వుంటాయి. అందులో వాటితో పాటు గిత్తలను ఎడ్లను తోలరు. 'మేసే గాడిద వచ్చి మేసే గాడిదను చెరిచినట్లు తాను మేయక పోగా మేసేవాటిని మేయనీయక బీడంతా అల్లకల్లోలంచేసి ఒకకొలిక్కి తెస్తుంది. పశువులలో సహజ ప్రవృత్తిని నిరోధించే ప్రయత్నం వుండదు. వాటిలో ఆ ప్రవృత్తి విశృంఖలంగా బయటపడుతుంది. నాగరకత, వివేచనగల మనుష్యుడు నిగ్రహంతో సహజ పశుప్రవృత్తిని సభ్యతకొరకు నిగ్రహించుకొంటాడు. ఈ నిగ్రహశక్తి వేర్వేరు మానవులలో వారి వారి సంస్కారాన్నిబట్టి భేదిస్తూంటుంది. ఈ సంస్కారబలంగల కొందరు ఇంద్రియ సంనియమము చేసి స్వధర్మానుష్ఠానతత్పరులై ఈ యలజడికి పాల్పడక తప్పించుకొని పైనున్న నిర్మల వాతావరణంలోకి తలయెత్తి పరిసరాన్ని సింహావలోకనం చేస్తూ ధవళగిరి, కాంచనగంగ, ఎవరెస్టు శిఖరాలవలె విద్యార్థిలోకానికి అలంకారప్రాయులై ప్రకాశిస్తూ ఉంటారు. కాని సామాన్య విద్యార్థులలో పరిసరప్రభావాలకు చలించేవారే ఎక్కువగా ఉంటారు. వీరి బుద్ధి పూన్కితో చేయవలసిన విద్యాభ్యాసాన్ని విడిచి తరచు అలజడులపాలై ఇతర విషయాలలో వ్యభిచరిస్తూ ఉంటుంది. వీరు చేయవలసిన తీరుగా అధ్యయనం చేయలేకపోతారు.

అప్పుడప్పుడు విద్యాలయాలు కొందరు స్త్రీ పురుష విద్యార్థులమధ్య స్వయంవరరంగాలుగాకూడా వినియోగపడుతూ ఉంటున్నాయి! స్వయంవరయత్నాలు మనస్సులలో అంతర్వాహినివలె సుళ్ళతో సాగుతూ ఎప్పుడో ఒకప్పుడు బుగ్గగా పైకుబికి విద్యార్థిలోకంలో ముఖ్యంగా మగపిల్లలలో కొంతకలవరం కలిగించడం జరుగుతూ ఉంటుంది.

సహవిద్యాభ్యాసం ప్రస్తుతపు మన దేశ పరిస్థితులలో ముఖ్యంగా మగపిల్లల విద్యాప్రమాణాలను మొత్తంమీద కొంతవరకు తగ్గించడం లేదంటారా? ★



దేవాలయానికి —చిత్రం: వి. అచ్యుతరావు

# ★ అన్వేషణ ★

(31-వ పేజీ తరువాయి)

యి పూర్తిగా మట్టము పెరిగి గోదావరి అవతలితీరం కనిపించలేదు. గట్టుమీద కట్టి ఉన్న పడవలు త్రాళ్ళు తెంచుకుని వరదల ప్రవాహంలో తలక్రిందులుగా మొగ్గలు వేస్తూ పరుగులిడుతున్నాయి. పెద్దపెద్ద చెట్లు, వాటి కొమ్మలకు చుట్టుకుని పడగ ఎత్తి నిలుచున్న పాములు, శవాలు, జంతువులు అనంతమైన వేగంలో నీళ్ళల్లో పరుగిడుతున్నాయి. కట్ట మీద ఉంటే కలపదుకాణాలు కెరటాల పొంగుల్లో ఉయ్యాలల్లా తేలిపోతున్నాయి. గుడిసెల ఎండు తాటాకులు కెరటాల ఒడిదుడుకుల్లో తాబేళ్ళలా కదులుతున్నాయి. గోదావరి వరద ప్రమాదాన్ని గుర్తుచేస్తూ రావిచెట్లు గోజుకుంటూ అరుస్తున్నాయి. నీళ్ళలో పెకలింపబడిన చెట్లపై గూళ్ళు కట్టుకున్న పక్షులు, రెక్కలు రాని పక్షులు పిల్లలను రక్షించలేక భయంగా విలపిస్తూ ప్రాణరక్షణకు గాలిలోకి ఎగిరిపోతున్నాయి.

జలపాతంలాంటి గోదావరి వరదల నీరు ఇళ్ళల్లోకి ప్రాకింది. వీధి అరుగుమీద గదిలో పక్క వేసుకు పడుకున్న యింటి యజమాని మంచంక్రిందనుంచి తడితడిగా నడ్డికి తగిలితే అకస్మాత్తుగా లేచి మోకాలినీళ్ళలో నడిచి ఇంటిలోని వారినంతా లేపి వీధి తలుపులకు తాళాలు బిగించి మిద్దె మీదకు పరుగెత్తాడు సంసారంతో, వీలైన సామానుతో. వీధి చప్టామీద పడుకున్న ముష్టివాళ్ళు బొంతలు, ముంతలు సేకరించుకుని రెండు మైళ్ళదూరం రాత్రి నడిచి పారిపోయారు. ఒక బట్టల దుకాణం నీరులో మునిగిపోయి విలువైన తానులు చీకిపోయాయి. ప్లీడరుగారి బోర్డు, డాక్టరుగారి బోర్డు మేకులు ఊడి నీళ్ళ ప్రవాహంలో కలిసి వరదాగా, తేలుతూ ప్రయాణం చేస్తున్నాయి. ఒకరిక్షా పూర్తిగా నీళ్ళలో మునిగిపోయి, రక్షించమంటూ టాపుతో వెక్కిరిస్తూ ఎలుగెత్తి అరుస్తోంది. వారకాంతల ఆలింగనాల్లో ఆనందం అనుభవిస్తున్న విటులు తమకొంపలు నిజంగా మునుగుతున్నాయని బొళ్ళకటలు సవరించుకుంటూ పరుగెత్తుకుని ఇళ్ళకు చేరుకుంటున్నారు. ధనికులు, లారీలు సిద్ధంచేసుకుని విలువైన సామానులతో ప్రక్క ఊళ్ళకు తరలిపోతున్నారు. అంతస్తుల భవంతులున్న ఆగర్భశ్రీమంతులు, క్రింది భాగాలు వదిలి పొంగివచ్చే నీటని భయంగా చూస్తూ పై అంతస్తులకు పారిపోతున్నారు. ఒక హోటల్లో మరుదినంకోసం రక్షి వుంచిన మినపగుజ్జు, కూర ముక్కలు, పచ్చిమిరప తునకలు నీటిలో కరిగి తేలి తారట్లాడుతున్నాయి. ఒక సన్యాసి ఆశ్రమం పూర్తిగా నీటిలో కొట్టుకుపోయి, సర్వాంతర్యామిని శరణుకోరడంలో అతనికి పరీక్ష పెట్టింది. ఒక వితంతువు ఆపాదమస్తకం మంచంమీద తడిసిపోయి, గోదావరి స్నానం చేసినట్లు కలగని పొద్దున్నే మడికట్టుకుని పూజ చేసుకుని వంటచేసుకోవాలనే భ్రాంతితో లేచి మంచంమీద కూర్చుని, వరదల నీరుచూసి భయంతో, 'నారాయణ నారాయణ' అంటూ జపిస్తూ ఇంటిల్లిపాదిని రణగొణధ్వనితో లేపేసింది. ఒక గయ్యాళి భార్య, భయంతో భర్త రక్షణ కోరి ప్రసన్నురాలయిపోయింది. దొడ్లో కట్టివున్న ఆవులు, గేదెలు దూడలు నీటి పారుదలచూసి భయంగా అరుస్తున్నాయి.

క్రొత్తగా తవ్వించిన నుయ్యినుంచి జల రాకపోగా శివుడికి కొబ్బరికాయలు సాయంత్రమే కొట్టిన కోమటాయన, నుయ్యి నీటితో పొంగిపొరలిందేమో అనే సంతోషంతో లేచి, వరదల నీరని గమనించి, కంగారుగా గంతులు వేశాడు యింట్లో. సగం మట్టి నేలతో కూడిన శంకరగోడ్లు నీటితో మునిగిపోయి బురద నేలగా మారాయి.

వరదలనీరు ప్రమాదాన్ని తట్టుకోడానికి, పొరుగింటి ధనికుల ఆదరణతో, అంతస్తుల మేడమీద ఒక గదిలో రెండు రోజులు సకుటుంబంగా రక్షణ తీసుకున్నారు. సనవరాలు యింటినుంచి అదృశ్యమయ్యాక మందకొడితనంతో బ్రతుకుతున్న చిట్టెమ్మ పది రోజులనుంచి టైఫాయిడ్ జ్వరంతో మూల్గుతోంది. వరదల బాధల్లో డాక్టర్లు కూడా స్వకుటుంబరక్షణలో మునిగి తేలడంవల్ల, చిట్టెమ్మ జ్వరానికి తగ్గ చికిత్స లభ్యం కాలేకపోయింది. కొన్నాళ్ళయినా వెంకటేశ్వరుడిదగ్గర పేళంగిలో వుంటే, యీ ఒడుదుడుకులు తగ్గవచ్చునని ఆశించారు బ్రహ్మయ్యగారు...

మూడు రోజులుదాకా గోదావరి వరదల నీరు పిల్లకాల్వల్లా వీధుల్లో వ్యాపించినది. నదిలో పడవల్లా, వీధుల్లోనే పడవలు తిరగడం మొదలెట్టాయి. జట్కాలు, రిక్షాలు అదృశ్యమైపోయాయి. యూరప్‌లోని సముద్రతీరఖండాల నంటిపెట్టుకునే వెనిస్ పట్టణంలా రాజమండ్రి మారిపోయింది. చూరు మునిగిన యిండ్లు, సగం ఒరిగిన గృహాలు, నీటిలో శిథిలమై రాలిపడిపోతున్న మట్టిగోడల పూరిండ్లు. తడిసి మెత్తి వాసనల విరజిమ్మే కలపద్వారాలు, ద్వారబంధాలు ఎండుతున్న మేర మురికి ఏర్పడే దుర్గంధం వెదజల్లే మెట్టప్రదేశాలు, నీటిపారుదలలో తడిసి తపతపలాడే కొంపల్లో రొదచేసే దోమలు, క్రిమి కీటకాల రభస, యథేచ్ఛగా వాసాలపైకి ప్రాకి బుసకొడుతూ భయం కల్పించే పాములు, కూలిపోయిన చెట్లు, కృంగిపోయిన పెంకుటిళ్లు పట్టణాన్నంతా నిర్జనప్రదేశంగా మార్చి ఒక శ్మశానంలా మార్చింది. మధ్యతరగతి కుటుంబీకులు ఆలస్యంగా శిథిలమైపోతున్న గృహాలు పూర్తిగా రక్షణ యివ్వకపోవడంవల్ల పడవల నాశ్రయించి మెరకప్రాంతాలకు వెళ్లుతున్నారు. రక్షకభటులు, విద్యార్థి సంఘాలు, ప్రజాసేవకులు, తమ సేవానిరతి చూపే అవకాశం వచ్చిందని విరామం లేకుండా వరద బాధితులకు సహాయం చేస్తున్నారు. ప్రభుత్వ అధికారులు విమానాల మీద, పడవలమీద పర్యటించి, పట్టణంలో స్తంభించిపోయిన రైలుకటలు పరీక్షించారు. వార్తాపత్రికల్లో వరదలనీరు పొంగులా పెద్ద పెద్ద అక్షరాలతో వరద బీభత్స దృశ్యాలు నిండిపోయాయి. ప్రకృతి కోపోద్రేకానికి తట్టుకోలేక భగవన్నామ స్మరణతో, స్వకుటుంబరక్షణలో ప్రతి వ్యక్తి విపరీతమైన స్వార్థం చూప మొదలెట్టాడు.

తన పలుకుబడినంతా ఉపయోగించి, కొంతమంది స్నేహితులతో ఒక రవాణా మోటరు కుదుర్చుకుని, కుటుంబంతో పాటు, కొంత సామానుతో పేళంగి బయలుదేరారు బ్రహ్మయ్యగారు. వరదలనీరు పట్టణంలో తగ్గినా, పట్టణం అంతా యథాస్థితికి వచ్చి, వరదలవల్ల వచ్చే వ్యాధులు తగ్గేవరకు చాలకాలం పడుతుందని బ్రహ్మయ్యగారు యిష్టంలేకపోయినా దగ్గర ఉన్న మనుమడి

---

వకీలు : "అయితే ముద్దాయి మీ కారు దొంగతనంగా డ్రైవ్ చేసుకుపోవటం కళ్ళారా చూశారా?"

వాది : "చిత్తం! మీరు ఈ క్రాస్ ఎగ్జామినేషన్ మొదలెట్టే వరకు గట్టిగా చూసినట్లే నమ్మాను. మీ ప్రశ్నలతో బుర్ర తికమకలై, అసలు నాకు కారున్నదా అని ఆలోచిస్తున్నాను, క్షణం ఆగండి."

వరదను పోక తప్పలేదు. టైఫాయిడ్ జ్వరంతో మళ్లీ నీళ్లల్లో తడిసి, ఈదురు గాలిలో కుమిలి, గజగజ వణుకుతూ ముద్దలా కొంగులో ఒరిగిపోయింది చిట్టెమ్మ.

వేళంగి చేరగానే వెంకటేశ్వర్లు కొంత సానుభూతిచూపి, ఆఫీసు పని రద్దీ వల్ల ప్రాంతానికి రాలేకపోయానని సాకు చూపాడు. జ్వరంతో దిగిన చిట్టెమ్మను చూచి, తన పిల్లలకు ఏ బాధ కలుగుతుందో అనే శంకతో పార్వతమ్మ మూతి ముడుచుకుని బలవంతంగా స్వాగతమిచ్చింది వరద బాధితులకు.

రాకపోకలు, ఉత్తరాల రవాణా స్థగపడే లోపుగానే చిట్టెమ్మ జ్వరం విపరీతంగా విజృంభించింది. వెంకటేశ్వర్లు తీసుకువచ్చిన డాక్టరు తన శక్తినంతా వినియోగించానని వాక్రుచ్చి, ఫలితం విచారకరమేనని పెదాలు విరిచాడు. చిట్టెమ్మ ఒక రాత్రి మౌనంగానే మంచంకోడిగానే మాటలేక కళ్ళు మూసింది. మరణించిన చిట్టెమ్మ గురించి ఎక్కువగా విచారించినవారెవరూ లేకపోయారు. వయసు పెరిగి ముసలిదైన చిట్టెమ్మ మరణానికి సన్నిహితురాలయి వుందని అందరూ నమ్మారు. కాని జరగవలసిన అంత్యక్రియలు జరిపే బాధ్యత బ్రహ్మయ్యగారే పూనుకుని చేశారు. శుభమైన తనకొంపలోకి ఒక పీనుగు కొట్టుకు వచ్చిందని కుళ్లి కుళ్లి కుత్సితంగా మధనపడింది పార్వతమ్మ.

శివరాం వ్రాసిన ఉత్తరం వరదలు పూర్తయ్యాక చిట్టెమ్మ చనిపోయాక రాజమండ్రివచ్చి, అక్కడినుంచి తిరుగపంపబడి, మెల్లిగా బ్రహ్మయ్యగారికి చేరింది. జరిగిన సంగతులు వివరిస్తూ కంగారుపడి రానవసరం లేదని శివరాంకు జవాబిచ్చారు బ్రహ్మయ్యగారు. ఉండ్రాజవరంలోని దీక్షితులు భార్య కుటుంబం ఆపదలో వుందని రాకపోకలు సమకూడేక చూడాలని బయలుదేరి వేళంగి వచ్చాడు. పార్వతమ్మ ప్రవర్తన అర్థంచేసుకున్న బ్రహ్మయ్యగారు, పొలం వ్యవహారాలు, తదితర సంగతులు, వెంకటేశ్వర్లుకు అప్పచెప్పి దీక్షితులు బలవంతం మీద సుభద్రమ్మతో ఉండ్రాజవరం చేరారు కొన్నాళ్లు గడుపుదామని.

బ్రహ్మయ్యగారి ఉత్తరం శివరాంకు అసంతృప్తి కలిగించింది. వున్న ప్రాంతం కదలి వచ్చే స్వభావంలేని బ్రహ్మయ్యగారిని తన దగ్గర వుండమంటే ఒప్పుకోరని ఇంతకాలం ఆ ప్రస్తావన ఎత్తలేదు. ఉద్యోగంలో స్థిరపడి పుష్కలంగా సంపాదించుకుంటున్న తనతోనే తాతను తల్లినీ కూడ వుంచుకుని సేవ చేస్తే వాళ్ళ చివరి రోజుల్లో తన విధ్యుక్త ధర్మం నిర్వర్తించినవాడౌతానని తలపోశాడు శివరాం. ఆస్తి వ్యవహారాలు అన్నగారికి అప్పచెప్పి తల్లితో తక్షణం బయలుదేరి సికింద్రాబాదు వచ్చెయ్యమని ప్రాధేయపడుతూ శివరాం ఉత్తరం వ్రాశాడు. దీక్షి[illegible] ఇంట్లో తనకు అన్ని సౌకర్యాలు సమకూడుతున్నా, మనుమరాలి అత్తవారింట్లో చాలకాలం ఉండడం సబబుగా కనిపించలేదు బ్రహ్మయ్యగారికి. జవసత్వాలు కాలక్రమంలో ఉడిగిపోతుండగా, కొంతకాలం క్రొత్తనగరాన్ని చూస్తూ మనుమడిదగ్గరే గడుపుతే మనస్సుకు పూర్తిగా శాంతి కలుగవచ్చునని బ్రహ్మయ్యగారు మనసు మార్చుకున్నారు. ఎప్పుడు రమ్మంటే అప్పుడు బయలుదేరి వస్తానని జవాబిచ్చారు ఆయన.

తాతయ్య ఉత్తరం చూసి ఆనందంలో తబ్బిబ్బైపోయాడు శివరాం. పేరిశాస్త్రిగారింటికి పయనమైపోయాడు. ఆ రోజు రైలు దిగి వచ్చానని గోదావరి వరదభీభత్స దృశ్యాలు చుట్టూ కూర్చున్నవారి కొంత జనంతోపాటు శివరాంకూ ఒక పెద్ద ఉపన్యాసం యిచ్చారు. వరదనీరు ఇంట్లోకి ప్రవహించి నిలువెత్తున పొంగిపోతే, సామానులు మిద్దెమీదకు చేరవేసి, పేకాడుకుంటూ చీకటి మిద్దెమీద రెండురోజులు ఎలా గడిపినదీ ప్రతిభావంతుడైన నటుడిలా అభినయించి చక్కగా వర్ణించి చెప్పారు. గదిలోని ప్రేక్షకులు చెవులు నిక్కించి ఆశ్చర్యంతో కుతూహలంగా విన్నారు.

శివరాం తన క్రొత్త అద్దెకొంప ప్రస్తావన తెచ్చాడు. "నిన్ను గురించి నేను మునుపే ఆలోచించేను. మావీధిచివర మా సెవర్తకుడు క్రొత్తబంగళా కడుతున్నాడు...అది అద్దెకిస్తాడేమో కనుక్కుని కుదురుస్తా, చాలా సూక్ష్మంగా తేల్చేశారు పేరిశాస్త్రి.

బ్రహ్మయ్యగారు, సుభద్రమ్మకూడ యికముందు తనతో నివసిస్తారని శివరాం చెప్పగా ఆనందం వ్యక్తపరచి వరదల భీభత్సంలో వారిని రాజమండ్రిలో చూడలేకపోయానని, ఏ విధంగానూ సాయం చెయ్యలేకపోయానని అసంతృప్తి ప్రకటించాడు పేరిశాస్త్రి. ఆయనమీద దృఢ విశ్వాసం పెంచుకుని మర్నాడే క్రొత్త అద్దెకొంప దొరకగలదనే ఆశతో శివరాం వెళ్ళిపోయాడు.

శివరాం ఆశ నిరాశకాలేదు. పేరిశాస్త్రి ఇంటిఅద్దె కుదిర్చి అరవైరూపాయిలని మేడమీద బంగళా చాలబాగుందని తన స్వంత పలుకుబడివల్ల ఈ విషయం స్థిరపడిందని సోత్కర్షతో చిరునవ్వునవ్వాడు. మేడభాగం ప్రత్యేకంగా సర్వసదుపాయాలతో విశాలంగా ఉండడంవల్ల అంతఅద్దె కొంచెం ఎక్కువని భావించినా, త్వరలో ఇల్లు సునాయాసంగా దొరికిందని సంతోషంగా ఆ అద్దెయిల్లు ప్రవేశించడానికి ఒప్పుకుని బజానా యిచ్చేశాడు శివరాం. తాతయ్యకు రమ్మని ఉత్తరం వ్రాశాడు.

బ్రహ్మయ్యగారు సుభద్రమ్మను తీసుకుని, వీలయినన్ని సామానులు వెంటబెట్టుకుని, నిర్ణయించినశుభదినంనాడు,పొద్దున సికింద్రాబాదు స్టేషనులోదిగారు. తనకు ప్రతిబింబాలుగా పూర్వతరాల వ్యక్తుల్లా వివిధసంస్కృతుల పద్ధతుల్లో, రైలుదిగిన తాతయ్యను తల్లిని పొంగిపొరలే అభిమానంతో, గౌరవంతో ఆనందంగా ఎదురేగి ఆహ్వానించాడు శివరాం. బ్రహ్మయ్యగారు మితిమీరిన వాత్సల్యంతో శివరాం నడుంచుట్టు చెయ్యివేసి ప్రథమంగా అతనిక్షేమం విచారించారు. గర్భవాసప్రేమలో బాధపడే తల్లి భోజనంసౌకర్యాలు హోటల్లో ఎల్లా వున్నాయని, చిక్కిపోయావేమని ప్రశ్నించింది. రైల్వేకూలీలను పిలచి సామానులు స్టేషను ఆవరణదాటించి టాంగాలు కుదిర్చేడు శివరాం. టాంగాలు నగరంలోకి నడిచాయి. సుభద్రమ్మగారు, బ్రహ్మయ్యగారు నగరంచూస్తూ విభ్రాంతి పొందుతున్నారు. శివరాం వాళ్ళకు చుట్టుప్రక్కల రోడ్ల పేర్లువింతలు,విశేషాలు చెబుతున్నాడు.

బ్రతుకుతెరువుల అన్వేషణలో గతులు మార్చే మనుష్యుల్లా గమ్యస్థానం అన్వేషణలో గమనంమార్చింది రైలుబండి. కూతకూస్తూ, పొగలుజిమ్ముతూ, చక్రాలు తిప్పుతూ క్రొత్తశక్తితో, అడుగు వేసింది రాబోయేస్టేషనువైపు. రైలు పొగలు మేఘాల్లా గాలిలో తేలి పరిసరాల చెట్లను స్తంభాలను నలుపు చేస్తున్నాయి. సలపెక్కిన ఆకులు రాలి చెట్టుక్రింద భిక్షుకులు పడి దొర్లుతున్నారు. మసిఎక్కిన వంట గిన్నెలు చెల్లాచెదురుగా వదిలి నల్లకుక్క ఆ భిక్షుకుల మలినదేహాలు తాకుతూ తోక ఆడిస్తోంది సంతోషంగా. స్వరక్షణకొరకు గతులుమార్చే ఉన్నత మధ్యతరగతి వ్యక్తులకు, రక్షణేలేక నిత్యప్రమాదబాధితులై గతులుమార్చే భిక్షుకులకు ఉన్న వ్యత్యాసంలో పాడనూపే సర్వాంతర్యామి రక్షణ సిద్ధాంతం మెదిలింది శివరాం దృష్టి అన్వేషణలో. (ఇంకా వుంది) ★

## "ప్రేమ వివాహాలు"

(43-వ పేజీ తరువాయి)

తో నిండిన భర్తని ప్రసాదించావు. అంతే చాలు" అని. ఈ విశ్వాసమే దంపతులలో ఒకరిమీద ఒకరికుంటే పిల్లలేకాదు. అతి ముఖ్యమైన జీవితావసరములు లోపించినా వారి సంసారం వారికి సౌఖ్యకరమే.

ప్రేమ వివాహాల విషయంలో పురాణ గాథలను ఆదర్శంగా తీసుకుని, వాటిని అనుసరించటం వాంఛనీయమేకాని సంఘటనలన్నీ కథలో సాగినంత సాఫీగా నిత్యజీవితంలో సాగవు. ఈ కథానైజమే సుభద్రకర్జునుణ్ణీ, రుక్మిణికి శ్రీకృష్ణుణ్ణీ, దమయంతికి నలుణ్ణీ తెచ్చిపెట్టింది. అంతేకాని అవే పద్ధతులను ఇప్పటి మన స్త్రీలు కూడ అనుసరించినా, అంత సులువుగా గమ్యాన్ని చేరుకోలేకపోవచ్చు.ఆదర్శ గాథలను ఆధారంగా తీసుకోవటంచేత గాని, మానవుల మనః ప్రవృత్తులు మారటంచేత గాని, సాంఘిక పరిస్థితులు అనుకూలించటంచేత గాని, ఏ విధంగానైనా ప్రేమవివాహాలు అభివృద్ధి పొంది అవి సత్ఫలితాలకు దారితీస్తే మాత్రం అందరికీ ముదావహమే.

# శబాష్-రాముడూ!




బాలలసంఘం 'ఏ' వర్గం సభ్యుల రచనల పోటీలో కన్సొలేషన్ బహుమతిపొందిన కథ

ఇన్‌స్పెక్టరుగారు మా స్కూలు తనిఖీ చెయ్యడానికి వస్తున్నారన గానే మేస్టర్లందరిలోను అలజడి పుట్టింది. ఆయన కొత్తగా మా జిల్లాకి వచ్చినవాడు కావడంచేత ఎలాటివాడో ఎవరికీ తెలియదు. మా లెక్కల మేస్టారు మాత్రం ఆయన్ని కాకినాడలో ఓసారి చూశారట. చాలా అఖండుడని "ఘట్టి"వాడని ఆయన అంచనా. ఆ విషయం అలా అలా అంతమందిలోకీ ప్రాకిపోయింది. తెలుగు మాస్టారికి దడ కూడా పట్టుకుంది.

"క్రిందటి సంవత్సరం ఇన్‌స్పెక్టరుగారు నామీద ఛడామడా రాసి వెళ్ళిపోయారు. ఈ సారి ఏమవుతుందో"! అంటూ తెలుగు మేస్టారు హెడ్ మాస్టారుగారి దగ్గర వాపోయారు.

"మీ భయమే మీకు ముప్పు తెస్తున్నదండీ, శాస్త్రిగారూ! పాఠాలు చక్కగా బోధిస్తారు. అయినా అధికారిని చూసేసరికి మీకు ఎక్కడలేని దడా వస్తుంది. కొంచెం నిబ్బరంగా ఉండండి. ఫరవా లేదు" అని హెడ్మాస్టారు శాస్త్రిగారికి ధైర్యం చెప్పారు.

తెలుగు మేస్టారు పైకి తేలిపోయారుగాని మిగతా మేస్టర్ల నిబ్బరంకూడా అంతంత మాత్రంగానే వుంది.

## 2

అనుకున్ననాటికి సరిగా ఇన్‌స్పెక్టరుగారు వచ్చేశారు. ఒక్కొక్క క్లాసే తనిఖీ జరిగిపోతూంది. ఈ ఇన్‌స్పెక్టరుగారి పద్ధతి కొత్తరకంగా వుంది. మాస్టర్లచేత పాఠం చెప్పించి వినడంలేదు సరికదా, తనంతట తనే పిల్లల్ని ప్రశ్నలువేసి పరీక్షిస్తున్నారు. అసలే ఆయన వేసేవి చిక్కు ప్రశ్నలు. పైగా ఆయన గాంభీర్యం చూసి భయపడిపోయి కొందరు పిల్లలూ, ఏం చెబితే ఏమంటారో అన్న సందేహంలో పడిపోయి కొందరు పిల్లలూ, ఉలక్కుండా పలక్కుండా ఉండిపోవడం కూడా జరిగింది అన్ని క్లాసుల్లోనూ, దాంతో ఆయన వెర్రెత్తినట్లయిపోయి హెడ్మాస్టరుగార్ని ఎడాపెడా

వదిలేశారు. రెండురోజులు గడచి పోయాయి.

## 3

మూడవ రోజున మా క్లాసు తనిఖీ చెయ్యవలసి వుంది. ఆ రోజు ఉదయం మాకు తెలుగుమాస్టారి క్లాసు జరుగుతోంది. ఇంతలో ఇనస్పెక్టరుగారు ఒక్క పావుగంటలో వస్తున్నారు అన్న కబురు తీసుకొని జవాను వచ్చేడు. వెంటనే తెలుగు మాస్టారు ముక్కుమీది కళ్ళజోడూ, నెత్తిమీది తలపాగా ఓ సారి సవరించుకొని "సైలెన్స్!" అని మమ్మల్ని హెచ్చరించి, ఏం పాఠం చెప్పడమో — అన్న ఆలోచనలో పడిపోయారు. ఆయన ఆలోచనలోంచి తేరుకొనేలోపల ఇనస్పెక్టరు గారూ, ఆయన వెనక హెడ్మాస్టారు క్లాసులోకి రానే వచ్చేశారు.

లేచి నిల్చున్న మమ్మల్నందర్నీ కూర్చోమని సంజ్ఞచేసి "ఏం చెప్తున్నారండీ!" అన్నారు ఇనస్పెక్టరుగారు, తెలుగుమాస్టార్ని చూసి.

తెలుగుమేస్టారు ఒదిగిఒదిగి వెనక్కు తప్పుకొని, "చిత్తం, చిత్తం వ్యాకరణమండి," అని జవాబిచ్చారు.

ఇనస్పెక్టరుగారు తల విదలించి, రెండడుగులు ముందుకొచ్చి, 'అబ్బాయిలూ! మిమ్మల్ని నేనేమి అడగను. ఒక్కొక్కళ్ళే లేచి మీరే నన్ను ప్రశ్నలు అడగండి. చూస్తాను," అన్నారు.

ఎవ్వరూ ప్రశ్న అడగడానికి లేవలేదు.

ఇనస్పెక్టరుగారు ఇంకొంచెం ముందుకొచ్చేరు. జేబులోంచి ఒక అయిదురూపాయల కాగితం తీశారు. "చూడండి, అబ్బాయిలూ! మీలో ఒక్కొక్కళ్ళు నన్ను అయిదేసి ప్రశ్నలడగడానికి అవకాశమిస్తున్నాను. మీలో ఆశక్తి ఏముందో తెలిసికోవాలని వుంది. నేను జవాబు చెప్పలేని ప్రశ్న ఏ ఒక్కటయినా అడగగలిగిన వానికి ఈ అయిదు రూపాయలూ బహుమతిగా ఇస్తాను. ముందుకొచ్చి ధైర్యంగా అడగండి." అని మళ్ళీ ప్రోత్సహించారు.

అప్పటికీ ఎవరూ ముందుకు రాక పోయేసరికి ఆయనే, ఒక మూలన కూర్చున్న వెంకటేశాన్ని నిల్చోబెట్టి, "నీకు తోచిన ప్రశ్న అడుగు



మరేం భయంలేదు" అని ధైర్యం చెప్పేరు.

ఈ పిడుగు తనమీదే పడ్డందుకు వాడు అదిరిపోయి, తప్పనిసరి కావడంవల్ల అవకతవక ప్రశ్నలేవో అడిగేసి, 'బ్రతుకు జీవుడా!' అన్నట్లు చతికిలబడిపోయాడు. ఇనస్పెక్టరుగారు అంత మాత్రానికే తృప్తిపడిపోయి వాడి ప్రశ్నలన్నిటికీ జవాబులు చెప్పేశారు.

ఇంతలో మెరుపులాగ నాకో ఆలోచన తట్టింది. లేచి నిల్చుని "నే నడుగుతానండీ!" అన్నాను.

"అదీ, అలా ముందుకు రావాలి. అడుగు" అన్నారు.

"మీరు జవాబు చెప్పలేని ప్రశ్న వేస్తే ఆ అయిదు రూపాయలూ నాకిచ్చేస్తారా? అన్నాను.

"అలాగే" అన్నారాయన.

"తప్పకుండా ఇస్తారా?" అన్నాను. ఈ ప్రశ్నకు హెడ్మాస్టారు నావైపు కొంచెం కోపంగా చూశారు.

"తప్పకుండా ఇస్తానన్నానుగా. అప్పుడే రెండు ప్రశ్నలయిపోయాయి చూశావా? మిగిలిన మూడూ అడిగేసెయ్!" అన్నారు ఇనస్పెక్టరుగారు. తొణకని వెంటా చెక్కు ప్రశ్నలనే ఖాతాన్ని కదబరుస్తూ—

"మీరు జవాబుచెప్పలేని ప్రశ్న ఏదో చెప్పండి. ఇదే నా మూడో ప్రశ్న" అన్నాను.

ఈ ప్రశ్నతో ఆయన కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా వుండిపోయారు. తరువాత గడగడ్డరిల్లిపోతోంలా నవ్వుతూ నాదగ్గరగా వచ్చారు. "నీ పేరేమిటి బాబూ!" అన్నారు.

"వేమూరి శ్రీరామ్. మాఅమ్మా నాన్నగారూ 'రాముడూ!'—అని పిలుస్తారు. అన్నాను, దర్జాగా.

"శబాష్, రాముడూ! ఇది నీకు బహుమానంగా ఇస్తున్నాను. తీసుకో." అంటూ అయిదురూపాయల కాగితం నాచేతులో పెట్టారు.

ఇనస్పెక్టరుగారు వెళ్ళిపోయాక హెడ్మాస్టారు నన్నడిగారు "ఏమిరా, మీకూ, మీకూ, ఏదయినా చుట్టరికం ఉందేమిట్రా. బహుమానం నీకిచ్చి వెళ్ళిపోయారు?"

"అబ్బె అదేం లేదండి మేస్టారూ! తను జవాబు చెప్పలేని ప్రశ్న ఏమిటని, నా మూడో ప్రశ్న కింద అడిగేను. అదేమిటో తెలుసుకున్నాక, అదే నాల్గో ప్రశ్నగా అడుగుతా నన్నమాట!" అన్నాను.

"భలేరా, రాముడూ! భలే. మన స్కూలు పేరు నిలబెట్టేవు" అన్నారు హెడ్మాస్టారు నాబుజంతడుముతూ. ★




"రామయ్యా!"

"అయ్యా!"

'ఇదుగో నేను పనిమీద వెడుతున్నాను గాని, తిరిగి వచ్చేటప్పటికి వంట చేసి సిద్ధంగా ఉంచు. పులుసు మాత్రం మర్చేపోకు."

"చిత్తం. అలాగేనండి."

పులుసు సంగతి ఇంకో సారి హెచ్చరించి యజమాని గుర్రపుబండీ ఎక్కి పని మీద వెళ్ళి పోయాడు. రామయ్య వంటింట్లోకి వెళ్ళాడు.

వంటలో రామయ్యను మించిన చెయ్యి లేదని ఆ చుట్టుపక్కల ఇరవైయూళ్ళ వాళ్ళు ఘనంగా చెప్పకుంటారు. అందుకనే అతన్ని వంటకు పెట్టుకోవాలని ధనవంతులంతా ఎగబడతారు. మేమెక్కువిస్తామంటే మేమెక్కువిస్తామని పోటీలు పడతారు. కాని రామయ్య ఎవరెంతిస్తామన్నా లోబడలేదు. మొదటినుంచి తన్ను చేరదీసి ఆదరించి ఉద్యోగమిచ్చిన ఆసామీనే అంటిపెట్టుకుని ఉన్నాడు.

రామయ్య ఆడుతూ పాడుతూ వంట ప్రారంభించాడు. అతని వంట రుచి చూసినవాళ్ళు వంట అనేది ఒక గొప్ప కళ అని నమ్మేస్తారు. అది అందరికీ చేతనయ్యేది కాదనీ, నేర్చుకుంటే వచ్చేది కాదనీ, పుట్టుకతో రావలసిందేనని ఢంకా బజాయించి చెబుతారు. అందుచేతే అతడు వంట చేస్తుంటే ఆ వంటశాలాంతా కమ్మని వాసనలు ఆ చుట్టుపక్కల ఇళ్ళక్కూడా వ్యాపించి అందరికీ నోరూరిస్తాయి. 'అయ్యో అటువంటి వంట రుచి చూసే భాగ్యం లేకపోయిందే' అని దిగులుపడేట్టు చేస్తాయి. ముఖ్యంగా అతడు పులుసు చేస్తే రుచి చూసి తీరాల్సిందే. ఆ పులుసు వాసనలు అతని కీర్తిని దిశదిశలా వ్యాపింపజేస్తాయి.

ఆ రోజున అతనికి పులుసు మరీ దివ్యంగా కుదిరింది. బజారు నించి బోలెడు కూరలు కొనుక్కొచ్చాడు. అన్నీ తరిగి పులుసులో వేశాడు. దాంతో పులుసు ఘుమాయించటం మొదలుపెట్టింది. ఆ ఘుమఘుమకు రామయ్యే తట్టుకోలేకపోయాడు. అతడు ఆ వాసన పీలుస్తూ తన్మయత్వంలోపడి ఏదేదో ఆలోచిస్తూ కూచ్చుండిపోయాడు.

ఇంతలో ఎవరో అతని పక్కన ఉన్నట్లనిపించింది. పక్కకి తిరిగి చూశాడు. ఒక చిన్న మనిషి కనిపించాడు. భూమికి జానెడెత్తున ఉన్నాడు. ఆ మాయమనిషి "రామయ్యా" అని పిలిచాడు.

"ఎవరు నువ్వు?" అని రామయ్య ఆశ్చర్యపోతూ అడిగాడు.

"నేను ఈ ఇంట్లోనే ఉంటున్నాను. సరిగ్గా చెప్పాలంటే ఇంటి కింద ఉంటున్నాను. రోజూ నీ వంట వాసన చూసి పిచ్చెక్కిపోతున్నాననుకో. ఇవ్వాళ నీపులుసు వాసనచూచి భరించలేక వచ్చేశాను. కాస్త రుచి చూడనిద్దూ, పుణ్యం ఉంటుంది," అన్నాడా మాయమనిషి.

"అమ్మో. ఈ పులుసు రుచిచూపించటమే. మా యజమానికి పెట్టకుండా నేనే ముట్టుకోను," అన్నాడు రామయ్య.

"ఫరవాలేదు. కొంచెంపెట్టు. లేకపోతే ఇక్కడే నీ ఎదురుగా ప్రాణాలు వదిలేస్తాను. అనవసరంగా జీవహింస ఎందుకు చేస్తావు?" అన్నాడు మాయమనిషి.

"పోనీలే. ఇంత ప్రాధేయపడుతుంటే ఎందుకివ్వకూడదు? కాస్త ఇస్తే ఏం పోయిందీ?" అనుకున్నాడు రామయ్య.

ఒక గరిటెతో తీసి కాస్త పులుసు ఒక గిన్నెలో పోసి ఇచ్చాడు. అలా ఇచ్చాడో లేదో మాయమనిషి మొత్తం పులుసుతో సహా మాయమైపోయాడు.

రామయ్య నిర్ఘాంతపోయాడు. యజమాని రాగానే, ఏడుస్తూ జరిగినదంతా చెప్పాడు.

మాయమనిషి వచ్చి పులుసంతా ఎత్తుకుపోయాడంటే ఎవరు నమ్ముతారు? రామయ్యే పులుసంతా తినేసి ఉంటాడని యజమాని అనుకున్నాడు. మరోటీ మరోటీ కాదయ్యే. తనకి చాలా ఇష్టమైన పులుసే పోయిందనేటప్పటికి యజమానికి చెడ్డకోపం వచ్చింది.

రామయ్యను నానా బూతులు తిట్టాడు. "రాత్రికైనా పులుసు వండి జాగ్రత్తగా ఉంచు" అని ఆజ్ఞాపించాడు.

రామయ్య ఆ రాత్రి మళ్ళీ పులుసు చేశాడు. పొద్దుటికంటే అద్భుతంగా వండాడు. వండుతూ ఉన్న సమయానికి మళ్ళీ మాయ మనిషి వచ్చాడు.

"రామయ్యా!" అని పిలిచాడు

"ఏమయ్యా!" అన్నాడు రామయ్య.

"ఏం లేదయ్యా. పొద్దున నువ్విచ్చిన పులుసుపోసుకుని అన్నం తిని తరించాననుకో. ఏమిటయ్యా, ఇంత అమోఘంగా వండిపారేస్తున్నావ్ పులుసు! నీకెక్కడి నుంచి వచ్చిందయ్యా ఇంత నేర్పు?" అన్నాడు మాయమనిషి.

ఈ పొగడ్తకి రామయ్య సిగ్గుపడిపోతూ "ఆ, ఏదో, అలా వండేస్తూ ఉంటాను. హి హి" అని నసిగాడు.

"ఏదీ మళ్ళీ కొంచెం పెట్టు, రుచి చూస్తాను" అన్నాడు మాయమనిషి.

"పొద్దుటిలాగా అంతా ఎత్తుకుపోవుగదా" అన్నాడు రామయ్య.

"ఛా. అంతా ఎందుకోయ్. కొంచెం తింటే చాలదూ. పొద్దుటంటే కొత్తగనుక అంతా తినెయ్యాలని ఆబగా తీసుకుపోయాను," అన్నాడు మాయమనిషి.

"సరే, ఇంద" అని రామయ్య ఒక గిన్నెలో పోసి ఇచ్చాడు. ఇచ్చాడో లేదో మొత్తం పులుసంతా తీసుకుని మాయమయ్యాడు మాయమనిషి.

రామయ్య లబోదిబో మంటూ యజమానితో చెప్పాడు జరిగిన




ఆ మాయమనిషి "రామయ్యా!" అని పిలిచాడు.

సంగతి. యజమానికీసారి పట్టరాని కోపం వచ్చింది. రామయ్య తనే అంతా మెక్కి అబద్ధమాడుతున్నాడని యజమాని అనుకున్నాడు.

"ఛీ. నాయింట్లోంచి పో. ఏదో మంచివాడివనుకున్నాను గాని, ఇంత అబద్ధాలకోరువనీ, మోసగాడివనీ అనుకోలేదు. పో. రేపు పొద్దున ఈ యింట్లో కనిపించావంటే డొక్క చీల్చేస్తాను," అని యజమాని కసిరాడు

వెంటనే తోటలో పని చేసే వెంకయ్యని పిలుచుకొచ్చి పులుసు చెయ్యమని, అంతా కాగానే భోజనం వడ్డించి పిలవమనీ యజమాని ఆజ్ఞాపించాడు. మాయమనుషులూ, గీయమనుషులూ వస్తే నెత్తిమీద ఒకటిచ్చుకో," అని నవ్వుతూ చెప్పాడు. "అలాగే నండి" అని వెంకయ్య కూడా నవ్వాడు.

వెంకయ్య పులుసు చేయటం మొదలుపెట్టాడు. అతడికి పులుసే కాదు వంటపని ఏదీ చేతకాదు. అందుచేత పులుసు ఘుమాయించటానికి బదులు కంపు కొట్టడం మొదలెట్టింది.

ఇంతలో మాయమనిషి వచ్చాడు. వాసన భరించలేక ముక్కు మూసుకుని "వెంకయ్యా!" అని పిలిచాడు.

"వచ్చావా బాబూ, రా, పులుసు పెడతానురా" అని వెంకయ్య చేతులోని గరిటతో మాయమనిషి నెత్తిమీద తపీమని కొట్టాడు. దెబ్బ గట్టిగా తగిలింది. 'అబ్బా' అని ఒక చేత్తో నెత్తిపట్టుకుని, ఇంకో చేత్తో ముక్కుపట్టుకుని మాయమయ్యాడు మాయమనిషి.

యజమాని ఆ రాత్రి అన్నం తింటూ, రామయ్యమీద కోపం కొద్దీ ఆ పులుసే పోసుకుని "చాలా బాగుం"దని కూడా మెచ్చుకున్నాడు - రామయ్యకు ఎవరూ అన్నం పెట్టలేదు. తను చేసిన సేవకు ఇదా ప్రతిఫలం అని విచారపడ్డాడు. తన మాటామల్లె నర్దుకుని ఆ రాత్రికి రాత్రే ఇల్లు విడిచిపెట్టి పోదామని బయటికి వచ్చాడు.

వాకిట్లో అతనికి మాయమనిషి ఎదురుపడ్డాడు. "రామయ్యా! నా

 # మాయమనిషి 

రూలాన నీకు ఇంత కష్టం వచ్చింది. నువ్వు పెట్టిన పులుసురుచి నేను ఎప్పటికీ మరిచిపోలేను. ప్రతిఫలంగా నీకేదైనా ఇవ్వాలనుకుంటున్నాను. ఇదుగో ఈ చిన్న దంతపుపెట్టి తీసుకో. నీకేదైనా కావలసివస్తే ఈ పెట్టె మూత తెరిచి అడుగు. వెంటనే ఏది కావలిస్తే అది వచ్చేస్తుంది," అని చెప్పి మాయమయ్యాడు మాయమనిషి.

రామయ్య పొద్దునా ఏమీ తినలేదు, రాత్రీ ఏమీ తినలేదు. మంచి ఆకలిమీదున్నాడు. అందుకని వెంటనే పెట్టెమూత తెరచి "నాకు అన్నం కావాలి," అన్నాడు.

వెంటనే అతని ఎదుట పంచభక్ష్యపరమాన్నాలతో నిండిన వెండిపళ్లెం ప్రత్యక్షమైంది. వీధిలో అరుగుమీద ఆ పళ్లెం పెట్టుకుని రామయ్య గబగబా తినేశాడు.

ఇంతలోనే విస్తళ్ళు పారెయ్యటానికి వీధిలోకి వచ్చిన వెంకయ్య అది చూశాడు. వెండిపళ్లెం చూసి గుండెలు బాదుకున్నాడు. 'ఎక్కడిది నీకది?' అని అడిగాడు. రామయ్య తనకు మాయమనిషి ఇచ్చిన దంతపు పెట్టి చూపించి "ఇందులోంచి వచ్చింది" అన్నాడు.

"ఏడిశావ్ వచ్చి అబద్ధాలు. ఇంట్లోంచి ఎత్తుకుపోతున్నావ్! యజమానితో చెబుతానుండు" అన్నాడు వెంకయ్య.

"నిజం వెంకయ్యా! కావలిస్తే నీ ఎదురుగానే నేను కావలసింది కోరుకుని తెప్పిస్తాను చూడు" అన్నాడు రామయ్య.

పెట్టెమూత తెరిచి "నేనిక్కడి నుంచీ వెళ్ళిపోవటానికి మంచి గుర్రాల బండి కావాలి" అని కోరుకున్నాడు.

చూస్తూ ఉండగానే రెండు గుర్రాలు కట్టిన అందమైన బండి వచ్చింది. రామయ్య అందులో ఎక్కి కూర్చున్నాడు. "వెంకయ్యా! ఇప్పుడైనా నమ్ముతావా నేను చెప్పింది నిజమని. ఇదుగో, ఈ పళ్ళెం తీసుకో" అని వెండిపళ్ళెం వెంకయ్య మీదికి గిరాటేసి "ఛల్" మన్నాడు. గుర్రపుబండి కదలి పరుగు తీసింది.

వెంకయ్య ఇదంతా చూసి తను కూడా అలాంటి పెట్టె సంపాదించాలనుకున్నాడు. ఆ రాత్రి యజమాని నిద్రపోగానే నెమ్మదిగా వంటింట్లోకి దూరి అప్పటికప్పుడు పులుసు వండటం మొదలుపెట్టాడు. బోలెడు కూరలు తరిగి పులుసులో వేశాడు. తొందరకొద్దీ అవి ఉడక్కుండానే పోపువేసి పులుసు గిన్నెదింపేశాడు. మాయమనిషి వస్తాడేమోనని ఎదురుచూశాడు. ఎంతసేపటికీ రాకపోయేసరికి నేలమీద గరిటెతో కొడుతూ "మాయమనిషీ! రా, నీకోసం పులుసు వండాను" అని పిలిచాడు.

హఠాత్తుగా మాయమనిషి ప్రత్యక్షమయ్యాడు.

ఏం పిలిచావు?" అని అడిగాడు.

"కాస్త పులుసు రుచిచూస్తావేమోనని" అన్నాడు వెంకయ్య.

"ఇప్పుడేం పులుసు అర్థరాత్రి వేళ? ఇందాకే తిన్నాను రామయ్య



వెండిపళ్లెం వెంకయ్యమీదికి గిరాటేసి 'ఛల్' మన్నాడు. గుర్రపు బండికదిలి పరుగుతీసింది.




పెట్టిన అద్భుతఫులుసు. కడుపు నిండిపోయింది," అన్నాడు మాయ మనిషి.

"ఫరవా లేదు. నా పులుసు కూడా కాస్త పోసుకో. తింటే వదిలి పెట్టవు" అన్నాడు వెంకయ్య.

"సరే"నని మాయమనిషి కాస్త పులుసు రుచి చూశాడు. తుపుక్కున ఉమ్మేశాడు.

"బాగానే ఉందిగాని, ఇప్పుడు తినలేను. నన్ను ఇంత ఆదరంగా పిలిచినందుకు నీకేదైనా బహుమాన మిస్తాను..." అన్నాడు మాయ మనిషి.

"మరోటీ మరోటి ఎందుకు? రామయ్యకిచ్చిన దంతపుపెట్టెలాంటిది చాలు" అన్నాడు వెంకయ్య.

"సరే, తీసుకో" అని మాయ మనిషి ఒక దంతపుపెట్టె అతని చేతిలో పెట్టి మాయమయ్యాడు.

వెంకయ్య సంతోషంతో ఆ పెట్టె తీసుకుని వంటింటి తలుపులు మూసి చావిట్లోకి వచ్చాడు.

పెట్టె తెరిచి "నాకు బోల్డు డబ్బు కావాలి" అన్నాడు.

అతను ఆ మాటలు పూర్తి చెయ్యకముందే పెట్టెలోంచి ఒక కొరడా వచ్చింది. వెంకయ్యను చెళ్ చెళ్ మని బాదటం మొదలుపెట్టింది.

"బాబోయ్ నాయనోయ్" అంటూ వెంకయ్య అటూ ఇటూ పరిగెత్త సాగాడు. అతడెటు పోతే అటు ఆ కొరడా వెంటపడి కొడుతోంది. ఈ గోల విని యజమాని లేచి చావిట్లోకి వచ్చాడు. కొరడా గభాలున అటు తిరిగి యజమానిని కూడా చావకొట్ట సాగింది. ఇద్దరూ గంతు లేస్తూ ఏడవటం మొదలెట్టారు. చాలా సేపైన తరవాత కొరడా కొట్టి కొట్టి మాయమైపోయింది. వెంకయ్యకీ, యజమానికీ వళ్ళంతా పచ్చిపుండయిపోయింది. వెంకయ్య దంతపుపెట్టెని తీసుకుపోయి నూతులో గిరాటేశాడు.

ఆనాటినుంచీ మాయమనిషి ఆ యింట్లో ఎప్పుడూ రాలేదు.

నీతి:- వంట చేస్తున్నప్పుడు మాయమనిషివచ్చి పులుసు కావాలని అడిగితే లేదనకుండా ఇవ్వాలి. అలా ఇచ్చిన వాళ్ళకే దంతపుపెట్టెలు దొరుకుతాయి. ★


పండగకి నీకేం కావాలి?




















# ఆంధ్రసచిత్రవారపత్రిక
# బాలల సంఘం

బాలల సంఘంలో సభ్యులుగా చేరాలని కుతూహలపడుతున్నామని, దరఖాస్తు ఫారం కావాలని బాలబాలికలనేకులు ఉత్తరాలు వ్రాస్తున్నారు. అందుచేత ఈ సంచిక నుంచీ మళ్ళీ దరఖాస్తు ఫారం ప్రకటిస్తున్నాము. ఈ అవకాశం వినియోగించుకుని బాలురు, బాలికలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘంలో సభ్యులుగా చేరుతారని ఆశిస్తున్నాం. 15ఏళ్ళు దాటని వారెవరైనా ఈ సంఘంలో చేరవచ్చు. ప్రవేశరుసుము ఏమీ లేదు. బాలల కోసం అప్పుడప్పుడు మేము నిర్వహించే రకరకాల పోటీలలో బాలల సంఘం సభ్యులందరూ పాల్గొనవచ్చు.

వయసును బట్టి సభ్యులను రెండు వర్గాలుగా విభజించాము. అయిదేళ్ళ పైన, పదేళ్ళలోపు వయసు గల వారు 'బి' వర్గం సభ్యులు. పదేళ్ళ పైన పదిహేనేళ్ళలోపు వయస్సు గల వారు 'ఎ' వర్గం సభ్యులు. సభ్యులుగా చేరదలచిన వారు ఈ క్రింది దరఖాస్తు కూపన్ పూర్తి చేసి "బాలల సంఘం, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 6 & 7 తంబుచెట్టి వీధి, మద్రాసు-1" అనే చిరునామాకు పంపించాలి. వారం వారం దరఖాస్తు అడుగున సూచించిన తేదీలోగా వచ్చిన కూపనులే చెల్లుతాయి.

దరఖాస్తు మాకు చేరిన తరవాత కొద్దిరోజులలోగా సభ్యత్వపు కార్డు పంపిస్తాము. దానిని సభ్యులు జాగ్రత్తగా దాచుకుని, పోటీలలో పాల్గొనేటప్పుడు, ఇతర ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేటప్పుడు అందులోని సభ్యత్వపు సంఖ్య, వర్గం ఉదహరిస్తూ వ్రాయాలి. 'బి'వర్గంలో చేరిన సభ్యులు పదేళ్ళు దాటగానే 'ఎ' వర్గంలో ప్రవేశించినట్లు 'ఎ' వర్గం సభ్యులు 15ఏళ్ళు దాటగానే సభ్యత్వం రద్దయినట్లు గమనించాలి.

---

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**
**బాలల సంఘం**

GROUP
A లేక B

[సభ్యత్వపు దరఖాస్తు]

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం: వయస్సు ....
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు: ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి. నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, ఫారము: ....
పాఠశాల పేరు: ....
ఉపాధ్యాయుని పేరు (తెలిస్తే)

అయ్యా:

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొనప్రార్థన. పైన వ్రాసిన వివరాలన్నీ యదార్థములు.

ఇట్లు

తేదీ: -1959

(సంతకము)

* సూచన: [illegible] ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే దానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: 21-10-59 | ఈ దరఖాస్తు 24-10-59 నాటికి మాకు చేరాలి

# మా స్కూలు

(బాలలసంఘం 'బి' వర్గం పోటీలో
కన్సొలేషన్ బహుమతిపొందిన వ్యాసం)

మా స్కూలు విశాఖపట్నం డాబా తోటలో లలితా కాలనీలో ఉంది. దాని చుట్టూ బోలెడన్ని పూల మొక్కలున్నాయి. నేను రోజూ రెండుపూలు కోసి మా మేష్టారి కిస్తూంటాను.

మా స్కూలంతా కలిసి మేడ మీద ఒక గది. అందులో ఉన్నది ఒక్కటే తరగతి. అది ఆరోతరగతి. స్కూలంతకి ఒక్కరే మేష్టారు. అన్నీ ఆయనే చెబుతారు. మేష్టారికి పిల్లలకి కూర్చుందుకూ, రాసుకునేందుకూ కూడ ఒక తుంగచాప.

మా స్కూలు పొద్దున్న 8 గం॥ నుంచి 9 గం॥ వరకే. బడికి మొదటి గంట, "అమ్మాయి, మేష్టారొచ్చారు," అని మా అమ్మ పెట్టే గావుకేక. రెండోగంట మా నాన్నగారు మా స్కూలుగదిలో గడ్డం గీసుకుంటూ, "అమ్మాయి, మేష్టారొచ్చి పావుగంట అయింది" అని బ్లేడు తెగటంచేత ఆ మంటలో అరిచే అరుపు. మూడవగంట మా మేష్టారు, "ఏం లక్ష్మి అప్పుడే 8-30అయింది, ఇంకా రావేం," అని టైం అయిపోతూన్న తొందరలో చేసే హడావిడి. ఈ మూడోగంటతో పాఠాలు ప్రారంభం అవుతాయి. ఒకఅరగంట పోయాక మా అమ్మ, "అమ్మాయి ఓ మాటిలా కిందకిరా, మళ్లీ ఇప్పుడే వెళ్లిపోదువుగాని," అని పోటు బెల్లు కొడుతుంది. ఇంకాస్సేపయాక "ఇంక చాల్లే ఈరోజుకి," అని మా మేష్టారు ఆఖరుగంట కొట్టేసి, తిరిగి చూడకుండా వెళ్ళిపోతారు. దాంతో మా స్కూలు మూసేస్తారు. మా స్కూలు

---

భమిడిపాటి సుబ్బలక్ష్మి
(వాల్తేరు)

---

బట్రోతు మా తమ్ముడు నా దగ్గర ఒక బిళ్ళ పుచ్చుకుని నా పుస్తకాలు సర్ది పెడతాడు.

మా బడి అంటె నా కెంతో యిష్టం. ఇంచక్కా పరీక్షలుండవు. కాని నెలకోమాటు ఇనస్పెక్షన్ ఉంటుంది. అది, "ఏం మేష్టారూ, మా అమ్మాయి ఏమైనా చదువుతోందా లేకపోతే ఊరికే పుస్తకాలకోసం పేచీలతో సరా?" అని మా నాన్నగారు నెలాఖరున డబ్బిచ్చేటప్పుడు మా మేష్టార్ని అడిగే ప్రశ్న.

మా స్కూలు పేరేమిటో తెలుసా? "సుబ్బలక్ష్మి పాఠశాల" అందులో మరి నేనొక్కదాన్నేగా చదువుకునేదాన్ని? ప్రైవేటు స్టడీ. మా స్కూల్లో మీరూ అంతా చేరతారా? ★




చిత్రం: నేతులూరు లక్ష్మయ్య, వేలూరు.





సాహిణీవారి 'బండరాముడు' చిత్రంలో రేలంగి, రాజనాల, రామారావు, సావిత్రి.

ముదిగొండవారు సహనటులు. ఈ చిత్రానికి హాస్యరసభరిత సంభాషణలు కూర్చిన రచయిత ఆరుద్ర. పాటలు శ్రీశ్రీ, ఆరుద్ర, కొసరాజు వ్రాశారు. సంగీత దర్శకుడు చలపతిరావు. ఛాయాగ్రహణ దర్శకుడు విన్సెంట్.

అనుమోలు సుబ్బారావు నిర్మించిన ఈ చిత్రాన్ని నవయుగ ఫిలింస్ వారు విడుదల చేశారు.

## రౌతూ పిక్చర్స్

రవుతూ పిక్చర్స్ వారి తొలిచిత్రం 'నిత్య కల్యాణం పచ్చతోరణం' చురుకుగా తయారవుతోంది; చలం, కృష్ణకుమారి, హేమలత, గుమ్మడి, రామకృష్ణ, సి. ఎస్. ఆర్, రమణారెడ్డి, నల్లరామమూర్తి నటిస్తున్నారు. సంభాషణల రచన, దర్శకత్వం పినిశెట్టి శ్రీరామమూర్తి నిర్వహిస్తున్నారు. పాటలు ఆరుద్ర వ్రాస్తున్నారు. సంగీతం పెండ్యాల.

## జగన్నాటకం

పద్మశ్రీ ఫిలింస్ వారి పౌరాణికం 'జగన్నాటకం' త్వరలో విడుదలకు సిద్ధం అవుతోంది. అమర్‌నాథ్, కృష్ణకుమారి, గిరిజ, కే. వి. ఆర్. నాగేశ్వరరావు మొదలగువారు నటించిన ఈ చిత్రానికి శోభనరావు దర్శకుడు. రచయిత రాజ్‌చంద్. నిర్మాత రామకృష్ణారెడ్డి.

దీని తరువాత 'ప్రమీలార్జునీయం' కథను భారీఎత్తున నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు.

## వచ్చిన కోడలు

సుధాకర్ ఫిలింస్ వారి సాంఘిక చిత్రం 'వచ్చినకోడలు నచ్చింది' ఈ నెల 16 న విడుదల అవుతోంది. జమున, కన్నాంబ, ఎన్. టి. రామారావు, రేలంగి, సి. ఎస్. ఆర్, రాజనాల మొదలగువారు నటించారు. రచయిత ఆత్రేయ. దర్శకుడు హేగానంద్.

## రామమ్మ కథ

తాతిక గోపాల్ ప్రొడక్షన్స్ వారు, తమ ద్వితీయ చిత్రం 'రామమ్మ కథ' నిర్మాణం పాటలతో ఆరంభిస్తున్నారు. దీనికి మాటలు, పాటలు శాస్త్రి, పద్యాలూ కొటసత్య రంగయ్య స్వామి వ్రాస్తున్నారు. దర్శకుడు ఎస్. వి.

## ఉత్తరదిగ్విజయం

బొంబాయి నగరంలోని చలనచిత్ర విమర్శకుల హిందీ సంగీత జై, ఈ సంవత్సరం ఉత్తమ అధిపతి, సుదర్శకుడుగా ... జలీకి ... అయిన ఆదినారా ... సంగీత రచయి ... చి గళహారం సత్కరించారు. తెలుగు సువర్ణసుందరిలాగే హిందీలో నిర్మించిన సువర్ణసుందరి చిత్రంకూడా ఉత్తర భారతంలో విజయవంతంగా నడచి బహుళ జనాదరణ పొందింది. అక్కడా, తెలుగునాటా కూడా ఆ చిత్రం విజయవంతం కావడానికి తోడ్పడిన వాటిలో సంగీతం ఒక ముఖ్యాంశం. హిందీ చిత్రంలో పాటలు దాదాపు అన్నీ 'హిట్'లు అనబడ్డాయి. దాక్షిణాత్యులు ఉత్తరాదివారిని అనుకరించడానికే ఎక్కువ పనికొస్తారని మన నిర్మాతల కున్న అభిప్రాయానికి ఆదినారాయణరావు ఉత్తరాదిన ఇలా ఎన్నిక కావడం ఒక పెద్ద సమాధానం...

## బహుమతులు

బొంబాయి ఫిలిం విమర్శకుల సంఘం బహుమతులలో మధుమతి (బిమల్ రాయ్) చిత్రం పదింటిని అందుకుంది. ఉత్తమ చిత్రంగా తలాక్ ఎన్నిక అయింది. మధుమతిలోని ఆజారే పాట పాడిన లతా మంగేష్కర్, సుహానా సఫర్ పాట పాడిన ముఖేష్ ఉత్తమ గాయకులుగా ఎన్నిక అయ్యారు. ఉత్తమ నటీనటులుగా నూతన్, (సోనేకీ చిడియా) రాజ్ కపూర్ (ఫిర్ సుబహోగీ) ఎన్నిక అయ్యారు. ఉత్తమ దర్శకుడుగా బిమల్ రాయ్ మధుమతికి బహుమతి అందుకొన్నారు. 



'బాలనాగమ్మ' చిత్రంలో బాలవర్ధిరాజుగా మాస్టర్ సత్యనారాయణ, మాయల మరాఠీగా రంగారావు.

## చిత్రసమీక్ష:

# బాలనాగమ్మ

కాలంనాడు జనం విరగబడి చూసిన చిత్రాలను మళ్ళీ కొన్నాళ్ళకి తీసినప్పుడు— తరాదిగా ఇందమ్మటా కూడా సెక్సార్ షరీఫ్ కట్టు మీద తారీకు విడిచి కొత్తదేదీ ఉండక ప్రొడక్షన్స ఖర్చు తప్పవిడిచి పెరిగింది ఉండదనీ ఈ తరహా చిత్రాలు చూచినప్పుడు తరుచుగా అనిపిస్తుందన్నమాట తరుచు విని పిస్తూనే ఉంటూంది. శ్రీ వెంకటరమణా వారి కొత్త 'బాలనాగమ్మ' చిత్రంలో మొదటి అరగంటా ఇంచుమించు ఈ మాటే అనిపిస్తుంది. పాత బాలనాగమ్మ కన్న ఇదేం బావుందనికూడా అనిపిస్తుంది పాత దానిమీద అభిమానం ఎక్కువ వుండేవారికి. ఇలా అనుకుంటున్న వారందరూ ఆ అరగంట తరవాత, తెర మీద మాయల మరాఠీ కనబడ్డ ఐదు నిముషాలకల్లా అభిప్రాయం మార్చుకుంటారు. ఇన్నాళ్ళకి ఇంకోసారి తిరిగి ఈ కథను తీసినందుకు, ఈ కృషిని సమర్థించి వారికి తగ్గ విధంగా మిగతా చిత్రాన్ని దర్శకుడు రాఘవయ్య, రచయిత సముద్రాల జూనియర్, నటుడు రంగారావు తీర్చిదిద్దారు.

జెమినీవారి 'బాలనాగమ్మ', అందులో మరాఠీ డా॥ గోవిందరాజు సుబ్బారావు ఆనాడు ప్రేక్షకుడి గుండె ఝల్లుమనిపించ చేయడం జరిగింది. ఈ నాటి అందుకు భిన్నమైన రీతిన సరికొత్త శిల్పంగా మలచిన కొత్తమరాఠీ పది నిముషాలలో మనకి ఆహ్లాదం కలిగించి, గౌరవాభిమానాలు చూరగొంటాడు. ఇతను మరట్టి విద్యాంసుడు. సంగీత ప్రియుడు, దారసికుడు. బహుసరసుడు. లోకంలో అన్ని చీలన్నింటినీ కనీ వినీ అనుభవించి వృద్ధి ఆనందించడం అతని మతం. మానవ జాతికి లోని సౌందర్యాభిరుచికీ, మెచ్చించు అతడు రూపకల్పన. సిద్ధులు గడించి మూడుగా మిం చిరంజీవి అయి శతాబ్దాలకి జరా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ మానవుడై మృత్యువులకు అతీతుడై నిత్యం ఆ సిద్ధుడికి ప్రహస్తున్నాడు. అజేయుడై తీవ్రతే జోలికి ఆశ్రయం కలిగించినది పక్కవాడికి, మద్యం పాలన్న బుద్ధి. అంతయోగ బుద్ధికీ మైకం కల్పనానికీ మోహాంకాల నందడం అనేది కవి అతడు పతనం చిత్రించడంవల్ల హాస్యంగా కట్టుదిటంగా శాస్త్రత, కొత్తదనం అ

పాపానికి ఒడిగట్టినా, మరాఠీమీద మనకు కోపంకన్న జాలి, సానుభూతి కలుగుతాయి. మరాఠీ చనిపోవడం కూడా కొండాగా దర్జాగా ఒప్పింది. ఈవిధంగా ఇంత నిండుగా ఎత్తుగా నిర్మించిన పాత్ర పక్కన నటుడు రంగరావు అంతర్జాగానూ నిలబడి దానిని సముగడి సౌలభ్యంతో, చా ర్యంతో నడిపాడు. రచయిత సముద్రాల జూనియర్ అందుకు తగ్గస్థాయిలో చక్కని సంభాషణలు సమకూర్చగలిగాడు. చాలా కాలానికి తొలిసారిగా ఒక జానపద చిత్రంలో అర్థం అందం సమకూరిన ఒకపాత్ర దర్శనం ఇచ్చింది.

మిగతా బాలనాగమ్మ కథా కమామిషూ, పాతివ్రత్యమాహాత్మ్యమూ, సవతితల్లి పిల్లల్ని బాధించుట, సీయస్సార్ రాజుగా నటించుట, కుటుంబరావు చాకలి తిప్పడుగానూ పూర్వం తిప్పడివేషం వేసిన లంక సత్యం ఆనాటి ముచ్చటలు నెమరువేసుకుంటూ రాజుగానూ అభినయించుటా ఉన్నాయి. తలారి రాముడుగా రేలంగి హుషారుగా నటించాడు. మాటలతోటి మనుషులతోటి కూడా ఆయన హాయిగా ఆడుకుని మనని ఆనందపరచాడు.

చిత్రాన్ని ఎన్. టి. రామారావు, రాజసులోచన ప్రభృతులతో—అలంకరించారు. రామారావుకు అంతకుమించిన అవకాశం ఇందులో లేదు. సంగుగా నటించిన రాజసులోచన ఏ కాశ్మీరివో అనుకుంటే, ఆమె తెలుగు మనని బాధించదు సరికదా అలరిస్తుంది. బాలనాగమ్మగా అంజలీదేవి పాత్ర, పాతకథాప్రకారంగానే ఉంది. యథాప్రకారం ఆమె యథోచితంగా నటించింది.

సెట్లు చాలా పెద్దవి, అందమైనవీ, కానివీ, మరాఠీ గుహలో భయంకరమైనవీ చాలా ఉన్నాయి. మరాఠీ విలాసమందిరం రమణీయంగా ఉంది. ఛాయాగ్రహణం, మాయా ఛాయాగ్రహణం కూడా బాగున్నాయి.

నటులు: ఎస్. వి. రంగారావు, అంజలీదేవి, ఎన్. టి. రామారావు, రేలంగి, రాజసులోచన, సూర్యకళ, సీత, హేమలత. సి. ఎస్. ఆర్, ఎ. వి. సుబ్బారావు, చదలవాడ కుటుంబరావు, లంక సత్యం, మాస్టర్ సత్యనారాయణ.

కథ, మాటలూ, పాటలూ: సముద్రాల రామానుజం. సంగీతం టి. వి. రాజు. నృత్యాలు వెంపటి సత్యం, కళ వాలి. ఛాయాగ్రహణం సి. నాగేశ్వరరావు. దర్శకత్వం వేదాంతం రాఘవయ్య. నిర్మాణం: డి. ఎన్. రాజు, ఎస్. ఎన్. రాజు, పి. వెంకటపతిరాజు.

అందరికీ తెలిసినకథ కాబట్టి కథన శిల్పం మరీ అంత కట్టుదిట్టంగా ఉంటే బాగుండు ననిపించింది. శ్రీరంగారావును మించి రాణించిన శృంగారంగారావు తరవాత, అంత బాగున్న మరో అంశం సంగీతం. ఒకటి పాతబాలనాగమ్మ పాట (రాజేశ్వరరావు చేసినది) వినిపించారు. మిగతావి కొత్తవి. పాటలు అన్నీ బాగున్నాయి, కొత్తగానూ ఉన్నాయి. హిందూస్థానీ బాణీలో, రాజసులోచన చక్కని నృత్యానికి అలంబనంగా సుశీల పాడిన అందము ఆనందమూ అనేపాట మనోహరంగా ఉంది. ఆపాట చిత్రణకూడా పాట అంత అందంగా నేత్రపర్వంగా ఉంది. మరి రెండు జోలపాటలు గూడా హాయిగా ఉన్నాయి. సంగీత దర్శకుడు టి. వి. రాజు కొత్త బాణీలను చక్కని వాద్యసమ్మేళనంతో వినిపించినందుకు అభినందనీయుడు.

మొత్తంమీద ఆరంభలోనూ మధ్యన ఒకటి రెండుచోట్లా ఓమోస్తరుగా లేల సాగుతున్నా చాలవరకు కొత్తగా వినోదకరంగా ఉన్న ఈ చిత్రం సకుటుంబంగా చూడతగినది. ★

## కాగజ్ కె ఫూల్

గురుదత్ సినిమాస్కోపుచిత్రం 'కాగజ్ కె ఫూల్' ఎంత బావుంటుందని ఆశపెట్టిందో అంతా నిరాశ కలిగించగలిగింది. ఒక సమగ్ర ప్రజ్ఞ, విలువైన కాలం, బోలెడంత డబ్బు. రెండు మూడు మైళ్ళ సెల్యులాయిడ్ ఫిలుం అన్నీ వృథా అనిపించింది. పేరులాగే ఈచిత్రంకూడా రంగురుచీవాసనా లేని పువ్వు. సాంకేతికమైన హంగులవల్ల, గురుదత్ కు గల ప్రతిభవల్ల రూపురేఖలు మాత్రం అందంగా కుదిరి చిత్రం చక్కని పువ్వులా తయారైంది. అంతే. ఇది ఇలా జరగటానికి కారణం కథ, కథలోని ముఖ్య పాత్ర డొల్లగా, మెతకగా ఉండడం. కథకి లక్ష్యశుద్ధి లేకపోవడం.

ఇది ఒక ఫిలిండైరెక్టరు కథ. అతని సినీ జాతకం నిజానికి ఏమంత అద్భుతమైనదిగా కూడా తోచదు. ఓమోస్తరు దర్శకుడు. అతను ఒక కలవారింటిపిల్లని పెళ్ళిచేసుకుంటాడు. ఆమెకీ, ఆమె కన్నవారికీ సినిమావాళ్ళంటే చిన్నచూపు. చులకన. అందుకని ఆమె అతన్ని సినిమాపని వదిలెయ్యమంటుంది. అతను వినకపోయేసరికి తనే అతన్ని వదిలేసి పుట్టినింటికి వెళ్ళిపోతుంది. డైరెక్టరు కుప్పకూలిపోతాడు. ఆవిచారంలో అతను ఎలాగో 'వహీదా రెహమాన్' ను చేరదీసి కొత్తతారగా తన చిత్రంలో పరిచయం చేస్తాడు. ఆమె తారాపథాని కెక్కాక, కథ బలీయం కావటం వల్ల కొన్ని సినీ కారణాలు [illegible] దూరంగా పోతుంది. అందుకోసమే ఆగినట్లు అతను హఠాత్తుగా దుఃఖసముద్రంలో మునిగి మనోరథసముద్రంలో తేలుతాడు. ఇలా కొన్ని రీళ్ళు తిరిగాక అర్థరహితమైన మరణం — ఎటొచ్చీ ఫోటోజెనిక్ గా పొందుతాడు. అతను ఎంత ప్రయత్నించినా ఇంత జరిగేదికాదని మనకు అనిపిస్తుంది కాబట్టి చివర్న అతనిమీద సానుభూతి కలగదు. సినిమావారిమీదా కలగదు. కాని, గురుదత్ వంటివాడు చిత్రంతీసినపుడు సినిమామీద ప్రజలకు గల దురభిప్రాయాలను పోగొడతాడని అనుకుంటాం. అతనలా చేయకపోతే బాధపడతాం. పోనీ అలాటి పనులు కాకపోతే పోయె హృదయంగమమైన కథను చెప్పాడా? హృదయాన్ని బద్దలు చేసేటంత దుఃఖస్థితిని అందులో ఒక మూల ప్రతిభూమిక హృదయాన్ని ఆవిష్కరించాడా? అదీ జరగలేదు. గుండె బద్దలు కావటం కాదుగదా, చీటికీమాటికీ ఆవులిస్తాం, ఎంత జాలిగుండె ప్రేక్షకుడికైనా. ఈ విధంగా గురుదత్ చేసిన ఈ ప్రయత్నం బాధ, నిరాశ కలిగించింది.

ఇక సాంకేతికంగా ఈ చిత్రం మెచ్చుకు తీరవలసినదే. చక్కని ఛాయాగ్రహణం— మనదేశానికి తొలిసారిగా సినిమాస్కోప్‌లో కథను నేత్రపర్వంగా చూపించింది. గురుదత్ దర్శకత్వ శిల్పం ఆయా సన్నివేశాలను ఎంతో అందంగా సున్నితంగా చక్కగా మరీ చూపింది. సంగీతం యథాశక్తి తోడ్పడింది.

ఆయా పాత్రలకు ఉన్న అవధులలో దర్శకుడుగా గురుదత్ ఎంత జాగ్రత్తగా నటించినా అది రాణింపుకు రాలేదు. అతనికి



'రేణుకామాహాత్మ్యం'లో [illegible] వరలక్ష్మి



నందీపిక్చర్స్‌వారి 'నాగార్జున' చిత్రంలో రాజకుమార్, సుజాత.

## కాగజ్ కె ఫూల్

స్నేహితురాలై మనశ్శాంతిని కల్గించిన తారగా వహీదా ప్రశంసనీయంగా నటించింది. జానీవాకర్ మామూలుగాచేసే అల్లరి ఈ దిగులుకథలో ఏమూలా ఆనలేదు. అందరికన్న మిన్నగా తనపాత్రనుధరించినవాడు— దర్శకుడి మామగారుగా నటించిన మహేష్‌కౌల్.

బర్మన్ సంగీతం బాగుందికాని, లక్ష్యహీనమైన ఈకథనుమటుకు అంగుళంకూడా ఉద్ధరించలేక పోయింది.

## దిల్ దేకే దేఖో

బహుళ జనాదరణ పొంది బాగా డబ్బు చేసుకున్న చిత్రంలో కథనే కాస్త తిరగ బోర్లా వేసి వెంటనే మళ్ళీ ఇంకోసినిమా తీస్తే డబ్బురావనేవాళ్లు, ఫిల్మాలయ వారి తొలిచిత్రం 'దిల్ దేకే దేఖో' చూస్తే నాలిక్కరుచుకోవలసి వస్తుంది. చూసి వంగూరకోరు; చూసినందుకు చాలా సంతోషిస్తారు. పైన చెప్పినవిధంగా పారబడ్డందుకు. ఈ చిత్రం,మారువేషం వేసుకున్న 'తుమ్‌సా నహీ దేఖా' చిత్రం. ఇటీవలే విజయయాత్ర చేసిన ఆ చిత్రంలో షమ్మీకపూర్ అమ్మాయిని పిలిచి తుమ్సా నహీ దేఖా (నీలాటి చక్కనిదాన్ని ఎక్కడా చూడలేదు అని తాత్పర్యం) అన్నాడు. ఈసారి దిల్ దేకె దేఖో అంటున్నాడు. (మనసిచ్చి చూడుమని పేచీకోలు) బొంబాయిలో దాదాపు 30 లక్షల మంది చూచి ఆనందించబోతున్న 'దిల్ దేకే......' నిర్మాత శశిధర్ ముఖర్జీ ఈవిధంగా అభినందనీయుడు. నీతిపాటలు కాకుండా వినోదంకోసం ఆయన చిత్రాలు తీస్తాడు. ఇదీ అంతే. కథేమిటి, ఇదేమిటి, అదెందుకు ఇదెలా లాటి ప్రశ్నలు అడకుండా చూస్తే ఈ చిత్రం కులాసాగా సరదాగా ఉంటుంది. ఇందులో కంటికీ, చెవికీ, వాటిద్వారా మనసుకూ నదరనిపించే అంశాలు మూడు నాలుగున్నాయి: ఆశా పరీఖ్ అనేఅమ్మాయి రూపురేఖావిలాసాలు. ఈ అమ్మాయి 17 ఏళ్ల చిన్నది. ఇదే మొదటి చిత్రం. (ఇదివరకు విజయభట్ ఒకసారి బుక్ చేసి,తీసేశారు). ఈ అమ్మాయి చాలాహాయిగా ఈకథలో విహరించి సంతోషపెట్టింది. షమ్మీకపూర్ ఆ చాయల్లో తిరుగుతూ గంతులు వేస్తున్నా ఆమె రాణించగలిగిందంటే అది గొప్పవిషయం అనుకోవాలి. హిందుస్థానీ ఉచ్చారణ కొంత సరిదిద్దుకుంటే ఆశాపరీఖ్ త్వరలోనే బాక్సాఫీసు తార కాగలదు. అందరికీ ఆహ్లాదం కలిగించే మరో అంశం హాస్యం. అందుకు బాధ్యుడైన కొత్త హాస్యనటుడిపేరు రాజేంద్రనాథ్. వేషభాషలూ, వాలకం, అన్నీ హాయిగా కొత్తగా ఉన్నాయి: ఎటొచ్చి కాలంనాటి హెరాల్డ్ లాయడ్‌ను గుర్తుకు తెస్తాయి. నిర్మాత ముఖర్జీ పరిచయంచేసిన మరో కొత్తవ్యక్తి ఉషాఖన్నా. ఈ అమ్మాయికి పదిహేడేళ్లు వయసు. అవకాశం ఇస్తే ఎందుకు సాధించలేదూ అన్న ఊహతో ముఖర్జీ ఈమెకు హఠాత్తుగా సంగీత దర్శకత్వం ఇచ్చారు—ఆమెకున్న అభి[రుచి] చూసి - ఆయన ఊహ అపోహ కాకుండా ఈ అమ్మాయి చాలా మంచిపాటలు చేసి మాట దక్కించింది. కొత్తవాళ్లను ప్రోత్సహించాలని ఉత్సాహపడేవారందరికీ ధైర్యం కలిగించింది.

ఉషాఖన్నా సంగీతం అంతా పాశ్చాత్య సంగీతంపద్ధతిలో ఉన్నా వినడానికి హాయిగానే ఉంది. నయ్యర్ ప్రభావం ఆటే పడకుండా జాగ్రత్తపడితే ఈమె పైకిరాగలదు.

మొత్తంమీద ముగ్గురు కొత్త కళాకారుల కృషి, దర్శకుడు నసీర్‌ఖాన్ నైపుణ్యం చక్కని ఛాయాగ్రహణం కలిసి పెద్ద ఆశయాలతో నెలకొన్న ఫిల్మాలయ తొలి చిత్రాన్ని ఆకర్షణీయంగా తయారు చేశాయి. ఈ చిత్రం బాగా డబ్బూ పేరూ గడించుకుంటుందనడానికేమీ సందేహం లేదు.

—టచ్‌స్టోన్.

## మృతి

ప్రసిద్ధ చలనచిత్ర దర్శక నిర్మాత దల్‌సుఖ్ ఎం. పంచోలీ గుండెజబ్బువల్ల అక్టోబరు 11 న బొంబాయిలో మరణించారు. ఆయన వయసు 62. సినిమా ఎగ్జిబిటర్‌గా జీవనం ఆరంభించిన పంచోలీ 30 ఏళ్ల క్రితం చిత్ర నిర్మాణరంగంలో ప్రవేశించారు. లాహోరులో స్టుడియో నిర్మించి చాలా చిత్రాలు తీశారు. 'ఖజాంచీ' చిత్రంతో ఆయనకు మంచిపేరు వచ్చింది. ఆయన ఇతర చిత్రాలలో జమీందార్, ఖాన్‌దాన్, పూంజి, దాసి, ఢంకీ, షరిన్ ఫర్హాద్, మీనాబజార్ ఎన్నతగ్గినవి. నూర్జహాన్, నూతన్, గీతాబాలి, ప్రాణ్, ఓంప్రకాష్ వంటి నటీనటులూ, స్వర్గీయ గులాం హైదర్, ఇటీవలి ఓ. పి. నయ్యర్ వంటి సంగీత దర్శకులూ పైకిరావడానికి పంచోలీ చాలా దోహదంచేసి వారిని ప్రోత్సహించారు. మరణకాలంనాటికి పంచోలీ 'నిర్మల' అనే చిత్రం మహేష్‌కౌల్ దర్శకత్వాన నిర్మిస్తున్నారు. నూతన్ చెల్లెలు తనూజకు అందులో ఆయన అవకాశం ఇచ్చారు.

పంచోలీ మరణవార్త వినగానే నగరంలో స్టుడియోలన్నీ సంతాపసూచనంగా మూసివేశారు.

# క్రీడా రంగం:

# మనఫుట్ బాల్ పరిస్థితి

కొన్ని సంవత్సరాల క్రింద క్రికెట్ ఒక్కటే ఆటక్రింద లెక్క వేయబడేది. మిగతా ఆటలన్నీ దానిముందు దిగదుడుపే. మదరాసులో టెస్టు మాచీలు అయినప్పుడు ఏదో ఒకరోజు ఆటచూడ్డానికి సీజను టిక్కట్లు కొనేవారంతా తెల్లారగట్ల 5 గంటలకు లేచివస్తేకాని టిక్కట్లు దొరికేవి కావు. టిక్కట్లు ఇవ్వడం 9 గంటలకి మొదలుపెట్టేవారు. నాలుగుగంటలు అవస్థపడి క్యూలోనుంచుని టిక్కట్టుకొని లోపలికి వెళ్ళేటప్పటికి జనం కిక్కిరిసి ఉండడంవల్ల కాళ్ళుచేతులు చాచుకుందుకు చోటైనా ఉండేదికాదు. సాయంకాలం అయేటప్పటికి ఆడినవారికంటే వీరే ఎక్కువ అలసట పొందేవారు. రానురాను పైకారణాలవల్ల నైతేనేం, మనదేశంలో క్రికెట్ ఆటస్థాయి తగ్గడంవల్ల నైతేనేం, క్రికెట్టుపైన అభిలాష కొంత తగ్గింది. దేశంలో ఫుట్ బాల్, హాకీలలో, జరిగేపోటీలలో ఆసక్తి ఎక్కువైంది. హాకీకంటె ఫుట్ బాలే ఇప్పుడు ఎక్కువ ప్రజాదరణ పొందుతూంది. ప్రజాదరణతోపాటు ఆటస్థాయి ఎక్కువ అభివృద్ధి పొందింది. ఆటస్థాయి ఎక్కువ అవడానికి ముఖ్యకారణం మనవారు ఫుట్ బాల్ బూట్లతో ఆడడం. అఖిలభారత ఫుట్ బాల్ జట్టు కోచ్ అయిన స. ఎ. రహీంగారు చాల కృషిచేసి దేశంలో ఆటస్థాయిని ఎక్కువచేశారు.

1948 లో జరిగిన ఒలింపిక్ పోటీలలో భారతజట్టు పాల్గొన్నది. ఫ్రాన్సు దేశంతో గోలు తేడాతో ఓడిపోయింది. 1952 లో హెల్‌సిన్‌కిలో జరిగిన ఒలింపిక్ పోటీలలో యూగోస్లేవియాజట్టు, భారతజట్టును 9 గోల్సు తేడాతో (స్కోరు (10-1) చిత్తుగా ఓడించింది. ఈరెండు ఒలింపిక్ పోటీలలోను భారతజట్టు వారు బూట్లులేకుండానే ఆడారు.

1952 ఫలితాలనుబట్టి ఒలింపిక్ ఎసోసియేషన్ వారు 1956 లో జరుగబోయే ఒలింపిక్ పోటీలకు ఫుట్ బాల్ జట్టును పంపుటకు అయిష్టతను వ్యక్త పరిచారు. చివరికి ఎట్లాగో ఒలింపిక్ పోటీలలో ...నేందుకు ఫుట్ బాల్ జట్టును పంపారు. ...ు వారికి అదృష్టం కూడకలసి వచ్చింది. ...రౌండులో వీరు అంతకుముందు ఏ...లో విజేతలైన హంగేరి జట్టుతో ...డాలి. అయితే హంగేరీ దేశంజట్టు ...లో పాల్గొనలేదు. ఆడిన మొదటి మాచ్‌లో భారతజట్టు ఆస్ట్రేలియా దేశాన్ని రెండుగోలుల తేడాతో 4-2 స్కోరుతో ఓడించారు.

1956 ఒలింపిక్ ఫుట్ బాల్ పోటీలలో భారతదేశం జట్టు సెమిఫైనల్సు దాకా వచ్చింది. సెమిఫైనల్సులో యూగోస్లావియాతో ఆడవలసి వచ్చింది. ఈ రెండు జట్లకు జరిగిన పోటీ ప్రేక్షకులలో చాల ఉత్సాహాన్ని కలుగజేసింది. ప్రథమార్ధంలో యిరుపక్షాలవారు గోలులను చేయలేక పోయారు. తరువాత మొట్టమొదటి గోలును భారతదేశమే చేసింది. అయితే ఆఖరి అర్ధగంటలో యూగోస్లావియాజట్టువారు నాలుగు గోల్సు చేసి, మాచ్‌ని మూడుగోల్సు తేడాతో నెగ్గారు.

ఒలింపిక్ పోటీలలో నెగ్గిన దేశానికి గోల్డు మెడల్ ఇస్తారు. రెండవ స్థానాన్ని సంపాదించిన దేశానికి సిల్వర్ మెడల్ యిస్తారు. మూడవ స్థానాన్ని నిర్ణయించుటకుగాను సెమిఫైనల్సులో ఓడిపోయిన రెండుజట్ల వారికి పోటీ పెట్టారు. 1956 ఒలింపిక్ పోటీలలో బ్రాంజ్ మెడలుకు జరిగే పోటీలలో భారతదేశం బల్గేరియాతోటి ఆడవలసి వచ్చింది. బల్గేరియా ఈ పోటీని మూడుగోల్సు తేడాతో (స్కోరు 3-0) ఈ పోటీని నెగ్గారు.

1956 లో జరిగిన పోటీల ఫలితంగా మనదేశంలోను, ఆటగాళ్లలోను వారి శక్తిసామర్థ్యాలపైన నమ్మకము కుదిరింది. ప్రయత్నిస్తే 1960 లో జరిగే ఒలింపిక్ పోటీలలో మునుపటికంటే బాగా ఆడవచ్చు అనే అభిప్రాయం కలిగింది. వచ్చే ఒలింపిక్ పోటీలలో అనుమతుంటే కనీసం బ్రాంజ్ మెడలైనా భారత ఫుట్ బాల్ జట్టువారు సంపాదిస్తారని ఆశించవచ్చు.

—రావు

# చదరంగం

సమస్య 10.

రచన: జెన్‌సన్

నలుపు 6.



తెలుపు 4.

తెలుపు ఆడి మూడెత్తులలో ఆటకట్టాలి.

# కథ కాని కథ

(9-వ పేజీ తరువాయి)

ఉండలేకపోయేది. అమ్మలక్కలలో కొందరికి ఈ కబుర్ల తీరు అసహ్యమనిపించినా, యశోదమ్మ మంచి నీతిమంతురాలు పైగా ఉన్నత అధికారి భార్యకావడంవలన ఎవరూ ఏమీ అనలేక పోయేవారు

ఆకుర్రవాని పేరు శంకరం. అయిదోఫారం చదువుతున్నాడు. తల్లి ప్రతీసందర్భంలోనూ పొగడుతూ ఉండడంనుంచి క్రమంగా తనంతవాడు లేడనే అహం బాగా పెరిగింది.

ఓనాడు పొరుగింటి రామమ్మ శంకరాన్ని పిలిచి "నాయనా పాతికరూపాయిలు మనియార్డరు మా అమ్మాయికి అవసరంగా పంపాలి. కాస్త కట్టిపెడుదూ పుణ్యముంటుంది" అని బ్రతిమాలుకుంది.

"ఒస్ ఇదెంతపని, నాకు ఇదోలెఖ్ఖా!" అని శంకరం ఆమెఇచ్చిన సొమ్ము తీసుకుని అది ఎవరికి పంపాలో అడిగి తెలుసుకుని పోస్టాఫీసుకు వెళ్ళి మనియార్డరు కట్టివేశాడు.

అతను తెచ్చిఇచ్చిన రసీదు తీసుకొని ముసలిరామమ్మ తృప్తిగా ఇంటికి వెళ్ళిపోయింది.

ఆమర్నాడు రామమ్మపేర పాతిక రూపాయల మనియార్డరు వచ్చింది. తనకు ఎవరు మనియార్డరు చేశారా? అని ఆశ్చర్యపోతూ పోస్ట్ మేన్‌వలన వివరాలు తెలుసుకుని చేసేది లేక వేలిముద్రవేసి ఆసొమ్ము తీసుకుంది.

"మాశావా యశోదమ్మా మీవాడి తెలివితేటలు, ప్రయోజకత్వం! నేను పంపిన సొమ్ము నాకే తిరిగివచ్చింది!" అని అవిషయం బయటపెట్టేసరికి శంకరం ముఖంలో కత్తివేస్తే నెత్తురుచుక్కలేదు. తనుచేసిన పొరపాటు తెలుసుకున్నాడు. యశోదమ్మ చిన్నబుచ్చుకుంది. ఈవిషయం ఆవీధిలోని అందరూ తెలిసి అంతా నవ్వుకున్నారు.

కాని ఆనాటినుంచి తనకొడుకు తెలివైనవాడనిగాని ప్రయోజకుడనిగాని యశోదమ్మ ప్రచారంచేయడం మానుకొంది...

పి. నరసింగరావు, జమాల్‌పూర్.

# ★ ఉత్తరాలు ★

[2-వ పేజీ తరువాయి]

విపులముగా పాఠకులకు అందించినందులకు నా హృదయపూర్వక ధన్యవాదాలు!

—యం. డి. నిసారుద్దీన్, ఆకివీడు.

* * *

## "వైద్యార్థులు"

పెత్తిక క్రింద శ్రీ ప్రవీణ్ (29-9-59) లలో ఇచ్చిన అభిప్రాయములతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. ఒక్క వైద్యకళాశాలల్లో నే కాక ఈ పద్ధతి ఇంజనీరింగ్ కళాశాలల్లో కూడా అమల్లో ఉంది. దీనిపై ప్రవీణ్ గారు తమ అభిప్రాయములను అందరిదృష్టిలోకి తీసుకొని వచ్చినందుకు వారికి నా కృతజ్ఞత.

—డి. సూర్యనారాయణ, ఏలూరు.

* * *

## విద్యాప్రమాణం తగ్గుదల

మేం ఈ మధ్య వ్రాసిన "విద్యాప్రమాణం తగ్గడానికి గల కారణాలు" అన్న వ్యాసంపై అనేకమంది పాఠకులు తమ తమ అభిప్రాయాలను, విద్యాప్రమాణం తగ్గడానికి గల మరికొన్ని కారణాలను ప్రతికాముఖంగాను, మాకు స్వయంగా వ్రాసిన ఉత్తరాల ద్వారాను తెలియపరిచారు. ఇంచుమించు అందరికీ కూడా మేం ఉదహరించిన కారణాలన్నీ ఆమోదయోగ్యంగా నే ఉన్నాయి.

కొత్తే ప్రసన్న రావుగారు (అనకాపల్లి) ఈ వ్యాసం తప్పగా వుందనిన్నీ, డిటెక్టివ్ నవలలు చదవడంవల్ల విద్యా ప్రమాణానికి కొంచెంకూడ అపాయం వాటిల్ల లేదనిన్నీ, విద్యార్థులు చాలావరకు డిటెక్టివ్ నవలలు చదవడం మానివేశారని వివర్శించి, నోట్సు విషయంలో పరీక్షా పేపర్లు సెట్ చేసే పెద్దలమీద విరుచుకు పడ్డారు.

1957 సం॥ తరువాత విద్యార్థులు చాలవరకు డిటెక్టివ్ నవలలు చదవడం మానివేశారని రావుగారి అభిప్రాయం. ఆయన ఏ ప్రమాణంతో దీన్ని కొలిచి చెప్పేరో మాకు తెలియదు. కాని మా పరిశోధన ఈ నవలా పఠనం నానాటికీ పెరుగుతోందనే చెబుతోంది. ప్రముగణలను ఆధారం చేసికొని మేం దీన్ని పరిశీలించాం. పాఠకలోకం ఈ నవలలను బాగా ఆకర్షిస్తోంది కాబట్టి రచయితలు ద్విగుణీకృతోత్సాహంతో వీటిని వ్రాస్తున్నారు. ఈ నవంగారంగం క్రొత్త రచయితల్ని ఆకర్షిస్తోంది. ఫలితః నవలా రచన వృద్ధికావడం, పాఠకుల సంఖ్య పెరగడం యెక్కువగా వుండనే తేలతోంది. ఈవిధంగా చూస్తే 1957కంటెకూడ నవలా పఠనం ఎక్కువగా ఉందనే తేలుతోంది. రావుగారన్నట్టు ఒకవేళ విద్యార్థులు యీ నవలాపఠనం తగ్గించి ఉన్నట్టయితే చాల సంతోషం. అందరికీ ఆనందదాయకం.

నోట్సు అంటే ఒక పుస్తకం యొక్క సారాంశం. ఆ పుస్తకంలో వుండే అన్ని ముఖ్య విషయాలు యీ నోట్సులో సంక్షిప్తంగా ఉంటాయి. అంచేత పరీక్ష పేపర్లు సెట్ చేసే పెద్దలు మాత్రం, వర్తమాన పద్ధతి మారనంతవరకు—నోట్సులో వుండే ముఖ్య విషయాలను అడుగకుండా పేపర్లను యెట్లా సెట్ చేయగలరు? దీనికి వారు బాధ్యులు కారు.

ఈ నోట్సుకు సంబంధించినంతవరకు దానిని చదివే విద్యార్థులు కాక, దానిని వ్రాసే వారే బాధ్యులని మా అభిప్రాయం. "మేడ్ ఈజీ నోట్స్" అంటే ఒలిచిపెట్టిన అరటిపండు లాంటిది. అటువంటిది అందుబాటులో వుంటే విద్యార్థులే కాదు, బాధ్యత తెలిసిన ఉపాధ్యాయులు కూడా ఉపయోగించుకుంటారనడంలో సందేహం లేదు. కాబట్టి దీనికి విద్యార్థులంత బాధ్యులు కారని మాకు ఎల్లప్పుడూ వున్న అభిప్రాయం. ఈ నోట్సు విషయాన్ని, అథవా ఇటువంటి విషయాలను విద్యార్థుల మీదకు నెట్టి విద్యాప్రమాణం తగ్గుతోందని ప్రచారం చేయడం మా పని కాదని రావుగారు యిప్పుడైనా గ్రహిస్తారని మా ఉద్దేశం.

గీతా - మూర్తి,

(కాకేనిపాడు)

* * *

## వనితాలోకం

ఆర్యా! శాస్త్రకారుల దృష్టిలో ఇల్లూ-ఇల్లాలు' యను వ్యాసం చాలా బాగున్నది. వారు చెప్పదలచుకున్నది స్పష్టంగా, చాలా విపులంగా చెప్పినారు. వారి వ్యాసంలో ఏమీ తప్పు పట్టలేము. వారు రాసినట్లు స్త్రీ వంటయింటి కుందేలు ఆనాడూ కాదు, యీనాడూ కాదు. (నా. సా. నెల్లూరు)

* * *

వనితాలోకములో శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యంగారు వ్రాసిన 'ఇల్లు ఇల్లాలు' అన్న వ్యాసం చదివాను. వారి రచన చదువుతుంటే నాకు విసుగు కలిగింది. నిద్రవచ్చినది. హాయిగా కాలుమీద కాలు వేసుకొని ఈజీ చెయిరులో కూర్చొని ఫానుముందు చదువు రచనలాగ లేదు. ఆయన రచన చదివి అర్థం చేసుకోవాలంటే ఒంటికాలిమీద నిల్చుండి రచన చదువుటకు మొదలుపెట్టిన వారి ఉద్దేశము కొంత అర్థమౌతుందేమో! సుగవాళ్ళ శ్లోకములతో గూడిన వారిరచన చదువుటకు విసుగుగా, కష్టముగా వుంటే వనితాలోకంలోని వ్యాసములు చదివే ఆడువారికి ఎంత కష్టమో ఊహించవచ్చును. ఈ కాలపు పరిస్థితులకు ఈ వ్యాసం ఏవిధంగానూ [illegible] యుండదు. కేవలం పుస్తకాలలో ము[illegible] ఆవిషయాలు క్రొత్తగా వ్రాసినట్లు పత్రికలలో పేజీలు దండగచేయటం చాలా బాధ కలిగిస్తున్నది. రచయిత చెప్పదలచుకొన్నదొకటి, ప్రయత్నము ఒకటి ఫలితం మరియొకను.

వి. ఎమ్. లక్ష్మి (మద్రాసు)

* * *

సీతగారు వ్రాసిన "మనస్సు చివుక్కుమనిపించే మన వింత ధోరణులు" చాలా ప్రజారంజకంగా ఉంది. అలా మనస్సు చివుక్కుమనిపించే ధోరణులు అందరిదగ్గరా ఉంటాయి. కాని వాటిని మితిమీరకుండా చూసుకోవాలి. శృతిమించి రాగాన పడితే మరీ యితరుల మనస్సులకే కాకుండా, [illegible]స్సులకు గూడా కష్టం కలిగిస్తుంది. అందరూ ఆవిడగారి సలహాలు పాటించగలిగితే చాలా బాగుంటుంది.

వై. వెంకటేశ్వర్లు (పుత్తూరు)

* * *

సి హెచ్. సీతగారు బాగా వ్రాశారు. "అనవసరంగా కరిచి చంపే కుక్కని దగ్గర ఉంచకున్నా" అనే వాక్యంలో రసస్ఫూర్తిగా కుండా చక్కటి సలహా కూడా ఉంది. పై వ్యాసంలో నిత్యజీవితంలో అడుగడుగునా తారసపడే వాస్తవిక దృశ్యాలను చక్కగా పొందుపరిచారు. మధ్య మధ్య హాస్యోక్తులను చక్కగా అతికారు. వారికి నా ధన్యవాదాలు.

ఎస్. పురుషోత్తం (సికింద్రాబాదు)

* * *

[illegible] రహస్యమంటే ఏమంటారా' అని ప్రశ్నించారు సీతగారు. ముమ్మాటికి 'అంతే' అంటాను నేను. సీతగారి స్నేహితురాలు కమల చెప్పినమాటలు అక్షరాల నిజం. మనం మంచి మర్యాదలకోసం ప్రాకులాడి వారి నేమి అనకుండా వుంటే నెత్తి నెక్కుతారు. నాలుగు వాడి మాటలంటే యిక మనజోలికి రారు. రచయిత్రి యీవిషయాన్ని చక్కగా విశదపరిచారు. —కిరణ్, (భీమవరం)

* * *

ఆమె అన్నట్టు, ఇరుగు, పొరుగు [illegible] కాక చిన్నపిల్లలూ చదువుకో [illegible] కూడా యీలాంటి [illegible] లంటారు. వంటి మాటలనే వారికి ఈ వ్యాసం మంచి చెంపపెట్టు లాగుంది.

రాజకుమారి (అన

# పుస్తక సమీక్ష

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారు నిర్వహించిన పుస్తక పరీక్ష పోటీలో రెండవ, మూడవ బహుమతులు పొందిన సమీక్షలు.

## "రాజాజీ కట్టు కథలు"

### (రెండవబహుమతి సమీక్ష)

ప్రసిద్ధ రాజ్యతంత్రజ్ఞులు శ్రీ రాజాజీ రచించిన ఈ గ్రంథంలో ఏభయి ఎనిమిది చిన్న చిన్న నీతికథలున్నాయి. తమిళమూల గనకు శ్రీ టి. వి. రంగాచార్యులు ఆంధ్రానువాదము. శ్రీ రాజాజీగురించి చట ప్రత్యేకముగా పేర్కొనవలసిన పని లేదు. చిన్నమాటలలో పెద్దఅర్థాల నిముడ్చే రి సాహిత్యనైపుణి అందరకూ తెలిసినదే.

ఈ పుస్తకంలోని కథలలో పాత్రలు ం మానవులకే పరిమితమై లేవు. ష్టిలోని ఏ ప్రాణిఅయినా వీటిలో త్రకావచ్చు. ఈ విచిత్రమైనపాత్రసృష్టి ల ఆయాకథలలో మానవుని తప్పిదాలు మరింత శక్తివంతంగా చూపబడ్డాయి. ఉదాహరణకు "కోర్టులో పిచ్చుకలు" అనేకథలో విడాకులు తీసుకుంటున్న దంపతులను పిచ్చుకలు సైతం ఏదరించుకుంటాయి. ద్వారా 'పిచ్చుకలవంటి పక్షులుగూడ సహ్యించుకునే ఈ మానవుల చర్యలెంత సహ్యకరాలైనవో' అనే భావాన్ని మనలో లిగిస్తారు రచయిత.

ఈ గ్రంథంలోని అనేక కథలు నేటి నవుల జీవిత సమస్యలచుట్టూనో, లేక ను నిరంతరం చేసే పొరపాట్ల నో అల్లబడ్డాయి. చాలాకథలలో రాజాజీ తాత్వికదృష్టి, దైవచింతన కానవస్తాయి. మనసులు, తలపులు సంకోగా ఇతరులలోయున్న తన కనీస న్ని విస్మరించి అమాయక ప్రాణులను స్తూ జీవనం కొనసాగిస్తున్న మానవుల త్తవలో పరివర్తన రావాలని, వారు తమ తాల్ని సరిదిద్దుకోవడంలో నీతి విలువలు ధాన్యం వహించాలని ఒక్కొక్క కథా త్తి చెప్తుంది. పల్లెలకూ పట్టణాలకూ ర్థిక పారిశుద్ధ్యాలలోగల భేదాలను, పోలవల్ల కలిగే అనర్థాలనూ, మన ను సాంఘిక జీవనంలో కానవస్తున్న షులు' మొదలైన విపరీతాలను, ఆస్తిక వాదుల పోరులాటలను, తద్వారా ల మాధ్యాన్ని, హింస, అహింసల పై మనలను నడిపిస్తూ జీవకారుణ్య ఇంకా ఎన్నిటినో శ్రీ రాజాజీ లలో ప్రతిబింబింపజేశారు. ప్రత్యే వీటిలో "చిలుక సందేశం" అన్న కథలో 'దేవుడొక్కడే; రూపాలు వేరు' అనే అనేకమతాల సారాలను అంతరమణీయంగా పొదగడం ప్రశంసనీయమైన కృషి.

కాని ఇంత మంచికథలున్న ఈ గ్రంథంలో ఇటువంటికథలప్రక్క ఇవి గూడా ఎందుకున్నట్టు ? అని అనిపింపజేసే కథలు గూడా ఉన్నాయి. వీటిలో ఇతివృత్తాలకూ, వివరణతోపింపజేసే నీతులకు పొసగలేదు. ఉదాహరణకు "పంపకాలకథ"నే తీసుకుందాం. దీన్లో అన్నదమ్ములందరూ తమ తమ భార్యాబిడ్డలతో సమష్టిగా జీవించాలి అని చెప్పబోవడం బాగానేఉన్నా, "ఈ విధంగా మీరు సముష్టిగా జీవించకపోతే మీ ఇళ్ళను దొంగలు కొల్లగొట్టవేయుగలరు" అని చెప్పడంద్వారా ఆ సందేశాన్ని ప్రబోధించడం అమోఘమనిపించదు. ఈ కోవలోనికి చెందినవే "పంకజం తప్పించుకున్నది" మొదలైన కథలు.

శ్రీ రాజాజీ రచనాశైలి చిన్న చిన్న మాటలలో పొదగబడిన గంభీర అర్థాలతో సరళమై సుగమమై హాయిగాఉంది. రంగాచార్యులుగారి అనువాదంకూడ దీనికి తగ్గ స్థాయిలో తేలికైన భాషతో చిన్న వాక్యాలతో పరిశుద్ధమైఉంది. చాలాచోట్ల అనువాదం శక్తివంతంగా నడుస్తుంది. ఒకటవ, 49వ కథలలోని చివరికావ్యాలు, 9వ పేజీలోని చివరిపేరా దీనికి చాలా కొద్ది ఉదాహరణలు మాత్రమే. కాని అనువాదకులు 'సాపడుతున్నారు' (10వ పేజీ) 'మూచూచి' (92వ పేజీ), 'అఘోరించవద్దు' (128వ పేజీ) అన్న పదాలబదులు వేరేపదాలు వాడవలసింది.

దక్షిణ భాషాపుస్తక సంస్థవారు ఒక ఉత్తమగ్రంథాన్ని తెలుగు సాహిత్యానికి కూర్చారు. అయితే ఈ గ్రంథం కాలక్షేపానికి బాగా వినియోగిస్తుందని ఖంటాపథంగా చెప్పలేము. వినోదంకోసం ఈ పుస్తకాన్ని చదువబోతే ఆ పతిత పరిస్థితి రిక్రియేషన్ కోసం 'పథేర్ పాంచాలీ' చూడబోయిన ప్రేక్షకుని పరిస్థితిలా తయారవుతుంది. కాని సాహిత్యంనుంచి జీవితానికి సందేశం కోరుకునే ప్రతివారూ ఈ గ్రంథాన్ని ప్రేమించి తీరుతారు.

కె. భావన్నారాయణ, మద్రాసు.

* * *

## దక్షిణ భారత కథాగుచ్ఛము

### (మూడవ బహుమతి సమీక్ష)

ఈ సంపుటిలో రెండు తెలుగు కథలు, రెండు కన్నడ కథలు. మూడు తమిళకథలూ, రెండు మలయాళ కథలూ మొత్తం తొమ్మిది కథలున్నాయి. కథల ఎన్నిక చక్కగానే జరిగింది.

రైతుకు పశువులతో ఎంత ప్రగాఢమైన, పవిత్రమైన సంబంధం ఉంటేదీ, వాటితో ఎడబాటు కలిగితే అతని హృదయం ఎంత క్షుభిత మయ్యేదీ, పశువులకూ రైతులపట్ల ఎంత విశ్వాసం ఉంటేదీ 'వెంకన్న' కథలో చక్కగా వర్ణించబడింది. పవిత్ర ప్రణయం ఎంత నిస్వార్థమైనదో, ఎంత గొప్పదో, అందులో ఎంత మహత్తరశక్తి ఉందో 'పొగడదండ' వెల్లడిస్తుంది. 'శకుంతల పునరాగమనం'లో వస్తువు పాతదే అయినా మన సత్వ చిత్రణాన్ని బట్టి క్రొత్తదనం కన్పిస్తుంది. పదవులూ, భోగభాగ్యాలూ నిర్మల హృదయులకు ఎట్టి అహంకారమూ కలిగించలేవని



"ఈసారైనా కార్టూన్‌పోటీకి పంపించండి!"

చిత్రం : డి. వెంకటరావు, నెల్లూరు.

త్వరపడండి! త్వరపడండి!

# సన్‌లైట్ రంగులు వేసే పోటీ

## రు. 25,000

విలువైన వందలకొలదీ గొప్ప బహుమతులు!

**రెండు మొదటి బహుమతులు:**
రు. 4000/- రొఖ్ఖము లేదా అంతవ్యయముతో భారత దేశంలోవిలాస విహారము!

**నాలుగు రెండవ బహుమతులు:**
హెచ్.ఎమ్.వి. రేడియోగ్రామ్!

**ఆరు మూడవ బహుమతులు:**
మల్టి ఆల్ వేవ్ రేడియో యున్న దానిలోపాటు ఒకహింద్ అంబాసెడర్ సైకిల్!

**2000 ప్రోత్సాహక బహుమతులు:**
పెయింటింగ్ సెట్ లేదా ఒక బొమ్మ!

తల్లిదండ్రులారా — మీ పిల్లలు ఇంకా పాల్గొనలేదా? జ్ఞాపక ముంచుకోండి. ప్రతి సన్‌లైట్ పై రేపర్ వారికి సన్‌లైట్ రంగులు వేసే పోటీలో పాల్గొనే అర్హతను గలిగించుచున్నది: ఈ పోటీ వయస్సు వారీగా రెండు గ్రూపుల ప్రవేశము నిమిత్తం నియమింపబడినది (1) పది ఏళ్ల లోపు వయస్సువారు. మరియు (2) 10. 15. ఏళ్ల మధ్య వయస్సువారు. రెండు గ్రూపులయందలి చిత్రములన్నూ వేర్వేరుగా పరిశీలించబడి నిర్ణయించబడును. ఒక వయస్సు గ్రూపుయందు మొదటి, రెండవ, మూడవ, బహుమతులను మరియు ప్రోత్సాహక బహుమతులను గెలుపొందినవారికి ఇచ్చే బహుమతులే మరి యొక గ్రూపుయందలి గెలుపుదారులకు కూడా ఇవ్వబడును.

త్వరపడండి!

ముగింపుతేదీ: నవంబర్ 16, 1959.

సన్‌లైట్ అమ్మే మీ దుకాణదారువద్ద నేడే ప్రవేశ పత్రములను ఉచితంగా తీసుకోండి ప్రతి పత్రమందున్నూ ఒక సొగసైన చిత్రమున్నది. మీ పిల్లలు దానికి రంగులు వేయాలి — వారికిష్టమైన ఏ రంగులతోనైనా సరే.

SUNLIGHT SOAP

**కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతుకును!**

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్‌వారి ఉత్పత్తి

S/9-X52 TL